





# జీవిత చరిత్ర

## గాంధీజీ

## బాపు జీవితంలోని కొన్ని సంఘటనలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బాపూ జీవితములోని కొన్ని సంఘటనలు

రచన:

కాకా కాలేల్కర్

అనువాదము:

నందూరి వేంకట కృష్ణమాచార్యులు

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

[ ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి ]

హైదరాబాదు-20

# ప్రకాశకుల విజ్ఞప్తి

'బాపు జీవితములోని కొన్ని సంఘటనలు' అనే ఈ పుస్తకాన్ని గాంధిగారి అత్యంత సన్నిహితులలో ఒకరైన శ్రీ కాకాసాహెబ్ కాలేల్కర్ ఇంగ్లీషులోను, హిందీలోను వ్రాసినారు. అహమ్మదాబాదు నవజీవన్ ట్రస్టువారు దీనిని ప్రచురించినారు. శ్రీ నండూరి వేంకటకృష్ణమాచార్యులు తెనుగులో అనువదించినారు. గాంధీ సాహిత్య ప్రచురణాలయం తమ 39 వ కానుకగా ఆంధ్ర పాఠకలోకానికి ఈ పుస్తకాన్ని సమర్పిస్తున్నారు.

దక్షిణాఫ్రికానుండి బాపూజీ భారతదేశములో కాలు పెట్టగానే, ఆయన సహచర దళములో చేరిన శ్రీ కాకా సాహెబ్ కాలేల్కర్‌కు మూడుదశాబ్దాలకు పైగా బాపూజీతో కలసి మెలసి గడపిన జీవితములో మరపురాని మహా సన్నివేశములు అనేకము ఉండటము సహజము. అట్టివానిలో ఒక నూరింటిని ఈ పుస్తకములో గ్రంథస్థము చేశారు శ్రీ కాకాసాహెబ్. బాపూజీని అర్థము చేసికొనుటకు ఆయన వ్రాసిన వ్రాతలకంటె ఆయన జీవితములో ఇతరులు పొందిన అనుభూతులే ఎక్కువగా ఉపకరించ గలవు. ప్రతి చిన్న విషయములోను ఆయన సత్యాన్వేషణ బుద్ధీ, వివేకమూ ఏవిధముగా పనిచేసేవో మనకు తెలుస్తుంది. గాంధి అంటే తాను పట్టిన కుందేటికి మూడేకాళ్లు అను శఠవాది కాదనీ, తన మౌలిక సిద్ధాంత విషయములో అచంచలుడుగా నున్నా, పరిస్థితులతో తాత్కాలికముగానైనా రాజీపడేవాడనీ మనకు

అర్థమవుతుంది. తోటి మానవులపట్ల ఆయనకు గల అవ్యాజానురాగమూ. ఇతరుల కష్టసుఖాలను అర్థము చేసుకొనుటలో ఆయనకు గల అనురక్తి, మనలను ముగ్ధులను చేసి వేస్తవి.

గాంధిజీ సన్నిధిన వుండి, ఇతరులు పొందిన అనుభూతులు అనేకము గ్రంథస్థము కాకుండా పోయినవి. ఆయన సన్నిహిత సహచరులలో చాలమంది ఇప్పటికే కాలగర్భములో కలసిపోయినారు. మిగిలిన కొద్దిమందిలో చాల తక్కువ మంది తమ అనుభూతులను వ్రాశారు. అందులో కాకా సాహెబ్ కాలేల్కర్ ఒకరు. ఇపుడు కాకాసాహెబ్ గ్రంథస్థముచేసిన సంఘటనలను ప్రచురించినట్లే ఇతరులు వ్రాసిన సన్నివేశములను కూడ ప్రచురించ వలెనని సంకల్పిస్తున్నాము. పాఠకలోకపు ఆదరణ మాకు లభించునని ఆశిస్తున్నాము.

గాంధీ సాహిత్య ప్రచురణలలో అనేక క్రొత్తరీతులను ప్రవేశపెట్టుచున్నాము. పిల్లలకై, నూతనముగా అక్షరాస్యులైన పెద్దలకై పుస్తకములు వెలువడనున్నవి. మారిన కాలపు పరిస్థితులకు గాంధీజీబోధనల అనుసరణఎట్లు అవశ్యమో నిరూపించుటకు, గాంధి తత్వవ్యాప్తి (Promction of Gandhian Philosophy) అనే శీర్షికతో ఏటేటా వివిధ విశ్వకళాపరిషత్తులలో జరిగే మహనీయుల ప్రసంగాలు ప్రచురించనున్నాము. గాంధీజీని గురించి యితరులు వ్రాసిన అనేక విషయములు ఆంధ్ర పాఠకలోకానికి అందించ దలచినాము. ఆంధ్రదేశములో ఆయన కాలములో ఉపకరించిన సంస్థలను, ఆయన సన్నిహిత సహచరులను గురించిన చరిత్రను సేకరించి అందించ

దలచినాము. త్వరలోనే ఆంధ్రకవులు, బాపూజీకి అర్పించు కావ్యాంజలి ఆంధ్రపాఠకలోకం చేతుల నలంకరించ గలదు. అయితే ఈ కార్యము ఎంత గురుతరమైనదో పాఠకలోకానికి విన్నవించ పనిలేదు. ఈ కార్యనిర్వహణకు వారి ఆదరాభిమానాలు ఇప్పటికన్న చాల పెద్దస్థాయిలోను, హెచ్చుగాను లభించవలసి యున్నది.

గాంధీజీ శతజయంతి ఉత్సవ సందర్భముగా పాఠక లోకపు ఆదరణ పూర్వముకన్న కొంత హెచ్చుగా కనిపిస్తున్నను, ఇంతకంటె ఎక్కువ ప్రోత్సాహము లభిస్తేనే గాని ఈ ప్రచురణ కార్యము సులభసాధ్యము కాదని మనవి చేస్తూవున్నాము.

దీనిని తెలుగులో అనువదించి, ప్రచురించుట కనుమతించిన నవజీవన్ ట్రస్టువారికీ, అనువాదకులు శ్రీ నండూరి వేంకటకృష్ణమాచార్యులు గారికీ, ముద్రాపకులు సర్వోదయ ప్రెస్ వారికీ ప్రచురణాలయ పక్షమున కృతజ్ఞతను వెల్లడించుచున్నాము.

| గాంధీ సాహిత్య ప్రచురణాలయం<br>హైదరాబాదు<br>20–3–1969 | కోదాటి నారాయణరావు<br>కార్యదర్శి<br>సంపాదక సమితి |
|---|---|

# పరిచయము

1942 ఆందోళన రోజులలో మేమంతరము జైలుకు పంపబడితిమి. కాని అక్కడకూడ మమ్ములను ఒకే జైలులోనే ఉంచలేదు. నేను మొత్తముమీద ఆరుజైళ్ల మారితిని. ప్రతిష్ఠగలవారిని వారిప్రాంతములలో నుంచుట అపాయకరమని ప్రభుత్వము భావించినది. అందుకని మధ్య ప్రాంతములోని ప్రముఖులైన వ్యక్తులను చాల దూరములో నున్న మదరాసుప్రాంతములోని వెల్లూరుజైలులో నుంచినది. అక్కడే నాకు సంయుక్త పరగణాల కాంగ్రెసు నాయకులతో పరిచయము కలిగినది. ప్రభుత్వమునకు పరిస్థితులు వశములోనికి వచ్చి, కొంత జ్ఞానము కలిగినతర్వాత మమ్ములను వెల్లూరు జైలునుండి తీసికొనివెళ్ళి సియోని జైలులో ఉంచినది. అక్కడ వ్రాతలోను చదువులోను చర్యలోను మా రోజులు చక్కగా జరిగిపోవుచుండెడివి. భోజనము తర్వాత జబల్‌పూరు వాసుడగు ఠాకూరులక్ష్మణసింహజీ చౌహాన్, అమరావతికిచెందిన డాక్టరు శివాజీరావు పట్వర్ధన్, నేను, యితర సజ్జనులు కొందరు కలిసి ఒక పెద్ద గదిలో కూర్చుండి యిక్కడి అక్కడి మాటలు మాట్లాడుచుండేవారము. వరండాలోకంటె అక్కడ వేడి కొంచెము తక్కువగా ఉండెడిది.

పూజ్యుడగు గాంధీజీ విషయము ప్రజలు నన్నడుగుట సహజమైన విషయమే. నేనుకూడ మాటలధోరణిలో ఆశ్రమ జీవితమునకు సంబంధించిన ఏదో ఒక కథ వినిపించెడివాడను. ఒకరోజున ఠాకూరు లక్ష్మణసింహజీ–"మీ దగ్గర బాపూనుగురించి యిన్ని కథలుండగా, వాటిని వ్రాసి ఎందుకుంచరు?" అని అడిగెను. వినోదముగ నేను, "నా స్థితి వ్యాసుని స్థితివలెనున్నది. ఆయన బుర్రలో పూర్తి మహాభారత కథ నిండిఉండెను. కాని దానిని వ్రాయుటెట్లను ప్రశ్న ఆయనను ఎదుర్కొన్నది. దానిని వ్రాయగల వ్రాతగాడు యీ ప్రపంచములో ఎవ్వడూ లేనేలేడు. ("పరంన లేఖకః కశ్చిత్ ఏతస్య భువి విద్యతే") నాలుగుచేతులుగల బుద్ధిమంతుడగు గణేశుడు ఆయనకు లేఖకుడుగా దొరికినప్పుడే, మహాభారతము ప్రపంచములో ప్రకటింపబడినది." అని

జవాబిచ్చితిని. దానికి లక్ష్మణసింహజీ నవ్వి, "సరే. నేను మీకు గణేశు డగుటకు సిద్ధముగనున్నాను." అని చెప్పెను. దానికి నేను, "అహోరాత్ర ములు వ్రాయవలసిన పనిలేదు. భోజనము తర్వాత కబుర్లలో గడపుకాల మునే యిందులకు వినియోగించవలెను. జ్ఞాపకమున్నవాటిలో ఒకటి రెండు వ్రాయుటతోడనే ఆరోజు పని పూర్తియగును. అట్లు చేయుటవల్ల ఇతర కార్యక్రమములకు యిబ్బంది ఉండదు. రోజూ ఏదోకొంత వ్రాయుట జరుగును, రోజూ యీ పనికొరకే సమయమంతా వెచ్చించినచో మిగతా పనులన్నీ మిగిలిపోవును. అందువల్ల కలుగు పశ్చాత్తాపమువల్ల యీ పనినికూడ వదలిపెట్టవలసి వచ్చును." అని అంటిని. దీనితర్వాత ప్రతి రోజు కొద్ది కొద్దిగ వ్రాయుటకు నిశ్చయింపబడినది. నెమ్మది నెమ్మదిగా కథలసంఖ్యకూడా పెరుగసాగెను. వ్రాసినదానిని తోడివారలుకూడ చదివి నారు. వ్రాయించుతూ పొమ్మని వారు ప్రోత్సహించినారు.

ఈ కథలు ఏదోఒక ప్రత్యేకమైన ఉద్దేశమును మనస్సులో పెట్టు కుని వ్రాయించలేదు. ఏదైనా చర్చ జరిగినప్పుడు జ్ఞాపకమువచ్చిన సంఘటననే ఆరోజు మధ్యాహ్నము వెంటనే వ్రాయించితిని.

రాజకీయ ఖైదీలు విడుదలయ్యే దినములు వచ్చినవి. ప్రభుత్వపు పెద్ద ఆఫీసర్లు అప్పుడప్పుడు జైలు చూచుటకు వచ్చుచుండెడి వారు. ఒకరోజున ఒక ఆఫీసరు ప్రైవేటుగా, "మిగతావారందరు విడుద లయ్యెదరు. కాని కాకా, వినోబా త్వరగా విడుదలకారు. వీరిద్దరిలోను వినోబా విడుదల కావచ్చును. ఆయనకు వ్యతిరేకముగ మా దగ్గర ఏమీ లేదు. కాని కాకాసాహెబ్ వ్యాసములు పెద్ద తుఫానును రేపినవి. ఆయన విడుదలయ్యే ఆశ లేశమాత్రములేదు." అని చెప్పెను.

నేను సుఖముగా నా కథలను వ్రాయించుట కొనసాగించితిని. వాటిసంఖ్య పెరిగిపోయినప్పుడు కనీసము 108 యైనా కథలుండవలెనని ఆలోచనవచ్చినది. ఆ సంఖ్య నూరుకు దగ్గరపడుటచూచి రోజుకు రెండు మూడు వ్రాయించుట మొదలుపెట్టితిని. ఈ విధముగ నూటికంటె ఒకటి

ఎక్కువైన వెంటనే నేను, వినోబా ఒకసారే విడుదలైతిమి. దీని తర్వాత లక్ష్మణసింహాజీ మొదలైనవారు క్రమంగా విడుదల చేయబడిరి.

శ్రీ లక్ష్మణసింహాజీ బైటకు వచ్చినతర్వాత నా భాషనుదిద్ది. యీ కథలను ప్రకటించెడివాడే. కాని జైలులో చేయబడిన సంకల్పములు బైటకు రావటముతో నిలబడవు. బైటకు వచ్చుటతోడనే బైట ప్రపంచమునకు సంబంధించిన ఏదో ఒకపని నెత్తిమీద పడుచుండును. వీటి భాషను లక్ష్మణసింహాజీ దిద్దుటకు వీలుకాలేదు. నాకును వీలుకాలేదు. ఈ సంఘటనలను వీలైనంతవరకు కాలక్రమముగ నేర్పాటుచేయవలెనని నాకు కోరిక ఉండెను. కాని అదికూడ నావల్ల జరుగలేదు. చాలారోజుల వరకు యివి వ్రాసినవి వ్రాసినట్లే పడియుండెను. చివరకు వీటిని ఎట్లున్నవాటిని అట్లే ఒకసారి అచ్చు వేయించవలెనని తీరుబడియైనప్పుడు రెండవ ముద్రణలో అన్నివిధములగు దిద్దుబాటులను కావించ వచ్చునని నేనాలోచించితిని. దీని ఫలితముగ యీ పుస్తకము యీ రూపములో ప్రకటింపబడుచున్నది.

ఈ జ్ఞాపికలు వ్రాయబడినప్పుడు బాపూ జీవించియుండిరి. దీర్ఘకాలము జీవించవలెనని ఆయన సంకల్పము. దేశముకూడ ఆయన నట్లు జీవింపనీయవలెననియే భగవంతుని ప్రార్థించుచుండెను. ఎప్పుడో గిట్టవి బాపూ యీ జ్ఞాపికలను చూచినచో, నాకు ఆయనపట్లగల భక్తి, విశ్వాసాలవల్ల ఏమైనా ప్రశంసలుగాని గొప్పలుగాని వ్రాశానని అనుకొనకుండా వుండవలెనని వీటిని వ్రాయుటలో అత్యంత సంయమము వహించవలసివచ్చినది. వ్రాతప్రతిని నేను 'నవజీవన్' వారికిచ్చాను. ఇంతలో పూజ్యబాపూజీ గతించారు. వీటిలో కొన్నిమార్పులుచేయవలెనని ఒకసారి ఆలోచించితిని. కాని ప్రస్తుతమవి ఎట్లువ్రాయబడి యున్నవో వాటినట్లే యుంచుట మంచిదని మనస్సులో నిశ్చయించుకొంటిని.

వీటిలో పూజ్యగాంధీజీయొక్క యథార్థదర్శనము పాఠకులకు తప్పకుండా లభించగలదు. కాని దానిని సంపూర్ణదర్శనమనజాలము. ఇవి సంపూర్ణ దర్శనములోని కొన్ని అంశములు. గాంధీజీ జీవితపు

దివ్యత్వము పూర్తిగా వీటిలో ప్రతిబింబించలేదు. చూచువాడు తన శక్త్యాను సారము చూడగలడు. మాటల సందర్భములో జ్ఞాపకమునకువచ్చినవి వ్రాయడమైనది. గాంధీజీ పూర్తి ప్రతిభను గురించి వ్రాయుటకు పూనుకొన్నచో యింకొక విధముగ వ్రాసెడివాడను. నా కట్టి సంకల్పమే లేకుండెను. అయినప్పటికిని బాపూజీ సంపూర్ణ చరిత్రను వ్రాయు వారికి యీ సంఘటనలలో ఉపయోగకరమైన కొంత సమాచారము తప్పక దొరకగలదు. ఈ సంఘటనలకు పూజ్యబాపూజీ మహత్తు వల్లనే మహాత్మ్యము సంక్రమించినది. ఈ సంఘటనలు సత్యములైన వనియే నాపక్షమున నేను చెప్పగోరునది. నాకు జ్ఞాపకమున్నట్లు యిక్కడ నీయబడినవి. కొన్ని సంఘటనలు యితరులనుండి విన్నవాటిమీద ఆధార పడి యున్నవి. అవికూడ సత్యములైనవనే నా నమ్మకము.

దగ్గరగనో దూరముగనో ఉన్నవారెవరి దగ్గరనైన అట్టి సంఘ టనలు లేక సంస్మరణలు ఉన్నచో వారు తమ యీ ధనమును ప్రపంచము ముందుంచవలెనని కోరుచున్నాను. గాంధియుగమునకు చెందిన యీ వారసత్వము మానవజాతికి తప్పకలభించవలెను.

క్రొత్తఢిల్లీ
గాంధిజయంతి 1948

కాకా కాలేల్కర్

ఈ గ్రంథము మరాఠీ, గుజరాతీ, బంగాలీ, ఇంగ్లీషు మొదలైన భాషలలోనికి అనువాదము చేయబడినది. ఇది చాలా సంతోషవిషయము.

క్రొత్తఢిల్లీ
26-6-1952

కా. కా.

# 1

క్రీ. శ. 1915 నాటిమాట. దక్షిణాఫ్రికాలో పని పూర్తిచేసికొని మహాత్ముడు ఇంగ్లండునకు వెళ్ళి అక్కడ నుండి భారతదేశం తిరిగివచ్చినప్పుడు- దక్షిణాఫ్రికాలో విజయుడైన యీ బారిష్టరును కలిసి సంభాషించుటకు ఒక పార్శీ పత్రికా విలేఖరి బొంబాయిలోని ఓడరేవునకు పోయి ఆయనను కలిసికొనెను. మహాత్ముని కలిసికొని సంభాషించు పత్రికా విలేఖరులలో మొట్టమొదటివాడుగ ఉండవలెనని ఆతని కోరిక.

అతను అడిగిన ప్రశ్నలకు జవాబులిచ్చుటకు ముందు బాపు- "సోదరా! మీరు భారతీయులు. నేనుకూడ భారతీయుడను. మీ మాతృభాష గుజరాతీ- నాదికూడ అదే. అటువంటప్పుడు నన్ను ఇంగ్లీషులో ఎందుకు ప్రశ్నలడుగుతారు? దక్షిణాఫ్రికాలో ఉండివచ్చినాను కాబట్టి నా మాతృభాషను మరచిపోయాననుకొంటున్నారా? లేక నావంటి బారిష్టరుతో ఇంగ్లీషులో మాట్లాడుటలోనే గొప్ప ఉన్నదనుకొంటున్నారా?" అని అనెను.

ఆ పత్రికా విలేఖరి సిగ్గుపడ్డాడో లేదో నాకు తెలియదు. కాని తప్పకుండా ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆయన మహాత్మునితోటి తన సంభాషణనుగురించి ఇచ్చిన వర్ణనలో మహాత్ముని యీ జవాబునకే ప్రధాన స్థానమిచ్చెను.

ఆతడు ఏయే ప్రశ్నలడిగినాడో వాటికి బాపూ ఏమేమి జవాబులిచ్చినాడో ఆ సంగతులు నేను మరచి పోయాను. కాని మన దేశనాయకులలో కనీసము ఒక్కరికైన మాతృభాషలో మాట్లాడుటలోగల స్వాభావికత, మహత్వము తెలిసినందులకు అందరికిని ఆశ్చర్యము కలిగినది. చాలమందికి ఆనందముకూడా కలిగినది.

## 2

బాపూ విదేశమునుండి భారతదేశమునకు వచ్చినపుడు నేను శాంతినికేతన్‌లో ఉంటిని. ఆ సంస్థను, దానిలోని వాతావరణమును పూర్తిగ తెలిసికొనుటకు నేను అందులో ఉపాధ్యాయునిగ కొంతకాలము పనిచేయుటకు చేరినాను. రవిబాబు (రవీంద్రనాథటాగోరు) చాల ఉదార బుద్ధితో నా కట్టి అవకాశమిచ్చెను.

అక్కడనే బాపూజీయొక్క ఫినిక్సు ఆశ్రమమునకు చెందినవారు అతిథులుగా ఉండిరి. బాపూ దక్షిణాఫ్రికా నుండి ఇంగ్లండు వెళ్లినప్పుడు తన ఆశ్రమవాసులను శ్రీ ఆండ్రూస్ వద్దకు పంపించెను. శ్రీ ఆంఢ్రూస్ వారిని కొంత కాలము హరిద్వారములోని మహాత్మామున్షీరాం (స్వామి శ్రద్ధానంద్)గారి గురుకులములోనుంచి తర్వాత శాంతి నికేతన్ చేర్చెను.

పత్రికలు చదువుచుండుటవల్ల దక్షిణాఫ్రికాలోని మన భారతీయుల చరిత్ర కొంత నేనిదివరకే ఎరుగుదును.

ఒక స్నేహితునిద్వారా గాంధీజీయొక్క ఆఫ్రికాలోని ఆశ్రమమునుగురించికూడ వినియున్నాను. ఆ నా స్నేహితునిద్వారానే ఆశ్రమవాసులుకూడ నన్నుగురించి వినియుండవచ్చును. శాంతినికేతన్‌కు వెళ్లుటతోనే నేను యీ ఫినిక్సు పార్టీలో దాదాపు ఒక అంగమైపోయాను. ఉదయం సాయంత్రం ప్రార్థనలు వారితోనే చేయసాగితిని. సాయంకాలపు భోజనము వారితోనే చేయసాగితిని. ఈ ఆశ్రమవాసులు ఉదయం లేచి శరీరకష్టము లేక శ్రమదానము చేసెడివారు. శాంతినికేతన్‌వారు వారికి ఒక పనిని అప్పగించినారు. శాంతినికేతన్ భూమిదగ్గరనే ఒక పల్లము ఉండెను. దానిదగ్గరనే ఒక మిట్టయుండెను. ఆ గుట్టను త్రవ్వి పల్లమును పూడ్చుటయే ఆ పని. మేము పది పన్నెండుగురము రోజుకొకగంట కష్టపడితే ఆ పని పూర్తి యగుటకు ఎంతకాలముపట్టునో? కాని మాకు నిష్కామ కర్మ చేయవలసియుండెను. ప్రతిరోజు ఉత్సాహముతో మేము మా పనిని చేసెడివారము. శ్రీ పియర్సన్‌కూడ మాతో వచ్చెడివారు.

బాపూ శాంతినికేతన్‌కు వచ్చినప్పుడు రాత్రి చాల ప్రొద్దుపోవువరకు ఆయనతో మాట్లాడుచుంటిమి. ఉదయం లేచి ప్రార్థన తర్వాత మేము శరీరకష్టముకొరకు పోయితిమి. అక్కడనుండి తిరిగి వచ్చినప్పుడు మా కండ్లబడిన దృశ్యము నన్నాశ్చర్యపరచినది. మా ప్రాతఃకాలభోజనము, పండ్లు మొదలైనవి కోయబడి వేరు వేరు పళ్లెరములలో సిద్ధముగా

నుంచబడి యుండెను. మేమందరము పనికిపోతిమి. మరి తల్లివలె కష్టపడి దీనినమర్చినదెవరు? 'ఇదంతా చేసిన దెవరని నేను బాపూను ఇంగ్లీషులో అడిగినాను. (ఆ రోజులలో నేను ఆయనతో ఇంగ్లీషులోనే మాట్లాడెడివాడను) "ఏం! నేనే చేసినా"నని ఆయన జవాబిచ్చెను. నేను సంకోచముతో, "మీరెందులకు చేసినారు, మీరంతా సిద్ధపరిస్తే సుఖముగా కూర్చొని తినటం నాకు నచ్చదు." అని నేనన్నాను. దానికి ఆయన "అందులో ఏమున్నది?" అనినారు. "మీవంటివారి సేవనుగొను యోగ్యత మాకుండవద్దా?" అని నేనన్నాను.

దీనిమీద బాపూ యిచ్చిన జవాబునకు నేను సిద్ధముగా లేకుంటిని. మాకు యోగ్యత ఉండవద్దా, (We must deserve) అనుమాట వినగానే ఆయన which is a fact (అనగా మీరన్నమాట వాస్తవము) అని స్వాభావికత ఉట్టిపడునట్లనెను. నేను ఆయనవంకే చూస్తూ ఉండి పోయాను. అప్పుడు నవ్వుతూ ఆయన "మీరు అక్కడకు పనికివెళ్ళినారు. తిరిగివచ్చి ప్రాతఃకాల భోజనము ముగించుకొని మరల అక్కడ పనిచేయుటకు వెళ్ళెదరు. నాకు తీరుబడియుండెను. అందుచేత నేను మీకాలము వృథా కాకుండ తప్పించితిని. ఒకగంట కష్టపడి అట్టి ప్రాతఃకాల భోజనము (నాస్తా) పొందుటకు యోగ్యతను మీరు సంపాదించుకొన్నారుగదా?" అని పల్కెను.

యోగ్యత మాకుండవద్దా (We must deserve) అని నే ననుటలో నా ఉద్దేశము. ఇట్టి గొప్పనాయకుని, సత్పురుషుని సేవగొను యోగ్యత మాకుండవద్దా అని. కాని ఈ నా అర్థము ఆయనకు తట్టనే లేదు. ఆయన మనస్సులో మనుష్యులందరు ఒకటే. ఒకదిక్కున నేను సేవచేశాను. అందుచేత ఆయన సేవగొనుటకు నేను అధికారినైతినని ఆయన భావించెను.

## 3

1914 సంవత్సరములోని ఉత్తరార్థపునాటి మాట. మొదటి ప్రపంచయుద్ధము మొదలైనది. గాంధీజీ భారతదేశమునకు తిరిగిరాలేదు. నేను శాంతినికేతన్ చేరినప్పుడు అక్కడి వంటశాలలో గోధుమరొట్టెలు తయారగుచుండెడివి కావు అందరు అన్నమే తినెడివారు. అజ్మీరు ప్రాంతమున నివసించివచ్చిన యిద్దరు ముగ్గురు బెంగాలీ యువకులుండెడివారు. వారికొరకు కొద్దిగా రొట్టెలు తయారుచేయబడుచుండెడివి. మొదటిరోజున నేను రొట్టెలు కావలెనన్నప్పుడు వాటిని నాకియ్యగా అన్నింటిని నేనొక్కడినే తినివేసినాను. ఆ రొట్టెలుకూడ చర్మమంత పలుచనగా తయారయ్యెడివి. వాటికి నేను మొరాకో చర్మము (Morocco leather) అని పేరుపెట్టినాను.

ఆ రోజులలో స్వభావమువల్లనే నేను పెద్ద ప్రచారకుడుగా ఉండెడివాడను. అందరి భోజనములో అన్నము

తక్కువగానుండి రొట్టెలు ఎక్కువగానుండవలెనని నా పట్టుదల. నా ప్రచార ఫలితముగా అయిదుగురు అధ్యాపకులు పదకొండుమంది విద్యార్థులు వేరే వంట నేర్పాటు చేసుకొనుటకు సిద్ధమైనారు. ఈ దళమునకు నేను (Self helpers' Food Reform League) (స్వావలంబకుల ఆహార సంస్కార మండలి) అని పేరు పెట్టితిని. మేమంతా కలిసి మా చేతులతోనే వంట చేసికొనెడివారము. వంటగిన్నెలుకూడ తోముకొనెడివారము. మసాలా ద్రవ్యముల నుపయోగించెడివారముకాము. రొట్టెలను నేనే తయారుచేయవలసి వచ్చెడిది. అవి ఎంత బాగుగా తయారయ్యెడివనగా లీగులో సభ్యులుకానివారుకూడ వాటిని తినుటకు రాసాగిరి. మా క్లబ్బులో సంతోషబాబు మజుందారుకూడా ఉండెను. ఆయన అమెరికాలో చదువుకొని వచ్చెను. ఒకరోజున నేను గిన్నెలుతోముటవల్లను, గదులను శుభ్రముచేసికొనుట వల్లను ఆత్మకూడ పరిశుద్ధమగునని అన్నాను. ఆయన అది విని నవ్వెను. తర్వాత ఆయన హృదయమును పరిశుభ్రమొనర్చుకొనుట అంత సులభము కాదనెను.

ఏది యెట్లయినను మాలో బంధుభావము బాగుగా వృద్ధిచెందెను. శాంతినికేతన్ వారు మా ప్రయోగమునకు కావలసిన సౌకర్యములన్నియు కలుగజేసిరి.

గాంధీజీ శాంతినికేతన్ వచ్చినప్పుడు మా యీ పనిని ఆయన చూచెను. చాల సంతోషపడెను. కాని ఆయనది చాలా లోభస్వభావము. "ఈ ప్రయోగమింత చిన్న

ఎత్తున ఏల కొనసాగింపబడుచున్నది ? శాంతినికేతన్‌లోని వంటపనిని స్వావలంబన తత్వముమీద ఆధారపడి ఏల కొనసాగింపరాదు ?'' అని అనసాగెను.

సరి ఆ దక్షిణాఫ్రికా విజేత అక్కడి అధ్యాపకులను వ్యవస్థాపకులను పిలువనంపి వారిముందు తన ప్రతిపాదన నుంచెను. వారు పెద్ద సంకోచములో పడిపోయినారు. ఇంత పెద్ద అతిధికి ఏంజవాబు ఇయ్యాలి ?.అనిగాంధిజీ ఈ తొందర పాటు నాకు కొంచెము అనుచితముగా తోచినది. ఆయనతో 'నా చిన్న ప్రయోగము కొనసాగుచున్నది. వారికి నచ్చితే నెమ్మది నెమ్మదిగా అట్టి క్లబ్బులు ఇంకను ఏర్పడగలవు' అని అన్నాను అంతతో ఆగక నేను- రెండువందలమంది వంటపని క్రొత్తపద్ధతిని బాగుగా నడువకపోవచ్చు. అందుచేత 25 మందితోగాని 30 మందితోగానికూడిన చిన్న చిన్న క్లబ్బులు ఏర్పాటుచేసిన బాగుండునన్నాను.

కర్మవీరుడు నా ప్రతిపాదనను అంగీకరించునా ? ఆయన అనసాగెను. "ఎనిమిది క్లబ్బులను ఏర్పాటుచేసినచో మీకు వంటపనిలో కుశలులగువారు 16 గురు కావలెను. ఇంతమంది మీదగ్గర ఉన్నారా ? పెద్దపెద్ద సైన్యము ఏవిధంగా పనిచేస్తుందో అదేవిధముగా మనముకూడ పని చేయవలెను. కలిసిమెలిసి పనిచేయుటను కలిసి భోజనము చేయుటను అలవాటుచేసికొనవలెను. చిన్న చిన్న క్లబ్బులు ఏర్పాటుచేయాలంటే ఇక్కడివారు సిద్ధమైన తర్వాత,

కొన్ని నెలల తర్వాత, ఏర్పాటుచేసికొనవచ్చును. ఇప్పుడు మాత్రము అందరికిని ఒకచోటనే వంటకావలెను".

ఆయన వాదన సరియైనది. నేనిక మాట్లాడలేదు. కాని నేను మనస్సులో-"సంస్థ మీదికాదు. నాదికాదు. దీనికితోడు గురుదేవుడు (శాంతినికేతన్‌లో అందరు రవి బాబును గురుదేవుడని పిలుస్తారు) ఈ సమయంలో యిక్కడలేడు. అట్టియెడ ఇంతపెద్ద ఉత్పాతానికి మీ రెందుకు పూనుకుంటున్నారు?" అని అనుకొన్నాను.

బాపూ శ్రీ జగదానంద బాబును, శరత్ బాబును పిలిచి, "ఇక్కడ వంటవాండ్రు నౌకరులు కలిసి ఎంత మంది ఉన్నారు?" అని అడిగెను. దాదాపు ముప్పది యైదుమంది ఉన్నట్లు తెలిసిన తర్వాత, "ఇంతమంది నౌకరులను ఎందుకు పెట్టుకొంటారు? వీరందరిని పంపి వేయండి". అని చెప్పినాడు. పాపమా వ్యవస్థాపకులు దిగ్భ్రాంతులైనారు. ఎకాయెకి మేమట్లు చేయజాలమని వారు సూటిగా చెప్పవలసింది. కాని శ్రీ ఆండ్రూస్, పియర్సన్‌లు బాపూ ప్రతిపాదన పక్షములో ఉండుట వారు చూశారు. అంతేగాక గురుదేవుని అల్లుడైన నగీన్‌దాసు గంగూలికూడ వారిప్రభావములో పడిపోయినాడు. ఇక విద్యార్థులా కోతులవంటివాళ్ళు. క్రొత్తవిషయమేదైనాసరే సులభముగా వారికి శివమెక్కుస్తుంది. వాతావరణమంతా ఉత్తేజితమైపోయింది. శ్రీ ఆండ్రూస్‌కు బ్రాహ్మణజాతికి

చెందిన వంటవాండ్లను తీసివేయించుటలోనున్నంత శ్రద్ధ స్వావలంబనమీద లేకుండుట నేను కనిపెట్టినాను. విశ్వమంతా ఒకే కుటుంబమని విశ్వసించు యీ సంస్థలో బ్రాహ్మణ వంటవాండ్రు తమ సనాతన పద్ధతులను కొనసాగించుతూ ఎవరిని తమ వంట యింట్లోకి రానిచ్చేడివారుకారు.

కాని మేము సంఘ సంస్కరణ, మతసంస్కరణ చేయాలనే ఉద్దేశముతో ప్రేరితులము కాలేదు. మేము కోరినదల్లా మా జీవితములను సంస్కరించుకొనవలెననియే.

బాపూ విద్యార్థులను ప్రోగుచేసి యిట్టి మార్పు వారికిష్టమో కాదో కనుగొనవలెనని నిర్ణయింపబడినది. నౌకరులు వెళ్ళిపోయిన తర్వాత పనిచేయవలసిన వారు వారేకదా! మిష్టర్ ఆండ్రూస్ బాపూ దగ్గరకువెళ్లి, "మోహన్, నేడు నీవు నీ వక్తృత్వశక్తినంతనూ ఉపయోగించవలసి ఉంటుంది. కుర్రవాండ్లు మంత్రముగ్ధులగునట్లు వారికి ఉద్రేకపూరితమైన అపీలుచేయి. ఎందుచేతనంటే నీ అపీలుమీదనే అంతా ఆధారపడియున్నది." అని చెప్పసాగెను. బాపూ జవాబేమీ యియ్యలేదు.

విద్యార్థులు ప్రోగైనారు. మేమంతా గాంధీజీ ఉద్రేకపూరితమైన అపీలు వినుటకు చెవులలో హృదయాలు పెట్టుకొని కూర్చుండినాము.

కాని మేము విన్నదేమిటి? శాంతమైన మామూలు గొంతుక. పూర్తిగా వ్యవహారమునకు సంబంధించిన మాటలు. వాటిలో ఎక్కడా వక్తృత్వము లేదు. ఉద్రేకము లేదు. భావుకత్వమునకు అపీలు లేదు.

అయినప్పటికిని ఆయనమాటలు పనిచేసినవి. షోకిల్లాలని, సుఖమునే కోరేవారని నాకు తెలిసిన విద్యార్థులుకూడ ఉత్సాహ పరవశులైనారు. ఈ ప్రయోగమునకు తమ సమ్మతి నిచ్చినారు.

ఇప్పుడు వ్యవస్థాపకులు - బలములేని తమ ఆఖరి అభ్యంతరమును బైటపెట్టినారు. "నౌకరులనందరిని, నౌకరీ నుండి నేటికి నేడే తీసివేయదలచినచో వారికి జీతములు ఇయ్యవలసి యుండును. ఈ సమయములో కోశాధికారి వద్ద పూర్తి డబ్బులేదు. కొంతడబ్బు తీసికొని రావలసి యుండును". అని అన్నారు. గాంధిజీదగ్గర ఉంటే ఆయన వెంటనే ఇచ్చేడివాడు. కాని ఆయన ఇక్కడ అతిథి. ఎవరిని అడగగలడు? ఆయన ఆశ్రమవాసులుకూడ ఆశ్రమము యొక్క అతిథులే. వారి దగ్గరకూడ ఏమీ లేకుండెను. ఆండ్రూస్ వద్ద కూడ అప్పుడు ఏమీ లేకుండెను. నేనో దేశద్రిమ్మరినైన పరివ్రాజకుడను. అయినప్పటికిని, మీావద్ద డబ్బున్నదాయని గాంధీజీ నన్నెట్లా అడిగెనో నాకు తెలియ లేదు. ఉన్నదన్నాను నేను. నావద్ద దాదాపు రెండు వందలు బయట బడినాయి. వాటిని నేను ఆయన కిచ్చి

వేసితిని. ఇక చెప్పవలసిన దేమున్నది? నౌకరులకు జీతాలు ఇచ్చివేయబడెను. వారు ఆశ్చర్యచకితులై వెళ్లిపోయినారు. వంటయింటి బాధ్యత నెవరు తీసుకొంటారన్న ప్రశ్న ఇప్పుడు బయలుదేరినది. నా ఆహార సంస్కరణ మండలి (Food Reform League) నడుస్తూనేఉన్నది. "బాధ్యత మీరు తీసికొంటారా?" అని గాంధిజీ నన్ను అడిగెను. నేను నిరాకరించాను. కాని ఆత్మవిశ్వాసము లేకపోవుట చేత కాదు. ఈ ప్రయోగము నందు అశ్రద్ధవల్లకూడ కాదు. ఈ పని అంతా అధికారము లేకుండా చేయబడుతున్నదనే భావమే అందుకు కారణము. నేను అయనతో - "నా చిన్న ప్రయోగము కొనసాగుతూనే ఉన్నది. అదినాకు చాలు. సర్వవ్యాపకమైన ఇంత పెద్ద పరివర్తనము ఏకాయెకి చేయుట నాకు మంచిదనిపించుటలేదు." అని ఆయనతో నేను అన్నాను. కాని బాపూ అట్టిమాటలతో ఆగే మనిషా? ఆయన ఎంత అదృష్టవంతుడంటే ఒకరు నిరాకరించినప్పటికిని ఆయన పని చేయుటకు ఎవరో ఒకరు దొరకుతూనే ఉంటారు. నా మిత్రుడు హరిహరశర్మని మారుపేరుగల రాజంగం శాంతినికేతన్ లోనే పనిచేయుచున్నాడు. అతనిని మేము అన్నాయని పిలిచేవారము. ఆయన ఆ పనికి సిద్ధమైనాడు. 'నేను వంటయింటి బాధ్యత తీసికొంటాను.' అని అనసాగినాడు. అంతట అతనికి సహాయము ఎవ్వరు చేస్తారన్న ప్రశ్న బయలుదేరినది. అప్పుడు నేను, "నా మిత్రుడు ఏదైనా పని తీసికొన్నప్పుడు అతనికి సహాయం చేయుట నా ధర్మమవుతుంది.

నేను యథాశక్తి సహాయం చేస్తాను.” అని అన్నాను. అంతట గాంధీజీ, “చిన్న ఎత్తున జరుగుచున్న నీ ప్రయోగ మును యీ పెద్ద ప్రయోగముతో కలిపివేసి పూర్తిశక్తిని దానికే వినియోగించవలసింది.” అని చెప్పినాడు.

అట్లే చేయుబడింది. అంతట నేను రాక్షసునివలె పని చేయసాగితిని, పన్నెండు ఒంటిగంటమధ్య యీ నిర్ణయము జరిగియుండవచ్చు. మూడు గంటలకు మేము వంటయింటి బాధ్యత తీసికొని సాయంత్రం పిల్లలకు భోజనము పెట్టినాము. గాంధీజీ స్వయముగా వచ్చి పనిచేయసాగెను. కూరలు తరుగుపని ఆయన చేసెను. రొట్టెలు తయారుచేయుపని నాది. నా రొట్టెలు అందరికిని ఎంత నచ్చినవనగా ఆరు రొట్టెలు తయారగుచోట రెండువందలు తయారగుట మొద లయ్యెను. రాక్షసి (రైలు) బొగ్గుతో నిండిన పొయ్యిలు. వాటిపై వేడి పెనములు, వాటిపై నేను రెండు రొట్టెలను ఒకదానిపై నింకొకటి ఉంచి త్రిప్పుతూ కాల్చెడివాడిని. ఈ విధముగా నేను ఎనిమిది రొట్టెలమీద దృష్టినుంచి కాల్చెడివాడను. విద్యార్థులు రొట్టెలను వత్తి నాకిచ్చెడి వారు. పిండిని మర్దించేపనిని చింతామణిశాస్త్రి చేసేవాడు. పాలు అరటిపండ్లు ప్రాతఃకాల భోజనముగా నుండెడిది. పాత్రలు తోముటకుకూడ పెద్ద విద్యార్థులదండు తయా రైనది. వాళ్ళకుకూడ సర్దారును నేనే. గిన్నెలు తోమేవారి ఉత్సాహము తగ్గిపోకుండుటకు అప్పుడప్పుడు ఎవడో ఒక విద్యార్థి రసవంతమైన నవలను చదివి వినిపించేవాడు. అప్పు

ప్పుడు సితారు వాయించి వినిపించేవాడు. ఈ నా ఏర్పాటు శాంతినికేతన్ లోని రసికులైన ఉపాధ్యాయులకు చాల నచ్చినది.

ఈ విధముగా రెండురోజులు గడచిన పిమ్మట గాంధీజీ తన మిత్రుడైన డాక్టరు ప్రాణజీవన్ దాస్ మెహతాను కలిసికొనుటకు బర్మా (బ్రహ్మదేశము) వెళ్ళుటకు తయారైనాడు. హరిహరశర్మ తానుకూడ ఆయనతో వెళ్లుటకు సిద్ధమయ్యెను. (శర్మగారు డాక్టరు ప్రాణజీవన్ దాస్ మెహతా కుమారులకు ప్రైవేటు మాస్టరుగా యిదివరకు పనిచేసినారు.) నాకు చాల కోపము వచ్చినది. ఫిర్యాదు చేయుటకు గాంధీజీ వద్దకు వెళ్ళాను. గాంధీజీ నా పనిని చూచియే ఉన్నాడు. శాంతముగ ఆయన నాతో "మీరు పనినంతా నడిపించగలరు. కాని మీరు కోరినట్లయితే అయిదారురోజులు అన్నను ఇక్కడ ఉంచి వెళ్ళుతాను. ఆయన తర్వాత రాగలరు." అని అన్నాడు. నా కింకను కోపము వచ్చినది. "బాధ్యతను ఆయన తీసికొన్నాడు. ఇప్పుడు దానిని వదలిపెట్టి ఎట్లా వెళ్ళగలడు? ఇక ఆయన వెళ్ళవలసే ఉంటే అయిదారు రోజులు నామీద దయకొద్దీ ఉండనక్కరలేదు. ఆయన రేపు వెళ్లవలసి ఉంటే నేడే పొమ్మనండి." అని అన్నాను.

క్రొత్త ప్రయోగములో నా ఆసక్తిని గాంధిజీ చూచెను. నా మీద ఏ మాత్రము దయచూపించకుండా

సరే! మంచిది. ఆయన నాతోనే రాగలడనెను. అట్లే రెండవ రోజే అన్న గాంధీజీతో వెళ్ళిపోయెను.

తర్వాత యీ ప్రయోగ మేమైనదో యిక్కడ చెప్ప వలసిన అవసరంలేదు. రవిబాబు కలకత్తానుండి వచ్చాడు. ఆయన యీ ప్రయోగమును ఆశీర్వదించాడు. ఈ ప్రయోగమువల్ల సంస్థకు, బంగాళీలకు చాల లాభము కాగల దన్నాడు.

నెమ్మది నెమ్మదిగా దీని క్రొత్తదనము తగ్గిపో సాగెను. కుర్రవాండ్లు అలసిపోసాగారు. మిస్టరు పియర్సన్ నా వద్దకు వచ్చి-"పని చాలా మంచిది. కాని దీని తర్వాత చదువుటకు వ్రాయుటకు ఉత్సాహముండదు" అని అనెను. చాలా ధైర్యముతో దీనిని నలభై రోజులు కొనసాగించితిమి. తర్వాత సెలవులు వచ్చినవి. సెలవుల తర్వాత ఎవ్వరును యీ ప్రయోగము పేరైన నెత్తలేదు. నేనుకూడ శాంతినికేతన్ వదలి వెళ్ళిపోయాను.

## 4

కొద్దిరోజులలోనే గాంధీజీ బర్మానుండి తిరిగివచ్చెను. మా ప్రయోగము కొనసాగుతూనే ఉన్నది. ఇంతలో పూనా నుండి గోఖలే మరణించినట్లు (ఫిబ్రవరి 1915) తంతివచ్చినది. గాంధీజీ వెంటనే పూనా వెళ్లుటకు నిశ్చయించెను. ఇంతకు పూర్వము గోఖలే ఆయనను సర్వెంట్స్ ఆఫ్ ఇండియా

సొసైటీ సభ్యునిగా చేరమనెడివాడు. కాని గాంధీజీ ఆ విష యమై ఒక నిశ్చయమునకు రాలేదు. కాని తన రాజనీతి గురువుమృత్యువు తర్వాత ఆయన ఆఖరికోరిక గాంధీజీకి ఆజ్ఞతో సమానమైపోయినది. ఆయన పూనా వెళ్లి సర్వెంట్స్ ఆఫ్ యిండియా సొసైటీలో సభ్యుడుగా చేరుటకు దరఖాస్తు పెట్టెను.

దరఖాస్తును చూచి గోఖలేయొక్క యితర శిష్యులు ఇరకాటములో పడిపోయిరి. ఈ కథనంతా గౌరవనీయులైన శ్రీ శ్రీనివాసశాస్త్రిగారు అప్రతిమానమైన తమ భాషలో వర్ణించి యున్నారు. కాబట్టి దానినిక్కడ నియ్యనవసరము లేదు. దానిసార మేమనగా గాంధీజీని వారు జీర్ణించుకో లేరు. లేక తమలో నిముడ్చుకోలేరు. కాని గోఖలేయొక్క రాజకీయ సిద్ధాంతములను గాంధీజీ ఒప్పుకొనెడివాడు. అట్టి సందర్భములో ఆయన దరఖాస్తును స్వీకరింపకుండు టెట్లు? ఈ క్లిష్టపరిస్థితిలో వారు పడిపోయిరి. పరిస్థితులను అర్థము చేసికొని గాంధీజీయే తన దరఖాస్తును ఉపసంహరించుకొని తన గురువుగారి శిష్యులను సంకటమునుండి బైటపడవేసెను. ఆయన సభ్యుడు కాకుండగనే సొసైటీ సభలకు వెళ్ళుచుండెడి వాడు. అంతేగాక ఆ సంస్థకు అప్పుడప్పుడు చాల సహాయము చేసెను.

గోఖలే మరణవార్త వింటూనే గాంధీజీ ఒక సంవత్స రముపాటు చెప్పులు తొడుగుకొనకుండుటకు వ్రతము

పూనెను. దీనివల్ల ఆయనకు చాల కష్టము కలిగినది. కాని ఆయన ఆ వ్రతమును చక్కగ పాలించెను.

# 5

బాపూ బర్మానుండి తిరిగి వచ్చినప్పుడు రవిబాబు శాంతినికేతన్‌లోనే ఉండెను. భారతదేశపు పుత్రరత్నము లిద్దరు ఏ విధముగ కలిసికొందురో చూడటానికి అధ్యాపకుల మైన మేమంతా చాల ఉత్సుకులమై యుంటిమి. ఆండ్రూసుకు మా ఉత్కంఠత ఏమి తెలియును ? తన గురు దేవుని మోహన్‌ను పూర్తిగ తన అధీనములో నుంచు కొన్నట్లు ప్రవర్తింపసాగెను. ఆయన మాలో నెవ్వరిని లోపల గదిలోనికి పోనియ్యలేదు. ప్రాత అధ్యాపకులు ఎదురు తిరిగి లోపలికి చొచ్చుకొనిపోయిరి. ఈ గొప్పవారి ప్రథమ సమావేశము మాకందరి కొక పవిత్రసందర్భమని, మాకు వారి ఆంతరంగిక సంభాషణలను వినాలని లేదని, కొద్దిసేపు కూర్చుండి వెళ్ళిపోదుమని క్షితిబాబు నచ్చ జెప్పినమీాదట మోహన్ యొక్క చార్లీ(ఆండ్రూస్)మనస్సు శాంతించినది.

బాపూతోపాటు మేము దివాన్‌ఖానాలోనికి పోయి నాము. పెద్ద సోఫామీాద కూర్చున్న రవిబాబు లేచి నిల్చుండెను. ఉన్నతమైన ఆయన దివ్యమూర్తి, తెల్లటి జుట్టు పొడుగుపాటి గడ్డము; భవ్యతను పెంపొందించే ఆయన

గాను లేక అంగరఖా, అన్నీ కలిసి ప్రౌఢముగాను, సుందరముగాను ఉండెను. ఆయనముందర గాంధీజీ చిన్న ధోవతీతో ఒక కుడ్తా (చొక్కా) తో కాశ్మీరీ టోపీతో నిలబడితే సింహము ముందర ఎలుక నిలబడినట్లుండెను.

ఇద్దరి మనస్సులలో ఒండొరులపట్ల హృదయపూర్వకమైన ఆదరముండెను. రవిబాబు గాంధీజీని తనతోపాటు సోఫామీద కూర్చుండ ఆహ్వానించెను. గాంధీజీ నేలమీద తివాసీ పరచిఉండుట చూచెను. అటువంటప్పుడు సోఫామీద ఎందుకు కూర్చుండవలె ననుకొనెను. నేలమీదనే కూర్చుండెను. రవిబాబుకూడ నేలమీద కూర్చొనవలసివచ్చెను. మేమంతా కొంతసేపు చుట్టుప్రక్కల కూర్చుంటిమి. వారిద్దరిమధ్య మామూలు కుశలప్రశ్నలైన తర్వాత మేము వెడలివచ్చితిమి.

తర్వాత వారిద్దరు ఎన్నోసార్లు కలుసుకొన్నారు. సంతోషబాబు ఒకరోజున నాతో, "ఈ యిద్దరిమధ్య ఒకరోజున ఆహారమునుగూర్చి చర్చ జరిగినది. అది పూరీలనుగురించి. గాంధీజీ పూర్తి ఫలాహారిగానే ఉండెను. ఆయన రవిబాబుతో - 'నేతిలోగాని నూనెలోగాని రొట్టెలను వేయించి పూరీలను తయారుచేస్తారు. అట్లు చేయుటలో వారు అన్నమును విషముగా మారుస్తున్నారు.' అని అనెను. దానిని విని, రవిబాబు It must be a very slow poison. I have been eating puris the whole of my life and it has not

done me any harm so far. (అది చాల నెమ్మదిగా పనిచేయు విషమై యుండవలెను. నేను నా జీవితమంతా పూరీనే తిను చుంటిని. ఇంతవరకు నా కెట్టి హానియు కలుగలేదు)' అని గంభీరముగ జవాబిచ్చెను." అని చెప్పెను.

# 6

మిస్టర్ ఆండ్రూస్ ఒక అద్వితీయమైనవ్యక్తి. ఆయన పాండిత్యము అసాధారణమైనది. ఆయన మిషనరీ అనగా మతప్రచారకుడుగ యీ దేశమునకు వచ్చెను. దీని వల్ల ఆయన త్యాగనిరతి సేవాభావము పూర్తిగ తెలియును. ఇక్కడకువచ్చి తన మిషనరీ లేక మతప్రచారకుని పని భారత సేవకు అంతరాయ రూపమని, మిషనరీసంస్థ నియమ నిబంధనలు కేవలము బంధన రూపములని గ్రహించి తన రెవరెండును (మతపదవిని) వదలివేసి మామూలు మిష్టరు ఆండ్రూస్‌గానే ఉండిపోయెను. ఆయనది చాల మృదు హృదయము. ఒకరోజున నాతో ఏకాంతముగ మాట్లా డుచు, "నేను భారతదేశపు సేవను యిక్కడి ప్రజల యిచ్ఛానుసారము చేయగోరెదను. ఆంగ్లేయులు యిక్కడికి వచ్చి యిక్కడి ప్రజలకు గురువులయ్యే పద్ధతి నాకిష్టము లేదు.(ఆయన మిసెస్ అనిబిసెంటు నుద్దేశించి యిట్లు చెప్పి యుండును). అదిగాక నేను హిందువునై వారికి వారి మత మును బోధించుపనికి పూనుకొనుటకూడ నాకిష్టములేదు. (ఇట్లు చెప్పునప్పుడు ఆయన దృష్టిలో సిస్టర్ (సోదరి)

నివేదితయుండి యుండవచ్చును.) నేను భారతవాసుల సేవకుడుగనే ఉండగోరెదను." అని చెప్పెను. వాస్తవముగ ఆయన అట్లే ఉండిపోయెను.

దక్షిణాఫ్రికాలో బాపూయొక్క సత్యాగ్రహము ఉగ్రస్వరూపము దాల్చినప్పుడు ఆయన సహాయార్థము యిక్కడనుండి మిష్టర్ ఆండ్రూసును పంపించాలని గోఖలే మున్నగువారు నిశ్చయించారు. శుభముకోరుచు వీడ్కోలు యిచ్చుటకు మిత్రులందరూ సమావేశమైనారు. అందరూ కూడ జ్ఞాపకార్థము శ్రీ ఆండ్రూస్‌కు యిచ్చుటకేదో యొకటి బహుమతిగ తీసికొనివచ్చినారు. ఆయన స్నేహితుడు పియర్సన్‌కూడా ఒక బహుమతిని తెచ్చినాడు. ఆయన నవ్వుతూ, "నీకోసం ఒక విచిత్రమైన బహుమతి తీసికొని వచ్చాను." అని అన్నాడు. ఏ వస్తువుతీసికొని వచ్చాడో ఆండ్రూస్ తెలిసికొనలేకపోయెను. అప్పుడు మిష్టర్ పియర్సన్, "నన్నే నేను బహుమతిగా నీకు యిచ్చుకుంటున్నాను. నేను నీ వెంటవచ్చి చేతనైనంత సహాయము నీకు చేసెదను." అని చెప్పెను. ఇద్దరు దక్షిణాఫ్రికాకు వెళ్లారు. ఇంగ్లీషువాళ్ళమధ్య ఉండుటవల్ల బాపూ యింగ్లీషువాళ్ళ స్వభావమును బాగుగా తెలిసికొనగలడు. అక్కడకు వెళ్లుటతోడనే యీ యిద్దరు మిత్రులు గాంధిజీకికూడ స్నేహితులైపోయారు మిష్టరు ఆండ్రూస్ గాంధీజీతో, "ఇకముందు నిన్ను నేను మోహన్ అని పిలుస్తాను. నన్ను నీవు చార్లీ యని పిలువవలెను." అని అనెను. అందరికంటె యీ

యిద్దరి సంబంధము ఒక తల్లికి పుట్టిన బిడ్డల సంబంధంవలె ఉండిపోయినది. ఎప్పుడైనను మిస్టర్ ఆండ్రూస్ విదేశముల నుండి భారతదేశమునకు తిరిగి వస్తున్నప్పుడు మనదేశమునకు దగ్గరనున్న ఓడరేవునుండి To Mohan love form Charlie (మోహన్‌నకు చార్లీ నుండి ప్రేమాభినందనలు) అని కేబిల్-(సముద్రములోనుండి వచ్చు టెలిగ్రాము) పంపించకుండ ఉండలేకపోయేవాడు. ఈ విధముగా డబ్బు ఖర్చుపెట్టుట బాపూనకు చాలా బాధగా ఉండేది. కాని ఆ మాట ఆయనతో చెప్పుటకు ఎప్పుడూ సాహసించలేదు.

మిస్టర్ ఆండ్రూస్‌నకు మరుపు ఎక్కువ. స్నానము చేయుటకు వెళ్ళితే గడియారం అక్కడనే మరచిపోయేవాడు. ఎవరికైనా ఏదైనా ఇచ్చినా, లేక ఎవరినుండైనా ఏదైనా తీసికొన్నా తరచు అదికూడ మరచిపోయేవాడు. అందుకని బాపూ ఆయనను ఎక్కడికైన పంపితే ఎక్కువ డబ్బిచ్చి పంపుతూ, "మరచిపోయి పోగొట్టుకొనుటకు కూడ డబ్బు కావాలిగదా?" అని నవ్వుతూ అనేవాడు. ఆయన డబ్బుకు లెక్కలుంచేవాడు కాదు. తిరిగి వచ్చినప్పుడు జేబులో మిగిలిన డబ్బులు తన మోహన్‌కు తిరిగి యిచ్చేవాడు.

అటుతర్వాత మిస్టర్ ఆండ్రూస్ బాపూను మోహన్ అని పిలువలేకపోయాడు. మా అందరితో పాటు ఆయన కూడా 'బాపూ' అనే పిలువసాగాడు.

## 7

1915 డిసెంబరు అయి ఉండవచ్చును. బొంబాయిలో కాంగ్రెసు జరుగుతున్నది. తన ఆశ్రమ వాసులతో పాటు బాపూ మార్వాడీ విద్యాలయములో ఉండెను. నేను యింకొకచోట దిగాను. కాని ఎక్కువకాలము బాపూవద్దనే గడిపేవాండను. ఒకరోజు ఆయన ఎక్కడికో వెళ్ళవలసి ఉండెను. డెస్కుమీద ఉన్న వస్తువులనన్నింటిని ఆయన జాగ్రత్త పెట్టసాగెను. చూడగా ఏదో ఒక వస్తువుకొరకు ఆయన వెదకులాడుచుండెను. చాల చింతలో ఉండెను. "బాపూజీ! ఏమి వెదకుచున్నారు?" అని నేనడిగినాను. "నా పెన్సిల్ కొరకు. చాల చిన్నది." అని జవాబిచ్చెను. ఆయన కష్టము తొలుగుటకు, ఆయన కాలము వృథా కాకుండుటకు నేను నా జేబులోనుండి ఒక పెన్సిలుతీసి యియ్యబోతిని. అప్పుడు బాపూ, "వద్దు, వద్దు. నాకాచిన్న పెన్సిలు ముక్కే కావలెను." అని అనెను. అంతట నేను, "దీనిని తీసికోనండి. నేను మీ పెన్సిలు ముక్కను వెదకి ఉంచుతాను. మీ కాలం అనవసరంగా వృథా అవుతున్నది." అని అన్నాను. దానిమీదట బాపూ, "ఆ చిన్న పెన్సిలు ముక్కను నేను పోగొట్టుకొనజాలను. దానిని నటేశన్ యొక్క చిన్ని కొడుకు నాకు మదరాసులో యిచ్చాడని నీకు తెలియునా? ఎంత ప్రేమతో తీసికొనివచ్చి యిచ్చాడు? దానిని నేనెట్లు పోగొట్టుకొనగలను?" అని అన్నాడు.

అంతట మేమిద్దరమూ ఆ చిలిపి పెన్సిలు ముక్క కొరకు వెదకితిమి. అది ఒకమూల దాగియుండెను. అది దొరికినప్పుడే బాపూ మనస్సు శాంతించినది. రెండంగుళాల కంటెకూడ అది చిన్నది. ఇంత చిన్న పెన్సిలును బాపూకు యిచ్చిన ఆ పిల్లవానిని నా మనస్సులో చిత్రించుకొన సాగితిని.

## 8

శాంతినికేతన్‌లో నాకు బాపూతో చాల పరిచయమైనది. ఆయన ఆశ్రమవాసులు అక్కడ ఉన్నారు. వాళ్ళ మధ్యలోనుండి నేనుకూడ వాళ్ళవాడినే అయిపోయానను కోవచ్చును. ఆ రోజులలో బాపూయొక్క పెద్ద కొడుకు హరిలాల్ ఆయనను కలవటానికి వచ్చాడు. అతనితోకూడ నాకు పరిచయమైనది.

బొంబాయి కాంగ్రెసప్పుడు బాపూ మార్వాడీ విద్యాలయములో బసచేసెను. సాయంత్రం ప్రార్థన తర్వాత బాపూ ఏదో వ్రాయుటకని కూర్చొనెను. నేనుకూడ ఆయనదగ్గరనే కూర్చుండి ఏదో చదువుచుంటిని. ఇంతలో హరిలాల్ నా దగ్గరకు వచ్చి, "కాకా! శాంతినికేతన్‌లో మీకు బాపూతో చాల పరిచయమైంది. అక్కడ ఫినిక్సు పార్టీలో ఒకరైనట్లు కలిసిపోయారు. అందుచేత గాంధీజీ ఆశ్రమములో మీరెప్పుడో చేరిపోయి యుందురను కొన్నాము. కాని మీరట్లు యింకా చేరకుండుట మా

కాశ్చర్యముగానున్నది." అని అన్నాడు. దానికి నేను, "బాపూ నన్నెంతగా ఆకర్షించాడో మీకు తెలియనిది కాదు. కాని నేనాయన దగ్గర కెట్లు పోగలను? హిమాలయ యాత్రకు వెళ్ళుటకుముందు ఎవ్వరితో కలిసి నేను దేశసేవా కార్యము చేయుచుంటినో వారికి నామీద అధికారమున్నది. వారేదైన క్రొత్తపనిని ప్రారంభిస్తే నేను వాళ్ళతో కలిసి పనిచేయవలసి యుండును. లేకపోతే, నన్నాకర్షించిన ప్రతి క్రొత్త నాయకుని వెంటబడి నేను తిరుగుతుంటే వాళ్ళు క్రొత్త క్రొత్త కార్యకర్తలకొరకు వెదకులాడవలసి వచ్చును. ఇది బాగుండునా?" అని నేను జవాబిచ్చాను. బాపూ తన వ్రాతపనిలో మునిగిఉండెను. అందుచేత మేము నెమ్మది నెమ్మదిగా మాట్లాడుచుంటిమి. కాని ఎట్లో మా సంభాషణ ఆయన చెవినిబడినది. ఆయన ఊరకుండలేక పోయెను. ఆయన "కాకా నీ మాటలు బంగారమంత విలువైనవి" అని హరిలాల్ వంక తిరిగి, "భారతదేశములో కార్యకర్తలందరు పరస్పర నిష్టతో ఇట్లే పనిచేసినచో మనము కష్టములదాటి గట్టెక్కుటలో ఆలస్యముండదు" అని అనసాగెను.

నేను తలవంచుకొన్నాను. నా మనస్సు ఎంత ప్రసన్నమైంది! నాలోకూడ ఏదో కొంత ఉన్నదను అభిమానము కలిగినది. ఆ క్షణములోనే నేను పూర్తిగ బాపూ మనిషినై పోయాను.

బొంబాయి కాంగ్రెసు పూర్తి అయిన తర్వాత నేను బడోదా (బరోడా) వెళ్లాను. అక్కడనుండి నాలుగైదు మైళ్ళ దూరములోనున్న సయాజీపురమను గ్రామములో గ్రామసేవాకార్యము చేయసాగాను. నేను బారిష్టరు కేశవరావు దేశపాండే క్రింద పనిచేయుచున్నాను. నాకక్కడ ప్రత్యేకమైన లేక విశేషమైన పనిలేదని బాపూనకు తెలిసెను. అంతట ఆయన- "కాకాను మీరు ప్రత్యేకమైన పనికి లేక విశేషమైనపనికి దేనికీ ఉపయోగించుటలేదు. ఆశ్రమములో మేమొక జాతీయ పాఠశాలను ప్రారంభింపగోరుచున్నాము. అందువల్ల కాకాను మాకు ఇచ్చివేయవలసింది." అని దేశపాండేకు ఉత్తరము వ్రాసెను.

దేశపాండే నన్ను అహమ్మదాబాదు తీసికొనివెళ్ళి, నాతో, "గంగానాథ్ రాష్ట్రియశాల" (జాతీయపాఠశాల) అను పేరుతో నడుపుదానికిది వ్యాపకరూపమని దీనిని భావించి యిక్కడ ఉండిపొమ్మనెను. వివాహమైన కన్యను తల్లి దండ్రులు ఏవిధముగా అత్తవారిల్లు చేరుస్తారో అదేవిధముగా నన్నాయన గాంధీజీ ఆశ్రమము చేర్చెను.

నేను ఆశ్రమమునకు వచ్చాను. ఎకాఎకి గాంధీజీ చంపారన్‌కు వెళ్ళిపోయాడు. బడోదాలోని పని అస్తవ్యస్తము కాకుండుటకై తుది ఏర్పాట్లు చేయుటకై నేను తిరిగి నాలుగురోజులు పనిమీద వెళ్ళాను. అప్పుడు ఆశ్రమ వ్యవస్థాపకులు గాంధీజీకి నేను బడోదా వెళ్ళినట్లు వ్రాసి

యుండవచ్చును. ఇంకేముంది ఆయనవద్దనుండి వెంటనే రెండు త్తరములు వచ్చినవి. అందులో ఒకటి నాకు. రెండవది దేశపాండేగారికి దేశపాండేగారికి, "కాకాను నాకు మీరు యిచ్చివేశారు. ఇక మీకు ఆయనమీద ఎట్టి అధికారము లేదు. ఈ విధముగా ఆయనను మీరు పిలువనంపకూడదు." అని వ్రాసెను. ఇక నాకు, "ఒక మనుష్యుడు ఒకే సమయములో రెండు బాధ్యతలను నిర్వహింపజాలడు." అని వ్రాసెను. నాకు చాలా కష్టమనిపించినది. అప్పటినుండి ఒక సంవత్సరమువరకు, తిరుగుటకు కొంచెము బైటకు వెళ్ళవలసివచ్చినప్పుడు తప్ప, ఆశ్రమ భూమిని వదలి బైటకెక్కడకు వెళ్ళలేదు. దీనిమీదట నా నిష్ఠలో ఏకాగ్రత యున్నదని గాంధీజీకి తెలిసిపోయెను. పిమ్మట తనతోపాటు తిరుగుటకు నన్ను ఆయన ఒకటి రెండు చోట్లకు తీసికొనిపోయెను.

గాంధీజీ చంపారన్‌లో సత్యాగ్రహము మొదలుపెట్టినప్పుడు నేనూరుకుండలేకపోయాను. అక్కడి సత్యాగ్రహములోను ఆందోళనలోను పాల్గొనుటకు నన్ను రానీయవలసినదని నేను ఆయనకు వ్రాశాను. దానికి, "మీరు రాజకీయరంగములో కావలసినంత అనుభవము గడించినారు. దేశసేవాకార్యము మీకు క్రొత్తవిషయమేమీ కాదు. అక్కడిపనిని వదలిపెట్టి యిక్కడకువచ్చి జైలుకు వెళ్ళి కూర్చుంటే అది మీకు తపస్సుకాజాలదు. యథేచ్ఛావిహారము కాగలదు. క్రొత్తవారికి నేనిక్కడ అవకాశ

మియ్యకోర్తాను. మీరు మీ పనిని అక్కడ ఏకాగ్రతతో చేయుచుండవలసింది.” అని జవాబు వ్రాసెను.

## 9

శ్రీ కిశోర్‌లాల్ మశ్రూవాలా అకోలాలో వకీలు పని చేసెడివాడు. ఆయనమీద శ్రీ ఠక్కర్ బాపా ప్రభావము కొద్దిగా ఉండెను. గాంధీజీ స్వయంసేవకులకొరకు అపీలు చేసినందువల్ల, అది దేశసేవకు మంచి అవకాశమని ఆయన గాంధీజీ వద్దకు వెళ్ళిపోయెను. ఆయన స్వాస్థ్యము సరిగాలేదని గాంధీజీ గ్రహించెను. ఆయనకు ఉబ్బసము లేక దమ్మరోగముండెను. కాని ఆయనలో మంచి సరుకున్నదని తెలిసికొనెను. కొద్దిసేపు సంభాషణ జరిగిన తర్వాత, “మీ పని యిక్కడకాదు. ఆశ్రమములో నేనొక పాఠశాలను ఆరంభించాను. అక్కడ సాకల్‌చంద్‌భాయి ఉన్నారు. కాకా ఉన్నారు. ఫూల్‌చంద్ షోషట్‌లాలు ఉన్నారు. వారికి సహాయపడుటకు వెళ్ళండి. ఇక్కడనుండి నేడే వెళ్ళవలసింది. ఇక్కడ మీరు ఉన్నట్లయితే మీ విషయమై నేను చింతింపవలసి యుంటుంది. నా మీద అనవసరంగా బరువు హెచ్చుతుంది. అందుచేత నేడే వెళ్ళి పోవలసింది” అని చెప్పెను

ఆయన ఏమిచేయగలడు ? సూటిగా ఆశ్రమమునకు వచ్చెను. శాశ్వతముగా గాంధీజీ మనిషియై పోయెను.

# 10

1916-17 లలో బాపూజీ గుజరాతుకువచ్చి స్థిర పడెను. అందువల్ల తనలోకూడ సేవఉన్నదను భావము మొట్ట మొదటిసారి గుజరాతులో జాగృతమయ్యెను. ఇంతకుపూర్వము బొంబాయి ప్రాంతీయ కాన్ఫరెన్సులు సమావేశమగుచుండెడివి. వాటికి సింధు, గుజరాతీ, మహారాష్ట్ర కర్నాటక ప్రాంతముల జనులు వచ్చెడివారు. దేశములో ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన ప్రాంతములే కాంగ్రెసు ప్రాంతములుగా ఉండేవి. భాషననుసరించి ప్రాంతములు ఏర్పాటుచేయవలెనన్న పక్షములో గాంధీజీ ఉన్నాడన్నసంగతి తెలిసికొని కొద్దిమంది గుజరాతీ కార్యకర్తలు గుజరాత్ ప్రాంతీయ పొలిటికల్ కాన్ఫరెన్సును స్థాపింపకోరిరి. వారు గాంధీ దగ్గరకు వచ్చినారు. గాంధీజీ తన కార్యపద్ధతిని వారిముందుంచెను. కార్యకర్తలు దానినంగీకరించిరి. అప్పుడు గాంధీజీ దానికి అధ్యక్షుడగుటకు అంగీకరించెను. బొంబాయి ప్రాంతీయ పొలిటికల్ కాన్ఫరెన్సునుండిగాని, కాంగ్రెసునుండిగాని అనుమతి పొందకుండగనే బొంబాయి పొలిటికల్ కాన్ఫరెన్సును వికేంద్రీకరణ మొనర్చుచున్నామన్న సంగతి ఎవ్వరికిని తట్టకుండుటే యిందులోని తమాషా. ఆ రోజులలో కాంగ్రెసంత సంఘటితముగా నుండేవికాదు. కాన్ఫరెన్సుకు 'గుజరాత్ రాజకీయ పరిషత్' అని శుద్ధ దేశీయనామముంచబడెను. పరిషత్ గోధ్రాలో సమావేశమైనది. సమయము

నకు గాంధీజీ సభకు చేరుకొనెను. ఆయన ఉపన్యాసము గుజరాతీలో నుండెను. పరిషత్తుకు శ్రీ లోకమాన్యుడు కూడ ఆహ్వానింపబడెను. ఆయన తన అలవాటు ప్రకారము కొంచెము ఆలస్యముగ వచ్చెను. గాంధీజీ ఎంతో ఆదర ముతో ఆయనకు స్వాగతమిచ్చెను. కాని, "లోకమాన్యుడు అరగంట ఆలస్యముగా వచ్చెను. స్వరాజ్య సంపాదనలో అర గంట ఆలస్యమైనచో దానికి ఆయన బాధ్యుడుగా భావింప బడును." అని నెమ్మదిగ అనకుండ ఉండజాలకపోయెను.

# 11

నేనుకూడ బాపూతో గోధ్రా వెళ్లాను. విషయ నిర్ణయసభలో చర్చింపబడవలసిన చిత్తు తీర్మానములను తీసికొనివచ్చి అక్కడి కార్యకర్తలు గాంధీజీ ముందుంచి నారు. వాటిలో చక్రవర్తియెడల రాజభక్తిని తెలుపు తీర్మానము మొదటిది. ఆ రోజులలో ప్రతి రాజకీయసభ అట్టి తీర్మానముతోనే మొదలయ్యేడిది.

గాంధీజీ తీర్మానమును చదివి చింపివేసెను. "అట్టి తీర్మానమును పాసుచేయుట అర్థములేనిపని. తిరుగుబాటు చేయనంతకాలము రాజభక్తి ఉన్నదనే యర్థము. దానిని ప్రకటించవలసిన అవసరమేమున్నది? ఏ గృహిణియైనా తన పతిముందర తన పాతివ్రత్యమునుగురించి ప్రకటించు కొనినదా? ఆబిడ పెండ్లాడినదంటే, దాని అర్థము ఆమె పతివ్రతయనియే." అని అనసాగెన్ను.

కార్యకర్తల నోట మాట వెలువడలేదు. వారి ముఖముద్రనుచూచి బాపూ, "మిమ్ములను రాజభక్తి తీర్మానమేమైనదని ఎవ్వరైన అడిగినచో నిస్సందేహముగా నా పేరుఎత్తి గాంధి ఆపివేశాడని చెప్పవచ్చును." అని చెప్పెను.

## 12

బహుశః ఆ పరిషత్తులో విరమ్‌గామ్‌ను గురించి ఒక తీర్మానము పాసయ్యెను. దానిని పరిషదధ్యక్షుడుగ గాంధీజీ వైస్రాయికి పంపవలసియుండెను. గాంధీజీ వెంటనే ఒక టెలిగ్రామ్ (తంతి) వ్రాయించి, దాని క్రింద తనపేరు తర్వాత అధ్యక్షుడు, గుజరాత్ రాజకీయ పరిషత్ అను మాటలను వ్రాసెను. అది చూచి నేను, "వైస్రాయికి యీ దేశీ శబ్దములు ఏ మర్థమగును?" అని అన్నాను. బాపూ, "ఆయన యిక్కడ రాజ్యము చేయవలసి ఉంటే ఇంతమాత్రము భాషను ఆయన నేర్చుకొనవలెను లేదా వీటి అర్థము చెప్పుటకు దుబాసీలను తన దగ్గర ఉంచుకొనవలెను. తమ స్వార్థముకొరకే గదా వారిక్కడ రాజ్యము చేయుచున్నది?" అని జవాబిచ్చెను.

తుదకు తంతి ఆదేవిధముగా వెళ్ళినది. దానికి సరియైన జవాబు వచ్చినది.

## 13

గోధ్రాపరిషత్తునకు కొన్నిరోజుల ముందరనే మహా

దేవభాయి దేసాయి గాంధీజీ దగ్గరకు వచ్చెను. ఆయన ఘనిష్ఠ మిత్రుడు శ్రీ నరహరి పరీఖ్ ఆశ్రమ పాఠశాలలో చేరిపోయి ఉండెను. ఇద్దరూ కలిసి రవిబాబు బంగాలీ కృతి నొకదానిని గుజరాతీ భాషలోనికి అనువాదము చేసిరి.

మహాదేవభాయి ఎల్ ఎల్. బి. పాసయిన తర్వాత వకీలు పనిని చేయలేదు. కొన్నిరోజులు బొంబాయి ఓరియంటల్ ట్రాన్సలేటర్ ఆఫీసులో పనిచేయుచుండెను. దాని తర్వాత సర్ లల్లూభాయి శ్యామలదాస్ సిఫారసు మీద కో-ఆపరేటివ్ సొసైటీల ఇన్స్పెక్టరు ఆయెను. తర్వాత ఎవరికో ప్రైవేటు సెక్రటరీగా ఉండెను. అప్పుడు బాపూచేత ఆకర్షింపబడెను. ఆయనను కలియుటకు గోధ్రా వచ్చెను. వచ్చి "నన్ను మీరు మీ వెంట ఉంచుకొనగలిగి నచో మీ ప్రైవేటు సెక్రటరీగా పనిచేయగలను" అని అన సాగెను. ఆయన తన పాత యజమానికొరకు తయారుచేసిన ఒక ఇంగ్లీషు ఉపన్యాసమునుకూడ చూపించెను. ఆయన అక్షరములు ముత్యాలవంటివి. ఆయన ముఖములో యౌవ నము, నిర్మలత్వము ఉట్టిపడుచుండెను. ఆయన పది పది హేను నిమిషములు మాటాడి ఉండవచ్చును.

బాపూ ఆ మాటలవల్ల ప్రభావితుడైనాడో లేక అసాధారణమైన శీలమును పసికట్టినాడో నాకు తెలియదు. అప్పుడే ఆయన, "నీవు నా వెంట రావచ్చును" అనెను. మహా దేవభాయి యిరువది సంవత్సరములు సేవచేయుటకు వాగ్దా

నము చేసెను. కాని యింతలోనే ఆ రెండు ఆత్మలకు వివాహమై పోయినది. మహాదేవభాయి, "నే నెప్పటినుండి పనిని మొదలుపెట్టను?" అని అడిగెను. "నీ పని మొదలైపోయింది. ఇక్కడనుండి నాతో ప్రయాణము చేయి!" అని బాపూ అనెను. ఇంటికి పోయివచ్చిన బాగుండునని మహాదేవభాయి అనగా బాపూ, "ఇప్పుడేమీ అవసరము లేదు. ఆ తర్వాత వెళ్ళవచ్చునులే" అని అనెను.

కొన్నిరోజుల తర్వాత మహాదేవభాయితో నేను మాట్లాడుచుంటిని. అప్పుడాయన, "ఒకసారి బాపూ ఎవ్వరితోనో కలియుటకు వెళ్ళెను. అక్కడాయన కుర్చీమీద కూర్చుండెను. నేను క్రింద నేలమీద కూర్చుంటిని. అప్పుడు బాపూ, "ఇది సరికాదు. నాతోపాటు రెండవ కుర్చీమీద కూర్చుండుము" అని అనెను. నాకు ధైర్యము చాలలేదు. అంతటాయన, "లోకంపోకడకూడ నీవు నేర్చుకొనవలసియుండును." అని గట్టిగా మందలించెను. నేను సిగ్గుపడుతూ లేచి కుర్చీమీద కూర్చుంటిని." అని నాతో చెప్పెను.

అంతట నేను నవ్వుతూ "క్రొత్త పెండ్లికూతురు వలెనా?" అని అన్నాను.

## 14

గోర్ధానుండి మేము ఆశ్రమమునకు తిరిగి వచ్చాము. బాపూ ఎక్కడనో పర్యటన ముగించుకొని వచ్చెను. ఆయన కొరకు ఆశ్రమములో వేరేగది లేకుండెను. మేమంతా

వెదురు తడికెలతో కప్పబడిన గుడిసెలలో నివసించు చుంటిమి. అవి ఎండనుండిగాని వాననుండిగాని మమ్ము రక్షింపజాలకుండెడివి. నేతపనికొరకు యిటికలతో గట్టబడిన పెంకుటిలు ఒకటి ఉండెను. దానిలో ఒక మూల ఒక గది బాపూ కొరకు ఖాళీచేయబడెను. అటువంటప్పుడు మహాదేవ భాయికి స్థలమెక్కడ దొరుకుతుంది? ఆయన సామానంతా నేతయింట్లో పడిఉండేది. ఎక్కడ స్థలం దొరికితే అక్కడ ఆయన సర్దుకొనేవాడు. ఒకరోజు గాలివానవచ్చి ఆయన మోడరన్ రివ్యూ మాసపత్రిక ఎగిరిపోయెను. అంతట మా గుడిసెలలోనే ఆయనకుకూడ బస ఏర్పాటు చేయవలసి వచ్చినది.

సాయంకాలపు సమయము. మేము ప్రార్థన కొరకు చేరితిమి. వచ్చిన ఉత్తరము దేనినో బాపూ మహాదేవ భాయిని అడిగెను. ఆ ఉత్తరమును ముక్కలు ముక్కలుగా చేసిమహాదేవభాయి చిత్తుకాగితములబుట్టలో పారవేసెను. వెంటనే ఆయనలేచి చిత్తుకాగితముల బుట్టలో ఆ ఉత్తరపు ముక్కల కొరకు వెదుకసాగెను. ఆ ముక్కలు సులభముగా ఎట్లు దొరుకుతాయి? అదిచూచి బాపూ "పోనియ్యి అది లేకుండగనే పని జరుగగలదు." అని అనెను. కానిమహాదేవ భాయి ఊరుకొనే మనిషా? ఆయన బుట్టను నేలమీద గుమ్మరించెను. ఆ ఉత్తరపు ముక్కలు వెదుక సాగెను. బాపూనకు చాల కోపము వచ్చి, "ఇదేమి చేయుచున్నావు మహాదేవ్? అందరూ ప్రార్థనకొరకుచేరి నీ కొరకు ఎదురు

చూస్తున్నారు. ఆ ఉత్తరము లేకుండగనే పనిజరుగునని నేనంటున్నాను." అని అనెను. కాని మహాదేవ్ ఆమాటలు వినిపించుకొనలేదు. ఆయన ఏరిన ముక్కలను క్రమప్రకారము పెట్టసాగెను. ఆయన నుదురంతా చెమటచే తడిసిపోసాగెను. ఉత్తరమంతా ఏర్పడి దాని నకలు తీసికొన్న తర్వాత ఆయనవచ్చి ప్రార్థనలో మాతో కలిసెను.

బాపూజీ కార్యమందు అట్టి నిష్ట ఆయనకు జీవితమంతా ఉండెను.

# 15

కోచరబ్ నుండి తీసివేయబడి ఆశ్రమము సాబర్మతీ నది యొడ్డుననున్న వయేవాడజ్ గ్రామ సమీపమున స్థాపింపబడినది. ప్రారంభములో మేము ఒకటిరెండు డేరాలలో ఉండేవారము. దానితర్వాత గుడిసెలు వేయబడినవి. ఆశ్రమ భూమిమీదకు మేము వచ్చినసంగతి అందరికంటె ముందు ఆశ్రమముయొక్క చుట్టుప్రక్కల దొంగలకు తెలిసినది. వాళ్లురాత్రులందు మాకు స్వాగతమిచ్చుటకు రాసాగిరి. పెద్ద మనుష్యులు కలియుటకు వచ్చినప్పుడు ఏవయినా కానుకలు యిచ్చిపోయెదరు. కాని దొంగలపద్ధతి యిందుకు వ్యతిరేకము వారుఏదో ఒకదానిని కానుకగా స్వేచ్ఛగా తీసికొని పోయెడివారు. అందుచేత రాత్రులందు మేము కాపలా పెట్టుట మొదలు పెట్టినాము. నేను రాత్రి 1 గంటనుండి 3 గంటల

వరకు తరచు కాపలా కాసెడి వాడిని. రాత్రి మొదటినిద్ర తర్వాత శరీరము ప్రసన్నముగా నుండేది. రాత్రి (అనగా చివర భాగము) సమీరము శాంతికి ధ్యానమునకు అనుకూలముగా ఉండేది. ఉపనిషత్ మంత్రములు చదువుచు ఆశ్రమభూమిచుట్టూతిరుగుచు నేనుకాపలా కాసెడివాడను.

కొన్ని రోజుల తర్వాత బాపూ తన పర్యటననుండి తిరిగివచ్చెను. సాయంకాల ప్రార్థన తర్వాత చర్చకొరకు ఆయన దొంగల సమస్యను తీసికొనెను. కావలసినంత చర్చ జరిగినది. అంతట బాపూ, "మగన్‌లాల్ (గాంధీజీ యొక్క సోదరుని కుమారుడు, ఆశ్రమ వ్యవస్థాపకుడు) కోరినచో నేను సర్కారునుండి లైసెన్సులు తీసికొని తుపాకులను కొనెదను. అహింసా వాదులు తుపాకులనేల నుంచుకొనిరని లోకులు విమర్శించినచో దానికి జవాబిచ్చుటకు ఇచ్చట నేను సిద్ధముగానే ఉన్నానుగదా ?" అని అనెను.

దీనిమీదకూడ కొంతచర్చ జరిగినది. అప్పుడు బాపూ, "ఇక్కడున్న స్త్రీలు, పురుషులు, పిల్లలు అనగా మనమంతా భయభ్రాంతులమై ఉండుటకంటె తుపాకులతో మనలను రక్షించుకొనుట మంచిది. భయగ్రస్తుడైన మనిషి అహింస నెప్పుడూ పాలించలేడు. మనస్సుద్వారా నిర్వీర్యమైన హింస చేయుట కంటె మనము దొంగలను భయపెట్టుటే మంచిది." అని చెప్పెను.

దీనిమీద నలుగురి అభిప్రాయములు తీసికొనబడెను. నేను దీనికి వ్యతిరేకముగా మాట్లాడినాను. అందరికిను ఆశ్చర్యము కలిగినది. మహారాష్ట్రుడనైన నేను బాపూకంటెకూడ అహింసకుడనెట్లయితినన్న భావం అందరి ముఖములలో కనిపించినది. నా వాదన ఏమనిన - సర్కారు వారివద్ద బాపూజీ అంటే ఇప్పుడు గౌరవము, పలుకుబడి యున్నది. వాళ్ళు బాపూజీని తమ హితచింతకునిగా తలంచుచున్నారు. అందుచేత మనకు ఒకదానిబదులు పది తుపాకులు లభించగలవు. కాని దేశములోని కోట్లకొలది రైతులకు ఆయుధము లెక్కడినుండి దొరకగలవు? మనరైతులకు, తుపాకులు లేకుండగనే, ఆత్మరక్షణ చేసికొనవలసి వస్తున్నప్పుడు మనముకూడ వారివలెనే ఆత్మరక్షణ గావించుకొనవలెను.

బాపూనకు నా వాదన నచ్చియుండ వచ్చును. తుపాకులమాట ముందుకు సాగక నిలచిపోయినది.

దీని తర్వాత ప్రభుత్వమువారు బాపూను యుద్ధకార్యములో (మొదటి ప్రపంచ యుద్ధములో) సహాయపడమని కోరగా ఖేడా జిల్లాలో మనుష్యులను సైన్యములో చేర్చుపనిని ప్రారంభించినప్పుడు ఆయన సర్కారుతో ఉత్తర ప్రత్యుత్తరములను జరిపి ఖేడా జిల్లాలోని రైతులకు తుపాకు లైసెన్సులను ఎక్కువ సంఖ్యలో ఇప్పించెను. ఈ మాట విన్న రోజున నాకు చాలా సంతోషమైనది.

# 16

గుజరాత్‌లో మొట్టమొదట గాంధీజీదగ్గరకు వచ్చిన కార్యకర్తలలో శ్రీ శంకరలాల్ బేంకర్, శ్రీ వల్లభ భాయి పటేలు - ఇద్దరు ముఖ్యులు. శ్రీ విఠలభాయిపటేలు కూడ మొదటినుండి గాంధీజీ సంపర్కములోనికి వచ్చెను. కాని సన్నిహిత సంపర్కములోనికి రాలేదు.

గోధ్రాలో జరిగిన ప్రథమ రాజకీయ పరిషత్తుతో పాటు శ్రీ ఠక్కర్ బాపా (ఈయన సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీలో సీనియరు సభ్యుడగుటచే స్వాభావికముగనే గాంధీజీ సంపర్కములోనికి వచ్చెను. రావటముతోనే ఇద్దరి మధ్య ఘనిష్ఠ సంబంధం కూడ ఏర్పడి పోయినది.) అస్పృశ్యతానివారణపరిషత్తునొకదానినిఏర్పాటుచేసెను. అప్పుడు బాపూ అస్పృశ్యతా నివారణ పరిషత్ మాలపల్లెలోనే జరుగవలెననగా అట్లే నిశ్చయింపబడినది. రాజకీయ సభలో కూడ ఈ సంగతి ప్రకటింప బడెను. అది జరుగు తేదీ-సమయము, స్థానము తెలుపబడెను. అందరును ఆహ్వానింప బడిరి. ప్రజలు ఎక్కువ సంఖ్యలో వచ్చిరి. పరిషత్తు కొరకు మాలపల్లె పరిశుభ్రమొనర్పబడినది. శ్రీ విఠల భాయి పటేలు కూడ దానికి వచ్చెను. ఆయన స్వభావము కొంచెము వింతమైనది. ఒక లుంగీ కట్టుకొని పొడుగుపాటి లాల్చి తొడుగుకొని సాధువులు ధరించునట్టి ఒక టోపీని ధరించి వచ్చెను. సభలో వేదిక ఏర్పాటు చేయుబడలేదు.

గాంధీజీ అధ్యక్షుడు. ఆయన ఒక కుర్చీ లేక పెట్టెమీద నిల బడెను. ఆయనకు ఆసరాగా ఉండుటకు విఠలభాయి నిల బడెను. ఆయన భుజము మీద చేయి వుంచుతూ, బాపూ, "పై బట్టలచే ప్రభావితుడ నయ్యేడివాడనుకాను నేను. భుజముమీద చేతిని పెట్టనిస్తున్నావు. అది నీ హృదయ మునుకూడ తడివి చూడగలదు సుమా". అని పలికెను.

ఆ సభకు మహారాష్ట్రము నందలి హరిజన సేవకులలో సర్వ ప్రథముడును, (మొట్టమొదటివాడును) సర్వ శ్రేష్ఠుడు నగు విఠలరామ్‌జీ శిందే కూడవచ్చెను. ఆయనతో నాకు కొంచెము పూర్వ పరిచయ ముండెను. సభ పూర్తియైన తర్వాత మేమిద్దరమూ మాట్లాడుటకు కూర్చుంటిమి, అప్పు డాయన, "మీ గాంధీజీ మమ్ములనిక్కడ నిలువనిస్తాడనే ఆశలేదు నాకు' ఆయునకు నా యభిప్రాయములను తెలిపి, ఆయన అభిప్రాయములను తెలిసికొనవలెనని ఎప్పటినుండో ఎదురు చూచుచుంటిని. కాని నామాట వినిపించుకొనే దెవరు ? ఆయన వేగముగా ముందుకు పోగోరు చున్నాడు. పనినికూడ జోరుగా కొనసాగించుచున్నాడు. కాబట్టి ఆయ నకు వ్యతిరేకముగ ఫిర్యాదు చేయుటకు కూడ వీలులేదు. నాకిక్కడ స్థానము లేదు. నేను పోవుచున్నాను." అని చెప్పెను.

అదే పరిషత్తులో అక్కడ అస్పృశ్య సేవాశ్రమము నొకదానిని స్థాపింప నిర్ణయింప బడినది.

ఆశ్రమము స్థాపింపబడెను. కాని యోగ్యుడైన పంచాలకుడు (కార్యకర్త) దొరకలేదని వినుటతోడనే నేను నా మిత్రుడైన మామాసాహేబ్ ఫడ్కేను అక్కడికి పంపినాను. ఆయన నాకంటె ముందుగనే ఆశ్రమములో సభ్యుడుగా చేరియుండెను.

ఆ దినమునుండి నేటివరకు మామాసాహేబ్ గోధ్రాలోనే పనిచేయుచుండెను. తపస్వియను బిరుదుపొందుటకు యోగ్యుడైన వాడెవ్వడైన ఉంటే ఆయనే దానికి తగినవాడు.

# 17

శంకరలాల్ బేంకర్, వల్లభ భాయిల యిద్దరి నోటినుండి వేరువేరు సమయములందు వారిద్దరికిని గాంధీజీతో ప్రథమ పరిచయ మెట్లయినదీ విన్నాను.

శంకరలాల్ యిట్లు చెప్పెను. "మేము విల్సన్ కాలేజీలో చదువుచుంటిమి. బొంబాయిలో అప్పటినుండి కొంత రాజకీయపు పనినికూడ చేయుచుంటిమి. అప్పటినుండి జరిగెడి ప్రతి కొంటెపనిలో లేక అల్లరిలో ఏదోకొంతభాగము తప్పక తీసికొనెడి వారము. (శంకరలాల్ బేంకరు, జీవితరామ్ కృపలాని విల్సన్ కాలేజీలో సమకాలికులు. కాలేజీ జగడములలోనే ఒకరితో ఇంకొకరికి పరిచయమైనది.) నేను, ఉమర్ సోభానీ యిద్దరం కలిసి హోమ్ రూల్ లీగ్ పనిని

జోరుగానడిపించితిమి. ఒకరోజున గాంధీయనిపేరుగల ఎవరో ఒకవ్యక్తి దేశములోనికి వచ్చినాడని, ఆయన ఏదో కొంత పనిచేయదలచుకున్నాడని వింటిమి. ఆయనవల్ల మనమెంత వరకు లాభము పొందవచ్చునో మా పనిలోనికి లాగ వచ్చునో తెలిసికొనుటకు మేమాయనవద్దకు వెళ్ళితిమి.

"గాంధీజీ నేలమీద కూర్చుండియుండెను. మేము ఆయనకంటె పెద్దవాళ్ళమనే (Patronizing) పద్ధతిని మాట్లాడితిమి. కాని ఆయనవద్దనుండి తిరిగి వచ్చిన తర్వాత మేమాయన ప్రభావమునకు లోనైనట్లు తెలిసి కొంటిమి. ఆ రోజులలో బొంబాయి రాజకీయాలు మా చేతులలో ఉండేవి. ప్రభుత్వము బిసెంటు సతిని నిర్బంధములో ఉంచినది. గాంధీజీ మాటలలో చెప్పవలెనన్న 'పాతిపెట్టినది.' నేను గాంధీజీకి ఒక ఉత్తరము వ్రాసితిని. గాంధీజీ, 'సహింపరాని దుఃఖమునకు లేక అన్యాయమునకు మందు సత్యాగ్రహమే కాగలదు.' అని దానికి జవాబిచ్చెను. నేను గాంధీజీ యీ ఉత్తరమును ప్రకటించి కావలసినంత ఆందోళన చేసితిని. గాంధీజీకూడ దానిలో నాకు తగినంత ప్రోత్సాహ మొసంగెను. ఫలితముగ ఏనీబిసెంట్ నిర్బంధములోనుండి వదిలి పెట్టబడినది.

తర్వాత రౌలట్ శాసనపు ఆందోళన సాగెను. ఆ సమయమునుండి నేను, ఉమర్ సోభానీ గాంధీజీ నాయకత్వముక్రిందకు వచ్చివేసితిమి, సత్యాగ్రహసభ స్థాపింపబడినది. 'హింద్ స్వరాజ్య' అను గాంధీజీ పుస్తకమును

బొంబాయి ప్రభుత్వము నిషేధించి యుండెను. (గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడే అది నిషేధింపబడినది.) నేను గాంధీజీ 'హింద్ స్వరాజ్య' పుస్తకమునకు వేలకొలది ప్రతులను అచ్చు వేయించి బహిరంగముగ బొంబాయి నడిబజారులో అమ్మితిని. లోకులు అడిగిన ధరల నిచ్చి వాటిని కొనిరి.

"ఇక్కడ దండనీతివల్ల పని జరుగదని ప్రభుత్వము గ్రహించినది. వెంటనే తన వైఖరిని మార్చివేసికొన్నది. డర్బన్ (దక్షిణాఫ్రికా) లోని ఫినిక్సు ప్రెస్‌లో ముద్రింప బడిన పుస్తకమునే నిషేధించితిమని, మరల ముద్రింప బడిన వాటిపై ఎట్టిచర్య తీసికొన బోవుటలేదని ప్రకటించి నది. సంతోషముతో నేను ఎగిరి గంతు వేశాను." మరల ఇట్లు చెప్ప సాగెను. "ఈ ముసలివానినుపయోగించుకొన వలెనని మేము బయలు దేరితిమి. కాని మేమే ఆయన వలలో చిక్కుకొన్నట్లు తెలిసికొంటిమి."

నిజమునకు వారట్లే చిక్కుకొనిపోయిరి. వారి కొంటె రాజకీయములు గాలిలో కలిసిపోయినవి. వారిప్పుడు కేవలము ఖాదీపనిలో మునిగి యున్నారు.

## 18

ఒకసారి శ్రీవల్లభ భాయిని విద్యాపీఠములోని విద్యార్థులకు ఉపన్యాస మిచ్చుటకు ఆహ్వానించితిని.

మాట్లాడుతూ, మాట్లాడుతూ ఆయన తన కథ చెప్పు ధోర ణిలో పడిపోయినాడు. ఆయన దానినే విషయముగా తీసికొని ఇట్లు ప్రసంగించినాడు :

"విదేశమునుండి తిరిగి వచ్చిన పిమ్మట నేను నా వకీలు వృత్తిలోను, డబ్బు సంపాదనలోను పడిపోతిని. దేశము యొక్క రాజకీయములను గమనించు చుండెడి వాడను. కాని ఆదర్శసిద్ధికి తోడ్పడగల నాయకుడెవ్వడు నా కంటబడలేదు. ఉన్నవారంతా వట్టిగ వాగేవారే. అందుచేత నేను ప్రతిరోజు సాయంకాలము వకీళ్ళ క్లబ్బుకు పోయి అక్కడ చీట్లాడెడి వాడను. సిగరెట్లను బీడీలను త్రాగుటలో నేనానందము ననుభవించెడి వాడను. ఈ మధ్యలో ఎవరైనా ఉపన్యాసకుడు వస్తే వారిని పరిహా సించుటలోనే నాకానందము కలిగెడిది.

ఒకరోజున మా క్లబ్బులోనికి గాంధీజీ వచ్చెను. ఆయనవిషయములో కొంత యిదివరకే చదివి యుంటిని కూడ. ఆయన ఉపన్యాసమును కూడ నేను పరిహాస బుద్ధి తోనే వినసాగితిని. ఆయన మాట్లాడుతుంటే నేను సిగరెట్టు పొగను వదలి పెట్టేవాడిని. కాని చివరకు యీ మనిషి మాట్లాడికూర్చునే మనిషి కాడని ఏదైనా కొంత పనిచేయ దలచుకున్నాడని గ్రహించితిని. అంతట మనిషి ఎటువంటి వాడో చూద్దామని ఆలోచన వచ్చినది. నేను ఆయనతో నా సంపర్కమును హెచ్చించితిని. ఆయన సిద్ధాంతముల వైపు నేను నా ధ్యానమును పోనీయలేదు. హింసాహింసల

విషయం నేను పట్టించుకొనలేదు. మనిషి సత్యవంతుడు. దేశము కొరకు తన సర్వస్వము అర్పించినాడు. దేశ స్వాతంత్ర్యము పట్ల ఇతనికి నిజమైన పిపాస ఉన్నది. తాను చేయవలసిన పనినిగురించి అతనికి తెలియును. ఇవి నాకు చాలు.

"ఖేడా జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమాన్ని మేము నడిపితిమి. గుజరాత్ సభ యీపనిని చేపట్టుటకు సిద్ధముగా నుండలేదు. గాంధీజీ ఆశ్రమములో సత్యాగ్రహ సభను స్థాపించి పనిని ప్రారంభించెను. ఆ సమయమునుండి నా సేవను నేను గాంధీజీకి అర్పించివేసితిని. అప్పటినుండి ఆయన మనిషినైపోయాను. లోకులు నన్ను ఆయనను గ్రుడ్డిగా అనుసరించెడి అనుచరుడందురు. దానికి నేను సిగ్గుపడుటలేదు. నేను ఆయన నాయకత్వ మంగీకరించి నప్పుడు - ఆయనను అనుసరించినందులకు లోకులు నామీద ఒకరోజు ఉమ్మివేసెదరని - అందులకు నేను సిద్ధముగా ఉండవలెనని కూడ నేను తెలిసికొంటిని. అప్పటినుండి మనస్సులో నేను చేసిన యీ పనికి ఎన్నడూ విచారించ లేదు. ఆయన దారిచూపించును. ఆయన చెప్పినట్లు విశ్వాసముతో నేను పనిచేయుదును."

## 19

బాపూ భారతదేశమునకు వచ్చి పనిచేయ మొదలు పెట్టినప్పుడు ఆయనంటే ప్రభుత్వమునకు చాల గౌరవముండె

డిది. అది ఆయనకు "కైసర్ హింద్" పదకమును ఇచ్చి నది. ఆ పదకము ఆశ్రమమునకు వచ్చినపుడు దానిని నేను చేతిలోతీసికొని చూచితిని. అది బంగారపుది. చాల దళ సరిగా బరువుగా ఉన్నది. రెండువైపుల నొక్కబడిన కోడి గ్రుడ్డువలె నున్నది. అంతట నేను, "బాపూ! మీరు బ్రిటీషు సామ్రాజ్యమునకు చాల సహాయపడిరి. ఆ సామ్రాజ్య భక్తికి బదులు మీ కిది దొరికినది. ప్రభుత్వము మిమ్ము తన వలలో చిక్కించుకొన గోరుచున్నది." అని అంటిని. దానికి బాపూ నవ్వివేసి, "మీరుకూడ అట్లే అను కొనెదరా?" అనెను.

"కైసర్ హింద్" పదకము కేవలము Humanitarian service (మానవసేవకు) యియ్యబడునని నాకు తెలియదు. ఆ సంగతి బాపూ నాకు తెలియ జెప్పెను. అప్పుడు నేను మరల, "ఇది చాల విలువైనది. బహుశః మీరు దీనిని అమ్మివేసి, ఆ డబ్బును దేశసేవా కార్యములకు వినియో గించెదరను కుంటాను. ఇటువంటి వస్తువులను మీరెన్నిం టినో అమ్మివేసిరి." అని మరల అన్నాను. "దీనిని అమ్ము ఉద్దేశ్యము లేదు. పడిఉండనిండు." అని ఆయన నుండి జవాబు వచ్చెను.

ఈ పదకము సంగతి మేము మరచిపోతిమి. బాపూ తొందర పనిమీద చంపారన్ వెళ్ళిపోయెను. అక్కడ అక్కడి రైతుల దుఃఖ కథను విని విచారణ జరుప వలసి యుండెను. అక్కడి ప్రభుత్వము బీహార్ ప్రాంతము

వదలి పొమ్మని బాపూనకు ఆజ్ఞనిచ్చెను. "నా దేశీం
రుల సేవచేయుటకు వచ్చితిని. ఇక్కడి నుండి
బాధ్యతను నా నెత్తిమీద వేసికొనలేను." అని
జవాబు వ్రాసెను. ఆ జవాబుతోపాటు ప్రభుత్వము
తనకిచ్చిన పదకము, ఆశ్రమములో పడివుందని,
త్వరగా వైస్రాయికి పంపవలసినదని, తన మానవ
విలువలేనప్పుడు దానిని తానెట్లుంచుకొనగలనని
మునకు కూడ ఉత్తరము వ్రాసెను.

బాపూయొక్క ఈ జాగరూకతకు - దీనినే
పరిభాషలో స్మృతి యందురు- నాకు ఆశ్చర్యము కల

## 20

అటువంటిదే యింకొక సంగతి జ్ఞాపకమునకు
చున్నది. దానినికూడ యిక్కడనే యిచ్చెదను.

1921 లేక 1922లో బాపూనకు ఆరు సంవత్సర
జైలు శిక్షవేయబడి యరవదా జైలులో నుంచబ
అక్కడ రెండు సంవత్సరముల లోపుననే append
(ఉపాంత్రశోథ) రోగము వచ్చెను. ఆపరేషన్ కొ
ఆయనను ప్రభుత్వమువారు పూనాలోని సాసూన్
త్రిలో ఉంచిరి. అప్పుడుకూడ ఆయన ప్రభుత్వపు ఖైదీ
ఉండెను. కాని యితరులు వచ్చి ఆయనతో మా
విషయంలో అంత కఠిన నిర్బంధములు లేకుండెను.

సమయములో నే నొక సంవత్సరపు శిక్షను పూర్తిచేసికొని పూనా చేరుకొంటిని. చూస్తే ఆస్పత్రి దుస్తులతో బాపూ, ఆస్పత్రిలో ఒక మంచముమీద నిద్రపోవుచుండెను. ఆస్పత్రిదుస్తులు విదేశీ బట్టలని చూచినప్పుడు నాకు విశేషమైన ఆశ్చర్యము కలిగెను. నేను యీ విషయమై విచారించగా బాపూ ఆస్పత్రి నియమములనన్నింటిని పాలించగోరు చున్నాడని తెలిసెను. రోగి తన సొంతబట్టల నుపయోగించరాదని ఆస్పత్రి వారిచ్చిన బట్టలనే ధరించ వలెనని ఆస్పత్రి నియమము.

ఆపరేషను జరిగి పోయినది. బాపూ చాల నీరసపడిపోయెను. అందరికిని ఆయనను గూర్చిన చింతపట్టుకొనెను అట్లే కొన్ని రోజులు గడిచినవి. ఒకరోజున కర్నల్ మేడాక్ వచ్చి బాపూతో, "ప్రభుత్వమువారి ఆజ్ఞ వచ్చినది. మీరు విడుదలైనారని చెప్పుటకు నాకు సంతోషముగా ఉన్నది ఇష్టమైనచో మీరిక్కడ ఉండవచ్చును లేదా వెళ్ళిపో వచ్చును. కాని మీరింకా కొన్నిరోజులుండుట మంచిదని వైద్యునిగా నా సలహా." అని చెప్పెను. ఆ సలహాను అంగీకరిస్తూ బాపూ ఒకటి రెండు వాక్యములు మాట్లాడి ఉండవచ్చును. కాని అదే క్షణములో దగ్గరున్న మనిషితో, - "ఈనా దుస్తులను తీసివేయి. నా బట్టలను తీసికొనిరా. ఇప్పుడు ఒక క్షణమైనను నేనీ బట్టలను ధరించజాలను." అని అనసాగెను.

ముండ్ల చొక్కా తొడిగిఉన్ననూ బాపూ ఇంత ఉద్రిక్తుడయ్యేడి వాడనుకోను. ఖాదీ బట్టలను కట్టుకొనిన పిమ్మట శాంతిముగ మాట్లాడ సాగెను.

## 21

బాపూ కేవలము పండ్లనే తినెడి వాడని భారత దేశములోని జనులందరికిని తెలియును. హిందువుల ప్రకారము పాలుకూడ ఫలహారము క్రిందకే వచ్చును. కాని బాపూ దీనికి పూర్తిగ విరోధి. పాలు ఫలహారము క్రింద రావనియు మేదో రక్త మాంసములతో పాలు తయారగుచున్నవనియు అవి ఫలహారముక్రింద ఏనాటికీ రాజాలవనియు, అందులో హింస లేకపోయినను అది తప్పక మాంసాహారమనియు ఆయన వాదన.

ఒకసారి బాపూ కలకత్తా వెళ్ళెను. అక్కడ భూపేంద్రనాథ్ బోసు యింట అతిథిగా ఉండెను. బంగాళీల ఆతిథ్యము జగత్ప్రసిద్ధమైనది. ప్రోగు చేయబడగల ఎండిన పండ్లు, తాజా పండ్లు సేకరించబడినవి. వాటితో ఎన్ని విధముల వస్తువులు తినుటకు తయారుచేయుటకు వీలగునో అన్నీ తయారుచేయబడి బాపూ ముందర ఉంచబడెను. వాటిని చూచి బాపూ స్తబ్ధుడై పోయెను. "ఇదేమిటి ? సాదాతనమును ఇచ్ఛగించు నాకొరకు యింత ఆర్భాటమా ?" అని వెంటనే ఇకపైన ప్రతిరోజూ ప్రకృతి

సిద్ధము లైన అయిదు వస్తువులకంటె ఒక్కటికూడ ఎక్కువ తీసికొననని వ్రతము పూనెను.

దీని తర్వాత మాలో శాస్త్రార్థము మొదలైనది. నిమ్మపండు, కమలా ఫలము, బత్తాయి పండు ఒక వస్తువు క్రిందకు వచ్చునా లేక వేరు వేరు వస్తువులా ? బెల్లము, పటిక బెల్లము, పంచదార ఒకే వస్తువు క్రింద లెక్క పెట్ట వచ్చునా లేదా ? అనునట్టి అనేక ప్రశ్నలు ఎదురైనవి. అట్టి సమస్యలను చర్చించుటలో బాపూ శాసనకర్తల అంత ఆసక్తి చూపించెడి వాడు. వెంట్రుకను చీల్చునంత వరకు చర్చను కొనసాగించుటలో ఆయనకు విసుగు లేదు.

ఇప్పుడు ఉదయం ఆయన ఏమి తిన్నాడో జ్ఞాపక ముంచుకొని సాయంకాల భోజనము సిద్ధము చేయ వలసి వచ్చెడిది. తరచు ఆయన ఉదయము మూడు వస్తువుల తోనే తిని సాయంత్రము రెండింటికి అవకాశ మిచ్చెడి వాడు. సూర్యాస్తమయము కాకముందే సాయంకాల భోజనము ముగించు నియమము ఆయన కుండనే యున్నది. సాయంకాలమందు ఆయన కార్యక్రమములకు, భోజనము నకు తగిన సమయ మేర్పాటు చేయుట ఆయన వెంటనుండు వారికి యోగసిద్ధియంత కఠినమై పోవుచుండెడిది.

కొన్ని రోజులు గడచునప్పటికి భారత దేశము దక్షిణాఫ్రికా కాదని బాపూనకు అనుభవ మయ్యెను. ఇక్కడ పండ్లు సులభముగా దొరకవు. దక్షిణాఫ్రికాలో అరటిపండ్లు

అనాస పండ్లు, సీమరేగు పండ్లు- కమలా ఫలాలు మొదలైనవన్నీ సులభముగా దొరికేవి.కడుపునిండా తినెడివాడు. చిల్గోజా పిక్కలుకూడ విరివిగా దొరికేవి. దానితోపాటు ఆయన తిండిపుష్టి గలవాడు. అందుచేత భారత దేశములో ఫలహారము కుదరదని తెలిసికొన్నప్పుడు, వెళ్ళినచోట్కల్లా కాల్చిన వేరుసెనగకాయలను వెంట తీసికొని పోవుట మొదలు పెట్టెను. కొబ్బరికాయ దొరికితే దాని పాలు లేక రసము త్రాగెడి వాడు. కాని చాల ఆలోచించినమీాదట భారత దేశములో ధాన్యము తినకుండా పనిజరుగదని నిశ్చయింపబడెను. అప్పటినుండి అన్నము, రొట్టె లేక కిచిడీ తీసికొనుట మొదలుపెట్టెను. అన్నము మున్నగు వాటిని తినుట మొదలుపెట్టినప్పుడు ఉప్పును కూడ తీసికొనుట తప్పనిసరి యని అనుభవములోనికి వచ్చెను. దానిని తీసికొనుట కూడ మొదలైనది.

ఖేడా జిల్లాలో మనుష్యులను సైనిక శిక్షణకు చేర్చు పని మొదలు పెట్టినప్పుడు ఆయనకు కాలినడకను చాల తిరుగవలసి వచ్చెను. ఆహారములో చాల మార్పులు వచ్చెను. ఆ మార్పులాయనకు సరిపడలేదు. దానివల్ల జబ్బుపడెను. ఒకరోజు రాత్రి ఆయనకు యిక శరీరము నిలువదని ఆయన అనుకొనునంత తీవ్రముగ కడుపు నొప్పి మొదలైనది. అదేరోజున ఆయన ఆఖరికొడుకు మదరాసు నుండి సాబర్మతీకి వచ్చుచుండెను. రాత్రిఅంతా బాపూ-

విహాయ కామాన్ యఃసర్వాన్ పుమాంశ్చరతినిస్పృహః
నిర్మమో నిరహంకార : సశాంతి మధిగచ్ఛతి.

అను శ్లోకమును జపించుచు గడపెను. మరునాటి ఉదయము లేచి రాత్రి అనుభవమును గూర్చి చెప్ప దొడగెను. "ఆ స్థితిలో ఒక కోరిక మనస్సులో ఉండి పోతుంది. దేవదాసు మదరాసునుండి వచ్చుచున్నాడు. వాడు రాకపూర్వమే నా శరీరము పడి పోయినచో వానికి ఎంత దుఃఖము కలుగునో ? వాడు వచ్చునంతవరకు దేహము నిలిచి యుండినచో వాడికంత బాధ కలుగదు." అని చెప్పెను.

గీతా శ్లోకమాయనకు శాంతి నిచ్చినది. రాత్రి గడచి పోయినది.

ఉదయము మా ఉపాధ్యాయులను పిలిపించెను. మాతో వేరువేరుగా మాట్లాడ గోరు చున్నాడని నాతోడి వారు తలంచిరి. అందరు కలసి ముందునన్ను పంపిరి. నేను వెళ్ళి మౌనముగా కూర్చుంటిని. అంతట బాపూ అందరినీ పిలువమనెను. అందరూ కూడిన తర్వాత ఆ ముందురాత్రి తనకు కలిగిన అనుభవమును వినిపించి, "నా దేహము నిలువగలదని నాకు విశ్వాసములేదు. భారత దేశానికి నా ఆఖరి సందేశమును మీకు చెప్పెదను. అహింస ద్వారానే భారతదేశోద్ధరణ జరుగగలదు. భారతదేశము జగదోద్ధరణను అహింస ద్వారానే చేయ గలదు." అని యింత

మాత్రము చెప్పి ఊరకుండెను. ఆశ్రమ విషయములో కొంత చెప్పగలడని మేమాశించితిమి. మాలో ప్రతిఒక్కనికి ఏదోఒకటి చెప్పుననుకొంటిమి. కాని ఆయన ఏమీ చెప్పలేదు. మరల అదే గీతాశ్లోకమును జపించుటలో నిమగ్నుడయ్యెను. చాలసేపటివరకు మేమక్కడ కూర్చుంటిమి. తర్వాత లేచి వెళ్ళిపోతిమి.

ఆయన జబ్బు ఎక్కువైపోయినది; మేమంతా విచారములో పడిపోతిమి. ఇంతలో ప్రభుత్వమువారు రౌలట్ ఆక్టుయొక్క చిత్తుప్రతిని ప్రకటించిరి. అంత గాంధీజీలో జీవించవలెనను కోరిక ప్రవేశించినది. "ఇప్పుడు నేను బలముగా ఉంటే దేశమంతా తిరిగి దానిని మేల్కొల్పెడివాడను. యుద్ధములో మనము ప్రభుత్వమువారికి సహాయముచేసితిమి. దానికిబదులుగ మనకీ రౌలట్ ఆక్టు లభించుచున్నది." అని ఆయన అనసాగను.

బొంబాయినుండి మహారాష్ట్రనుండి కొందరు దేశసేవకులు బాపూను కలియుటకై వచ్చిరి. రౌలట్ ఆక్టును వ్యతిరేకించుటకు సిద్ధముగనున్నవారి జాబితానొకదానిని బాపూ తయారుచేయించెను. అట్టివారికి తాను ప్రక్కమీదనుండే సలహాలను సూచనలను యియ్యవలెనని ఆయన ఉద్దేశము. కాని పూనుకొన్న కార్యముయొక్క మహాత్మ్యము మందువలె పని చేసినది. ఆయన పూర్తిగ ఆరోగ్యవంతుడై లేచి స్వయముగా ఆందోళను మొదలుపెట్టెను.

## 22

మేము సాబర్మతీ ఆశ్రమములో ఉంటిమి. బాపూ మగన్‌లాల్ ఇంట్లో ఉండేవాడు. దీనికర్థము ఈ సంఘటన మగన్‌లాల్ భాయి దేహాంతమైనపిమ్మట జరిగినదన్న మాట. బాపూనకు దేశమునకు సంబంధించిన సార్వజనిక కార్యముల సమస్యలను ఎట్లు పరిష్కరింపవలసి వచ్చెడిదో అదేవిధముగా తన మిత్రుల కుటుంబసమస్యలనుకూడ అనేకసారులు పరిష్కరింపవలసి వచ్చేది. బహుశః అట్టి సున్నిత కార్యములందు ఆయనకు ఎక్కువ సఫలత లభించెడివి. అట్టి కార్యములద్వారా సాధించిన దేశసేవ సార్వజనిక సేవద్వారా సాధించిన దానికంటె అధికముగా ఉండేది.

బాపూనకు పరిచితమైన ఒక కుటుంబములోని ఒక యువకుని వివాహము నిశ్చయమైనది. కన్యపక్షమువారు వివాహము నిశ్చయముచేసికొని దిగులుతీరి యున్నంతలో వరుడు తిరుగుబాటుచేసెను. ఈ పెండ్లి నాకిష్టములేదని సాగెను. అతనికి చాలా నచ్చజెప్పిరి. కాని అతడు ఒప్పుకొనలేదు. తుదకు కన్యపక్షమువారు హతాశులై బాపూ దగ్గరకు వచ్చిరి. విశ్వవంద్యుడైన ఆయన సమయమును అట్టి పనిలో ఉపయోగించుకొనుటెట్లని వారు సంకోచపడిరి. కాని వేరే గతిలేనివాడు ఏ పని చేయడు? బాపూ ఆ పిల్లవానిని పిలువనంపెను. అతనితో చాల మాట్లాడెను. కన్యాపక్షమునకు చెందినవారు కూర్చుండి అంతా విను

చుండిరి. రెండుమూడురోజులవరకు బాపూ ఆ కుర్రవానితో తల బ్రద్దలుకొట్టుకొనెను. పిల్లవాడు ఎంతటివ్యర్థుడో అందరు చూచుచుండిరి.

మూడవ రోజు ఏదో పని మీద నేను బాపూ వద్దకు వెళ్ళాను. ఆ కుర్రవాడు పెద్దగా తన కష్టముల ఏకరువు పెట్టుచుండెను. "నాతండ్రి నన్ను అయిదుగంటలు పనిచేయమంటాడు. దుకాణములో అయిదుగంటలు కూర్చుండవలయునట. బాపూ! ఇప్పుడు మీరే చెప్పండి యీ నాటి కుర్రవాళ్ళు రెండుగంటలకంటె ఎక్కువ పని చేయగలరా? నాబాధ మీతో ఏమి చెప్పను?" అని వాపోవుచుండెను.

బాపూ అంతా శాంతముగ విని తుదకు కుర్రవాని నోటినుండి ఆతడు వివాహమునకు అంగీకరించినట్లు మాట రప్పించెను. పెండ్లాడుటకు వాడు ఒప్పుకొనెను. కన్యపక్షమువారు చింతా విముక్తులైరి.

ఇంతలోనే బాపూ గంభీరుడైపోయెను. ఆ కుర్రవానిని కొంచెముసేపు బైట కూర్చుండుమనెను. పిమ్మట కన్యపక్షమువారిని "ఈ కుర్రవానిస్థితిని మూడురోజుల నుండి మీరు చూస్తూనే ఉన్నారు. ఎట్టి పరిస్థితులలో అతని నోటినుండి పెండ్లికి అంగీకరించినట్లు మాట రప్పించగలిగితినో దానినికూడ మీరు చూచినారు. ఇప్పటికికూడ యీ వివాహము జరుగవలెనని మీరు కోరుచున్నారా?" అని అడిగెను.

కన్యపక్షములోని ప్రధాన పురుషుని ముఖమువంక నేను చూస్తూఉంటిని. అతని మనస్సులో ప్రపంచమే తిరిగి పోవుచున్నట్లుండెను. అతని నోటినుండి అవుననికాని కాదనికాని మాటరాలేదు. మరి బాపూ తన విలక్షణమైన తదేకదృష్టితో అతనివంకే చూచుచుండెను. బాగుగ ఆలోచించుకొని ఆ మనిషి, "మహాత్మాజీ! మీ మాటలు సరియైనవి. అతనితో పెండ్లిజరుగవలెనని యిప్పుడు మాకు లేదు." అని చెప్పెను. అట్లు చెప్పుచున్నప్పుడు అతని కంఠము రుద్ధమైనది. ఆ క్షణములో బాపూ ఆ కుఱ్ఱవానిని పిలిచి వెంటనే అతనితో, "నీమీద బరువు వేయ నేను కోరను. వారితో నేను మాట్లాడితిని. నీవు యీ వివాహసంబంధము నుండి విముక్తుడవైనావు. ఇక నీవు వెళ్ళవచ్చును." అని చెప్పెను.

కుఱ్ఱవాడు వెళ్ళిపోయెను. కన్యపక్షమువారుకూడ అక్కడనుండి లేచిపోయిరి. అప్పుడు బాపూ నావంక తిరిగి, నా మాట వినుటకుముందే, "కాకా! నేడు గోరక్షా కార్యము చేసినాను. గోరక్ష విషయములో నేను మాట్లాడి నప్పుడు కేవలము నాలుగుకాళ్ళ జంతువులగురించిన ఆలోచనే నా మనస్సులో ఉండదు. పాపమా పిల్లను ఎట్టి దుర్గతిలో పడవేయబోవుచుంటిమో భగవంతునికే తెలియును. నేడు యీ శుభకార్యమైనది." అని చెప్ప సాగెను.

ఇంత చెప్పి నేను వెళ్ళినపనివిషయమై బాపూ శ్రద్ధ వహించెను. అయినప్పటికిని ఆయన ముఖముమీద చాల కాలము సంతృప్తిభావముండిపోయెను.

# 23

బిహారు, ఒరిస్సా ప్రజలపట్ల బాపూ మనస్సులో విశేషమైన కరుణఉండెను. ఒరిస్సా ప్రజలు పూర్తిగ నిస్సహాయులు. అణగద్రొక్కబడినవారు. పీడితులు. బిహారులో నీలిమందు వ్యాపారులైన తెల్లవారు అక్కడి ప్రజలను తక్కువ పీడించలేదు. బిహారులోని ప్రజలు అమాయకులు. నిష్పాపరులు. అక్కడ పర్దా ఆచారమున్నది. దానిని దూరము చేయుటకు అక్కడివారు ఒక ప్రచారకురాలిని పంపమని బాపూను అడిగిరి. ఆశ్రమవాసుల శక్తిమీద బాపూనకు చాల విస్వాసముండెడిది. ఆయన తన సోదరుని కుమారుడును ఆశ్రమ వ్యవస్థాపకుడునైన మగన్‌లాల్ భాయి కుమార్తె రాధను బిహారు పంపివేసెను. చిరంజీవియగు రాధ ఆత్మ విశ్వాసముతో అక్కడకు వెళ్ళినది. ఆమె అక్కడ చాల మంచిగపనిచేసినది. ఒకసారి తన కుమార్తెను కలసికొనుటకు మగన్‌లాల్ భాయి అక్కడికి వెళ్ళెను. అక్కడనే జబ్బుపడి ఆయన చనిపోయెను. ఆయన మృతి ఆశ్రమమునకు వజ్రపాతమువంటిది. తంతి రావడముతోడనే అందరి ప్రాణములు ఎగిరిపోయినట్లయినది. అది సోమవారము. బాపూ మౌనదినము. తంతిని వినుటతోడనే బాపూ తానున్న

స్థలమునుండిలేచి మగన్‌లాల్ భాయి యిల్లు చేరుకొనెను.
ఇంతలో నేనుకూడ అక్కడకు చేరుకుంటిని. నేనుండబట్టలేక
ఏడ్వసాగితిని. అప్పుడు బాపూ తన మౌనమునుముగించి
నన్ను ఓదార్చెను. మగన్‌లాల్ భాయి కుమారులను,
కుమార్తెలను పిలిచి తనదగ్గర కూర్చుండబెట్టుకొనెను నేను
అక్కడినుండి వెళ్ళిపోవుటకు సిద్ధమైనప్పుడు బాపూ "ప్రతి
సోమవారము మౌనముగా నుండుటకు నేను వ్రతముతీసికొని
నప్పుడు రెండు సందర్భములలో దానిని భంగముచేయుటకు
అవకాశముంచుకొంటిని. నా శరీరమునకు దుర్భరమైనబాధ
కలిగినప్పుడు లేదా ఇతరులకు అట్టి దుర్భరదుఃఖము కలిగి
నప్పుడు వారిని ఓదార్చుటకు అవసరమైన మాటలాడుటకు
మౌనభంగము కావచ్చును. ఇన్ని సంవత్సరముల తర్వాత
నేనటు మౌనము వీడవలసివచ్చినది " అని చెప్పెను.

బాపూ మగన్‌లాల్ భాయి యింటికి అతని భార్యని
పిల్లలను ఓదార్చుటకు వెళ్ళెను. కాని అక్కడనే ఉండి
పోయెను. తన స్థానమునకు తిరిగిపోలేదు అవసరమైన వస్తు
వులను అక్కడికే తెప్పించుకొనెను. తామిప్పుడు అనాథ
లమై పోయామన్న భావమును మగన్‌లాల్ భాయి కుటుం
బమునకు కలుగనీయలేదు.

## 24

ఆశ్రమము ప్రారంభింపబడిన దినములమాట.
అహమ్మదాబాదులోని మిల్లు కార్మికులు కూలీ హెచ్చిం

పునకై ఆందోళన మొదలుపెట్టిరి. మిల్లు యజమానుల ముఖ్యుడు శ్రీ అంబాలాల్ సారాభాయి. మిల్లుకార్మికులను సంఘటితపరిచి వారి పక్షమున పనిచేయునది శ్రీ అంబాలాల్ సారాభాయి సోదరి అనసూయబహన్. ఇద్దరి మనస్సులలో గాంధీజీపట్ల భక్తి ఉండెను. వారిద్దరిపట్ల గాంధీజీ మనస్సులో సద్భావముండెను. రాజీకుదుర లేదు. సత్యాగ్రహము ప్రారంభించవలసి వచ్చినది. కూలి నూటికి 35 వంతులు హెచ్చింపబడనంతవరకు పనికి తిరిగివెళ్ళమని కార్మికులచేత గాంధీజీ ప్రతిజ్ఞ చేయించెను. సత్యాగ్రహ కాలములో కార్మికుల భోజన విషయమేమిటన్న చింత అనసూయాబహన్‌కు పట్టుకొన్నది. అందులకై ఆమె పదివేల రూపాయలు ఖర్చుచేసి యుండవచ్చును. ఆ సంగతి వినినప్పుడు, బాపూ, "ఇది తప్పుడుమార్గము. మిల్లు యజమానుల ముందర నీ ధనమెంతకాలము నిలువగలదు? నీ డబ్బుబలం మీద వీళ్లు పోరాడుతున్నారని యజమానులకు తెలిస్తే వాళ్లు ఒక్కనాటికి రాజీచేసుకొనరు. అంతేగాక మిల్లు కార్మికులు కుంటి గ్రుడ్డివాళ్ళవలె నీ ఆశ్రితులుకాగలరు. సత్యాగ్రహమంటే ఏదో ఆటకాదు. అది అగ్నిపరీక్ష. ఈ కార్మికులు తమ బలంమీద ఆధారపడి పోరాడవలెను." అని చెప్పసాగెను.

ఇక బీదవాండ్లు ఉపవాసముండి ఎంతకాలము సత్యాగ్రహము చేయగలరు? సత్యాగ్రహమనునది వాళ్ళకే కాదు, దేశాని కంతకూ కూడ క్రొత్తవిషయము. కొద్ది

రోజులలోనే కార్మికులలో బలహీనత కనపడసాగెను. వాళ్లు ఓడిపోయి పనికిపోవుటకు సంసిద్ధులైరి. బాపూ యిది సహించలేకపోయెను. "మేము ఆకలితో చచ్చెదము గాని ప్రతిజ్ఞా భంగము చేయము." అనునట్టి మనోవృత్తి కార్మికులలో కలిగించవలెనన్నచో స్వయముగ తాను ఆకలికి గురియై వారికి పాఠము నేర్పవలెనని బాపూ యోచించెను.

కార్మికులను సమావేశపరచి వారికి బోధపరుస్తూ బాపూ, "ఎంతవరకు మీ కూలి నూటికి 35 వంతులు హెచ్చింపబడదో అంతవరకు మీరు దృఢప్రతిజ్ఞులై ఉండవలెను. మీరు ఓడిపోవుట నేను సహింపజాలను. నన్ను సాక్షిగా పెట్టుకొని మీరు ప్రతిజ్ఞచేసినారు. అందుచేత మీ షరతులు పూర్తియగునంతవరకు ఉపవాసముండెదనని నేనిప్పుడు ప్రతిజ్ఞ చేయుచున్నాను." అని చెప్పెను. ఈ మాటలు దివ్యౌషధమువలె- మెరుపువలె పనిచేసినవి. కార్మికులలో దైవీశక్తి ప్రవేశించినది. ప్రతిరోజు సాయంకాలము బాపూ ఆశ్రమమునుండి అయిదారుమైళ్ళు నడిచి వాడలలోనికిపోయి అక్కడ ప్రతిజ్ఞాపాలనముయొక్క మహాత్మ్యమును బోధించెడివాడు. కార్మికులకు చదివి వినిపించుటకు ప్రతిరోజు ఒక క్రొత్తరకం కరపత్రమునుకూడ అచ్చువేయించెడివాడు.

బాపూ ఉపవాసముమాట వినుటతోడనే నేను, మహాదేవభాయి ఆయనతోపాటు ఉపవాసముండవలెనని ఆలోచించాము. బాపూ తిండి తినకపోతే మేమెట్లు తినగలము?

మహాదేవభాయి బాపూ దగ్గర తన ఉద్దేశమును ప్రకటించెను. ఆయన నివారించెను. కాని మహాదేవభాయి ఒప్పుకొనలేదు. చర్చలకు హేతువాదములకు అది సమయము కాదు. బాపూ, "చూడు మహాదేవ్! నీ ధర్మమేదో నాకు తెలియును. వెళ్ళు. అన్నముతిను. తినకపోయినట్లయితే నేను నీ ముఖము చూడను." అని కఠినముగా చెప్పెను.

పాపము మహాదేవభాయి చిన్నబుచ్చుకొన్న ముఖముతో నా దగ్గరకు వచ్చెను. వచ్చి, "బాపూ నా మొగము చూడకపోయినచో నే నెట్లు బ్రతుకగలను?" అని అనెను. అంతట నేను, "బాపూయే మన అంతరాత్మ. ఆయన అన్నము తినమన్నప్పుడు మనము తప్పక తినవలెను. అదే మనకు పరీక్ష కాగలదు." అని చెప్పితిని.

నా పేరుకూడ బాపూ దాకా పోయినది. నేను ఆయన దగ్గరకుపోయి "నేను అంతా వినియుంటిని. మేమిద్దరము భోజనముచేయుటకు నిశ్చయించుకొంటిమి. కాని నేను కేవలము ఖర్జూరమునే తిని నీళ్ళు త్రాగి ఉండెదను కాని దీనికి ఉపవాసముతో ఏమీ సంబంధములేదు. అది స్వతంత్రమైన నా ప్రయోగము." అని సంజాయిషీ యిచ్చుకొన మొదలుపెట్టితిని. ఆయన వెంటనే, "ఆఁ, మంచిది. మీరు మీ ప్రయోగమును చేయవచ్చును." అని చెప్పెను.

వాస్తవమునకు నేనట్టి ప్రయోగము చేయవలెనని ఆలోచించుచుంటిని. తెలివిగా ఉపవాసమునకు వేరొక

మార్గము కనిపెట్టితినని బాపూ సందేహించునేమోనని నాకు భయముగా ఉండెను. కాని బాపూ మనస్సులోని శక్తిసందేహమెన్నడు రాదు. ఏ విధముగను అనుమానించ కుండగనే ఆయన అనుమతినిచ్చుటవల్ల నాకు చాల సంతోషము కలిగినది.

మా జగడము యీ విధముగా సద్దుమణిగినది. అక్కడ అనసూయాబహన్, బాపూను తానే యీ కార్మికుల జగడములోనికి లాగితినని, అందుచేత ఆయన ఉపవాసము చేయుచుండగ తానుకూడ ఉపవాసము చేయవలెనని ఆలోచించినది. అనసూయాబహన్ ఉపవాసము సంగతి కార్మికుల చెవులదాకా పోయినది. వారు చాల వ్యాకులపడసాగిరి. అనసూయాబహన్ ఆశ్రమమునకు వచ్చియుండెను. అక్కడకు ఒక ముసల్మాన్ కార్మికుడు వచ్చి, "మహాత్మా అయితే మహాత్ముడే. ఆయన ఉపవాసముచేసినచో మేము భరించగలము. కాని మీరు ఉపవాసముచేసినచో నేను సహింపజాలను. నా బుర్ర సరిగా ఉండజాలదు. బహుశః ఏ మిల్లు యజమానినైన నేను హత్య చేయవచ్చును." అని చెప్పసాగెను. ఇదొక క్రొత్తసంగతి. అప్పుడు బాపూ ఉపవాసముచేయుట ఆమె ధర్మముకాదని అనసూయాబహన్‌కు నచ్చజెప్పెను. పిమ్మట ప్రార్థనా సమయములో, "నాతోపాటు మీరు ఉపవాసము చేసినట్లయితే దానివల్ల నా శక్తి వృద్ధికాజాలదు. దానికి బదులు మీ కేమగునో యన్నచింత నన్ను పట్టుకొని పీడిం

చును. కాబట్టి మీరు బాగుగా భోజనముచేసి నాతోపాటు పనిచేస్తూ ఉండండి. ఈ ఉపవాసములో నా దేహము పడి పోయినను మీరు విచారించకూడదు. అంతేగాక-ఆశ్రమములో మధురాన్నము తినుటకవకాశమున్నచో మీరు మధురాన్నమును వండుకొని తినవలెను. నా సహచరులు నాతోపాటు ఉపవాసము చేయుట మొదలుపెట్టినచో నా పనులన్నియు ఆగిపోవును. నే నెన్నటికిని ఉపవాసము చేయజాలను." అని చెప్పెను. ఈ సత్యాగ్రహము ఎంతవరకు నడిచినదో, అది ఎట్లంతమైనదో, బాపూ మాటలలో రెండుపక్షములవారికి జయమెట్లు లభించినదో అది యిక్కడ చెప్పనవసరములేదు. 'ఒక ధర్మయుద్ధ' మను గ్రంథములో మహాదేవభాయి దాని విస్తృత వర్ణన నిచ్చెను.

## 25

1926 సంవత్సరపు నాటిమాట కావచ్చు. బాపూ ఖాదీకొరకు దక్షిణ భారతములో పర్యటన మొనర్చుచుండెను. తమిళనాడు పర్యటన ముగిసినది. ఆంధ్రలో మోటారు మీద ప్రయాణము సాగుచుండెను. మేము శ్రీకాకుళము చేరుకొంటిమి. రాత్రి పదిగంటలై యుండవచ్చును. అచ్చటికి చేరుకొనిన తర్వాత అతి సన్నని నూలువడుకు స్త్రీల నూలువడకు పోటీ కార్యక్రమ మేర్పాటు చేయబడియుండుట చూచితిమి. శ్రీకాకుళము

యొక్క అతి సన్నని ఖాదీ భారత దేశమంతటా ప్రసిద్ధి వహించి నది. రాత్రి పగలు మోటారు ప్రయాణమువల్ల మేము అలసి పోతిమి. బాపూనకు గత్యంతరము లేదని ఆయన నూలువడుకు పోటీలో తప్పక కూర్చుండవలసి వచ్చునని, అనవసరంగా మేమెందుకు బాధపడాలని, సూటిగాపోయి నిద్రపోవుట మంచిదనుకొంటిమి. మహాదేవ భాయి నేను మాస్థానములకు పోయి నిద్రపోతిమి. బాపూ ప్రక్క కూడ వేయబడి ఉండెను. ఆయన ఎప్పుడువచ్చి నిద్రపోయినాడో మాకు తెలియదు.

ఉదయం 4 గంటలకు మేము ప్రార్థనకొరకు లేచితిమి. కాళ్ళు చేతులు మొగము కడుగుకొని ప్రార్థన చేసెడివారము. అది చేయుటకు పూర్వమే బాపూ, "రాత్రి నిద్రపోవుటకు ముందు మీరు ప్రార్థన చేసితిరా," అని అడిగెను. దానికి నేను, "వచ్చినప్పుడు చాలా అలసియుంటిని. అందుచేత వెంటనే నిద్రపోతిని. ప్రార్థనసంగతి జ్ఞాపకమే లేదు. ఇప్పుడు మీరడిగినప్పుడు రాత్రి ప్రార్థన చేయనే లేదని జ్ఞాపకము వచ్చినది." అని జవాబు చెప్పితిని.

మహాదేవ భాయి, "నేనుకూడ అట్లే నిద్రపోతిని. కాని కన్నులు మూతబడుటకుముందు ప్రార్థనసంగతి జ్ఞాపకమువచ్చినది అందుచేత ప్రక్కమీద కూర్చుండే ప్రార్థన ముగించితిని. కాకాను నిద్రలేపలేదు." అని చెప్పెను.

అంతట బాపూ తనసంగతి వినిపించెను. "నేను గంట గంటన్నరవరకు నూలువడకు పోటీలో కూర్చుంటిని. అక్కడ

నుండి వచ్చినప్పుడు నేనుకూడ చాల అలసియుంటిని. అందుచేత ప్రార్థనసంగతి మరచిపోయి అట్లే నిద్రపోతిని. కాని రెండు రెండున్నరకు నిద్రమెలకువ వచ్చినప్పుడు రాత్రి ప్రార్థనచేయలేదని జ్ఞాపకమువచ్చినది. శరీరము వణకిపొవు నంత దెబ్బతగిలినట్లయినది. చెమటచే నా ఒడలంతా తడిసి పోయినది. లేచి కూర్చుంటిని. చాల పశ్చాత్తాపపడితిని. ఎవని కృపవల్ల నేను జీవించుచున్నానో ఆ భగవంతునే నేనుమరచిపోయాను. ఎంతపెద్దతప్పు జరిగిపోయింది. నేను భగవంతుని క్షమాభిక్ష వేడితిని. కాని అప్పటినుండి నాకు నిద్రరానేలేదు. అట్లే కూర్చుండి ఉండిపోతిని. ”

దీనితర్వాత మేము ప్రాతఃకాల ప్రార్థనచేసినాము. మహాదేవభాయి భజనకీర్తనపాడెను. మరల బాపూ, “ప్రయాణములలో కూడ సాయంకాల ప్రార్థనను ప్రార్థనకు నిర్ణయించబడిన వేళకే చేయవలెను. మనము పగటి కార్య క్రమమంతా పూర్తిచేసికొని నిద్రపోవుటకు ముందు అవ కాశముచూచుకొని యిప్పుడు ప్రార్థన చేస్తున్నాము. ఇదే పొరబాటులేక తప్పు. మనమెక్కడ ఉండినను నేటినుండి సాయంకాలము ఏడుగంటలకే ప్రార్థన జరుగగలదు.” అని చెప్పెను.

మా మోటారు ప్రయాణము సాగుచునేయుండెను. సాయంకాలం ఏడుగంటలకు మేమెక్కడనున్నను - అది అడవియైనను, పట్నమైనను, మోటారునాపి ప్రార్థనచేయుట మేము మొదలుపెట్టితిమి.

## 26

జాతీయవిద్యకు ఆచార్యుడైన శ్రీ ఆప్టేగురూజీ లోక మాన్యుని జీవితచరిత్రను చిన్నదాని నొకటి, ఇటీవల ప్రకటించెను. బొంబాయి శాసనసభాస్పీకరు (అధ్యక్షుడు) దాని ప్రస్తావనలో యీ క్రింద చెప్పబడిన విషయము వ్రాసెను.

1915 లో అహమ్మదాబాదులో కాంగ్రెసు యొక్క ప్రాంతీయ పరిషత్తు సమావేశ మయ్యెను. పరిషత్తు కార్యక్రమము నడుపువారు నవయువకులైనప్పటికిని ఆ రోజులలో అది మితవాదుల చేతులలోనుండెను. మిష్టర్ జిన్నా దాని కధ్యక్షుడు. ఆయనను ఊరేగించుటకు నిర్ణయింపబడెను. పరిషత్తు ఆహ్వాన సంఘము శ్రీ తిలక్‌ను కూడ ఆహ్వానించెను. ఆయన వచ్చుటకు అంగీకరించెను. లోకమాన్యుని కూడ ఊరేగింపులో తీసికొనిపోవలెనని యువకవర్గము కోరిక. కాని పరిషత్తు పెద్దలు దీనికి సిద్ధముగా లేకుండిరి. దానికి కారణము లోకమాన్యుడు అతివాద పక్షమునకు చెందుటయే. లోకమాన్యుని ఊరేగింపుతో తీసికొని పోయినచో మిగతా నాయకులందరికిని అవ్లై చేయవలసి ఉండునని వారి వాదన. ఫలితము పరిషత్తుపక్షమున లోకమాన్యునికి స్వాగతమిచ్చుట జరుగలేదు నవయువకులు హతోత్సాహులైరి.

ఆ రోజులలో గాంధీజీ ఇంకా రాజకీయరంగంలో

ప్రవేశించ లేదు. ఆయన అప్పటికి మహాత్ముడు కా లేదు. పరిషత్తులో సభ్యుడుకూడ కాడు. లోకమాన్యునకు జనులందరి పక్షమున స్వాగతమిచ్చుటకు ఏర్పాటు జరుగ లేదని వినినంతనే ఆయన తన సంతకముతో ఒక కరపత్రమును వేయించి వేలకొలదిగ అహమ్మదాబాదులో పంచి పెట్టించెను. దానిలో- "లోకమాన్యునివంటి అలౌకిక నాయకుడు మన పట్టణమునకు రాబోవుచున్నాడు. ఆయనకు స్వాగతమిచ్చుటకు నేను రైల్వే స్టేషనుకు వెళ్ళుచున్నాను. ఆయనకు స్వాగతమిచ్చుటకు స్టేషనుకువచ్చుట నగరవాసుల ధర్మము." అని మాత్రమే ఆ కరపత్రములో నుండెను.

ఈ కరపత్రము గారడీవలె పనిచేసినది. స్టేషన్‌లోను వీధులలోను జనం అసంఖ్యాకముగ గుమికూనది. లోక మాన్యునకు అప్రతిమానముగ స్వాగతమియ్య బడినది.

## 27

అవి ఆశ్రమము ప్రారంభించిన దినములు. అప్పుడు మేము దగ్గరకూర్చుండి చాలసేపటివరకు బాపూతో అనేక విషయములను గురించి మాట్లాడుటకు అవకాశ ముండెడిది.

ఒక రోజున మా సంభాషణ జరుగుచుండెను. అందులో లోకమాన్యుని ప్రసక్తివచ్చినది. అప్పుడు బాపూ, "భారత స్వాతంత్ర్యమును గూర్చి అహోరాత్రములు అఖండ ధ్యానమొనర్చు పురుషు డాయన ఒక్కడే" అని

యింత మాత్రము చెప్పి ఒక్క క్షణమాగి ఆయన మరల "ఈ క్షణము లోకమాన్యుడు నిద్ర పోకుండ నుండినచో స్వరాజ్యమును గురించి ఏదో ఒక విషయ మాలోచించు చుండును లేదా దాని విషయమై చర్చించుచుండును. ఇది నిశ్చయపూర్వకముగ నేను చెప్పగలను." అని చెప్పెను.

# 28

అది 1920 జులై 31. లోకమాన్యుని ఆరోగ్యము పూర్తిగా చెడిపోయెనని విని నేను బొంబాయి వెళ్ళితిని. సర్దారు గృహమునకు పోయి నేను లోకమాన్యుని దర్శనము చేసికొంటిని. దర్శనమునకు అనుమతి సంపాదించుట సులభమైన పనికాదు. ఎందుచేతనంటే అవి ఆయన జీవితములోని ఆఖరి ఘడియలు. అనుమతి పొంది నేను లోనికి వెళ్ళితిని. ఆయన శ్వాస చాల వేగముగా ఆడుచుండెను. బొంబాయి లోని గొప్ప డాక్టర్లందరు ఆయన చుట్టు ప్రక్కల నిలబడి ఉన్నారు. ఆ గదిలో నేను చాలసేపు ఉండలేకపోయాను. హృదయము బరువెక్కిపోయినది. నేను అక్కడనుండి వచ్చి, మహారాష్ట్ర నాయకులందరు విచారగ్రస్తులై కూర్చున్న గదిలోనికి పోతిని. నేను కొంచెము అస్వస్థతగా ఉండుట గమనించి బాపూజీ ఆనె తన దగ్గరకు పిలిచి సహాయ నిరాకరణోద్యమమును గూర్చి కొంత చర్చించెను.

సాయంకాలపు రైలులో నేను అహమ్మదాబాదుకు తిరిగి బయలుదేరాను. నేను బాపూతో, "దర్శనమైనది.

నే నిప్పుడు ఆశ్రమమునకు పోయెదను." అని యింత మాత్రమే చెప్పితిని.

అదే రాత్రి లోకమాన్యుని దేహాంతమైనది. టెలిఫోను మీద ఈ వార్తను వినుటతోడనే, "అరెరే! నేను కాకాను ఆపి ఉంచితే మంచిదయ్యేడిది." అనునదే బాపూ నోటినుండి వెలువడిన మొదటి వాక్యము. దీని తర్వాత బాపు గంభీరమైన ఆలోచనలో పడిపోయెను. రాత్రంతా ప్రక్కమీదనే కూర్చుండి ఉండెను. ప్రక్కనే దీపము వెలుగుచుండెను. దానినట్లే ఉండనిచ్చెను. దీపము వంక చూస్తూ ఆలోచిస్తూనే ఉండిపోయెను.

రాత్రి ఉత్తర భాగమున మహాదేవభాయి కండ్లు తెరచుకొన్నవి. బాపు అట్లే కూర్చుండి ఉండుట ఆతడు చూచెను. ఆయన దగ్గరకు వెళ్ళెను. బాపు నోటినుండి, "నేను ఇప్పుడు ఏదైన జటిల సమస్యలో చిక్కుకున్నప్పుడు శ్రద్ధాపూర్వకముగ సలహా సంప్రతింపులు యిక యెవ్వరితో జరుపగలను? పూర్తి మహారాష్ట్రముయొక్క సహాయ మవసరము వచ్చిపడినప్పుడు ఎవ్వరితో చెప్పను?" అను మాటలు వెలువడెను. కొంచెమాగి మరల, "నేటి వరకు స్వరాజ్యపు పనినే చేయుచున్నాను. కాని వీలైనంత వరకు స్వరాజ్యమను మాట నుపయోగించకుండగ దాట వేస్తూ వచ్చాను. కాని యిప్పుడు లోకమాన్యునిచే కొనసాగింపబడిన అఖండ స్వరాజ్యము జపమును ముందుకు నడిపించవలసి యుండును. ధీరుడగు ఈ మహావీరుని చేరి

లోని స్వరాజ్య ధ్వజమును ఒక్క క్షణమైనను క్రిందికి వంగనీయరాదు." అని చెప్పెను.

మరునాడు లోకమాన్యుని అంతిమ యాత్రలో బాపూ పాల్గొనెను. ఆయన శవమును కూడ మోసెను. కాని అట్టి గంభీర సందర్భములో ఉండవలసినంత శాంతి, గాంభీర్యములు ప్రజలలో లేకుండుట చూచి బాపూ మనస్సునకు బాధ కలిగెను. ఆయన చాల దుఃఖితు డయ్యెను. కాని దానినే తర్వాత క్రొత్తదృష్టితో చూచెను. అహమ్మదాబాదు వచ్చిన తర్వాత ప్రార్థనలో దాని విషయమై ప్రస్తావిస్తూ, "అక్కడికి చేరిన ప్రజ సందోహము శోకించుటకు వచ్చినదా? అది తమ జాతీయ నాయకుని సన్మానించుటకు వచ్చినది. వారినుండి శోకసమయములో నుండవలసిన గాంభీర్యమును మన మెందుల కపేక్షింప వలెను?" అని చెప్పెను.

## 29

1926 నాటి సంగతి. బాపూ రాజాజీ ఏర్పాట్ల ప్రకారము దక్షిణ దేశములో ఖాదీయాత్ర జరుపు చుండెను. యాత్ర చేస్తూ చేస్తూ మేము షిమోగా దగ్గరకు చేరితిమి. అక్కడనుండి గెర్ సప్పా జలపాతము చాల దగ్గర. అక్కడికి పోవుటకు వలయు మోటారు మున్నగు సర్వసౌకర్యములు రాజాజీ పూర్తిగా ఏర్పాటు చేసెను. పది పన్నెండు మైళ్ళ దూరము. రాజాజీ, ఆయన పిల్లలూ

దేవదాసు, గంగాధరరావు దేశపాండే, నేను, మణిబహన్ పటేలు (వల్లభబాయి కుమార్తె) మున్నగువారము చాల మందిమి తయారైనాము. మీరుకూడ రండని నేనుబాపూను ప్రార్థించినాను. ఆయన కిష్టమున్నట్లు కనబడనందున నేను, "లార్డ్ కర్జన్ భారతదేశమునకు వచ్చిన తర్వాత అవకాశము దొరకుటతోడనే ఆయన గిర్‌సప్పా చూచుటకు వచ్చెను. ప్రపంచములోని జలపాతము లన్నింటిలో నిది చాల ఎత్తైనది." అని చెప్పాను. నయాగరాకంటె కూడనా యని బాపూజీ అడిగెను. నా ప్రపంచ జ్ఞానమును ప్రదర్శించుటకు మంచి అవకాశము లభించెను. "నయాగరాలో పడు నీటి ఘనపరిమాణ మెక్కువ. కాని దానికంటె ఎత్తైన జలపాతము లెన్నో మన దగ్గర, ప్రపంచములో యితర చోట్ల గలవు. గెర్‌సప్పాలో నీరు 960 అడుగుల ఎత్తునుండి ఏకధాటిగా పడుచుండును. ప్రపంచములో మరెక్కడా యింతటి ఎత్తైన జలపాతములేదు." అని చెప్పితిని.

బాపూకుకూడ దానిని చూడవలెనన్న అభిరుచిని కలిగించవలెనని నా కోరిక. కాని ఆయన నా అభిరుచిని పన్నగిల జేసెను. నెమ్మదిగా "ఆకాశమునుండి వర్షము ఎంత ఎత్తునుండి పడుతుంది?" అని అడుగ సాగెను. మనసులో సిగ్గుపడితిని. ఇంతలో నేనొక స్థితప్రజ్ఞునితో మాట్లాడుచున్నానను జ్ఞానము కలిగినది. అంతట ఆయనను ఆకర్షించు ప్రయత్నము మాని, "మీరు రాకపోతే పోనీయండి, మహాదేవభాయినైతే పంపండి. మిమ్మల్ని

అడుగకుండా ఆయనరాడు." అని అడిగితిని. బాపూ "మహాదేవు రాడు. నేనే అతని గిర్‌సప్పను." అని సంకోచించకుండా జవాబు చెప్పెను. అది 'యంగ్ యిండియా' రోజన్న సంగతి నా మనస్సునకు తట్టలేదు. తుపానులాంటి యీ పర్యటనలో కూడ 'యంగ్ యిండియా', 'నవజీవన్' అను రెండు పత్రికలు నడుపు భారము వారిద్దరు తీసికొనిరి. ఆ రోజున వాటికి వారు వ్రాయకపోతే పత్రికలు వెలువడజాలవు. నాకు చాల కోపము వచ్చినది. "మీరు రారు, మహాదేవును పంపరు. నేనెందుకు పోవాలి? నేను కూడ వెళ్లనక్కర లేదు." అని అంటిని. దానికి బాపూ చాల మృదువుగ "గిరసప్పా చూచుటకు పోవుట మీ స్వధర్మము. మీరు ఉపాధ్యాయులు కారా? అక్కడికి వెళ్ళివస్తే మీ విద్యార్థులకు మంచి భూగోళ పాఠము చెప్పగలరు. మీరు తప్పకుండా వెళ్ళవలెను." అని తెలియ జెప్పెను.

చిన్నప్పటినుండి ఏ గిర్‌సప్పాను గురించి వినుచుంటినో, దేనిని చూడవలెనన్న సంకల్పముతో నేను పెరిగి పెద్దవాడనైతినో, దానిని చూడటానికి వెళ్ళుటకు యింతకంటె ప్రోత్సాహము నాకవసరము లేకుండెను. దానిని చూడవలెనని నేను తహతహ లాడుచుంటిని. కాని బాపూ ఆదేశమువల్ల అట్లు పోవుట నా కర్తవ్యమై పోయినది. నేను సంతోషముతో వెళ్ళుటకు తయారైతిని. గిర్‌సప్పాను చూచి నేను కృతార్థుడనైతిని. బాపూ మీద నాకు వచ్చిన

శోషపు కథనంతా గుజరాతీలో నే నెక్కడో వ్రాశాను. బాపూ కూడా దానిని చదివి యుండవచ్చును.

ఇది జరిగిన పదిహేను సంవత్సరముల తర్వాత ఏదో కారణమువల్ల బాపు మహాదేవ భాయిని మైసూరు దివానగు సర్ మీర్జా ఇస్మైల్ వద్దకు పంపెను. అతి మున్నితమగు రాయబారములు జరుపుటకు బాపూ మహాదేవ భాయినే పంపేవాడు. మహాదేవభాయి ప్రయాణమునకు బయలుదేరు చుండెను. అప్పుడు బాపూ "చూడు. మైసూరు వెళ్తున్నావు. అక్కడి పని కొరకు నీవు అక్కడ కొంత కాలముండవలసి వచ్చును. ఇక్కడకు తొందరగా రావలసిన అవసరముకూడా లేదు. ఈసారి గిర్‌సప్పా తప్పక చూచి రావలసింది. నేను సర్ మీర్జా ఇస్మైయిలుకు కూడా వ్రాశాను. అయన నీకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయ గలడు." అని చెప్పెను.

మహాదేవభాయి గిర్‌సప్పా చూచి వచ్చెను. ఆయన అట్లా చూడటంవల్ల ఆయనకంటె నాకు ఎక్కువ సంతోష మైనది. ఒక పనివల్ల మమ్మల్నిద్దరిని సంతోష పెట్టినందు లకు బాపూకుకూడ సంతోషము కలిగియుండవచ్చును. *

---

* జలపాతము పడుచోట గిర్‌సప్పా యను గ్రామమున్నది. దాని మీదనే ఇంగ్లీషువారు దానికి "గిర్‌సప్పా ఫాల్స్ (జలపాతము)" అని పేరు పెట్టిరి. దాని అసలు పేరు జోగ్. పురాతన కన్నడ భాషలో జల పాతమును జోగ్ అనెడివారు. ఇది శరావతీ నదియొక్క జోగ్ (జల పాతము). శరావతిని భారంగి అనికూడ పిలిచెదరు.

# 30

ఈ పర్యటనలోని మూడే. మేము పూర్తిగా దక్షిణమున నున్న నాగర్ కోవిల చేరుకొంటిమి. అక్కడనుండి కన్యాకుమారి దూరము లేదు. ఇంతకుముందే ఏదో సందర్భములో బాపూ కన్యాకుమారి పోయివచ్చెను. అక్కడి దృశ్యమువల్ల ప్రభావితుడుకూడ నయ్యెను. ఆశ్రమమునకు తిరిగి వచ్చి కన్యాకుమారిని గురించి ఉత్సాహముతో మాట్లాడెను కూడ.

మేము నాగర్ కోవిల చేరుకొంటిమి. వెంటనే మేము దిగిన యింటి యజమానితో బాపూ, "కాకాను నేను కన్యాకుమారి పంపగోర్తాను. అందు కొరకు మోటారు నేర్పాటు చేయవలసింది." అని చెప్పెను. అట్లు చేయుట కాయన ఒప్పుకొనెను.

కొంత సమయముంతర్వాత నేను వెళ్లే లక్షణము లేవియు కనిపించక ఆయన గృహయజమానిని పిలిపించి కాకా వెళ్లుటకు ఏర్పాటు చేయబడినదా లేదా యని మరల అడిగెను. ఎవరికైనా ఏదైనా పనిని అప్పగించిన తర్వాత ఆ పని విషయమై బాపూ మరల దర్యాప్తు చేయుట నే నెప్పుడు చూడ లేదు. అందువల్ల ఆ స్థానమును చూచి బాపూ ఎంత ప్రభావితుడయ్యెనో నేను గ్రహించితిని. స్వామి వివేకానంద కూడ అక్కడికి వెళ్లి భావావేశములోపడి సముద్రములో దూకి కొంత దూరమున నున్న ఒక పెద్దరాతిమీదకు ఈదుకుంటూ పోయెనని నేను ఎక్కడనో చదివితిని కూడ.

అప్పుడు బాపూను నేను "మీరు కూడ వస్తారుగదా ?" అని అడిగితిని. దానికి బాపూ, "మాటిమాటికి పోవు అదృష్టము నాకు లేదు. ఒకసారి చూచి వచ్చాను. అంతే చాలు." అని చెప్పి నేను కొంచెము కోపగించుటచూచి ఆయన గంభీరంగా "చూడండి! యింత పెద్ద ఉద్యమాన్ని చేపట్టి కూర్చున్నాను. వేలకొలది స్వయంసేవకులు దేశసేవా కార్యములో పడియున్నారు. అట్టి సమయములో రమణీయదృశ్యములను చూడవలెనన్న ఆసక్తిని నేను అదుపులో పెట్టుకొనక పోయినచో స్వయం సేవకులందరూ నన్నే అనుకరించెదరు. ఇప్పుడు లెక్క వేయండి. ఎంతమంది సేవకుల సేవా కార్యమునుండి దేశము వంచితురాలగునో? నన్ను నేను అదుపులో పెట్టుకొనుటే మంచిది" అని చెప్పెను.

గిర్‌సప్పాకు సంబంధించిన అనుభవముండనే ఉన్నది. బాపూ మాటలు నాకు నచ్చినవి. అప్పుడు నేను, "నేను బాను వెంటతీసికొని పోయెదను. చంద్రశంకర్ (నా కార్యదర్శి) నాతో ఎట్లాగూ వస్తాడు." అని చెప్పితిని.

మేము వెళ్ళితిమి. దారిలో శచీంద్రమువద్ద సుందరమైన దేవాలయమున్నది. కన్యాకుమారి అగ్రమున కన్యకగా ఉన్న పార్వతి దేవాలయమున్నది. దానిలోనికి హరిజనులను రానీయరు. కాబట్టి మేములోనికి పోలేదు. భవ్యమును, విశాలమునైన యీ అగ్రమంతా భారతమాత యొక్క పెద్ద దేవాలయమని నా మనస్సులోనా కనిపించి

నది. తూర్పు సముద్రము, పడమటి సముద్రము, దక్షిణ సముద్రము - మూడు మహా సాగరము లిక్కడ కలియును. ఇక్కడ సూర్యుడు ఒకే సముద్రములో నుండి ఉదయించి రెండవ సముద్రములో అస్తమించును. భారత దేశము యొక్క తూర్పు సముద్ర తీరము పడమటి సముద్ర తీరము యిక్కడ ఒక్కటై పోవును. ఇక్కడయాత్ర అంతమగును. సముద్రములో స్నానముచేసి ఒక పెద్ద బండపై కెక్కి కూర్చుండి నాకు జ్ఞాపకము వచ్చిన ఉపనిషన్మంత్రములను మహా సాగరము తాళము వేయుచుండగ పాడసాగితిని. ఈ ప్రాకృతిక సాంస్కృతిక శోభ అనే గీటురాయి మీాద బాపూ జీవనక్రమమును పరీక్షచేసి చూడ ఆ జీవితపు శోభ దీనికంటె తక్కువది గాదని తెలిసికొంటిని.

## 31

బాపూ రెండవ కుమారుడగు మణిలాల్ వివాహము కొంచెం ఆలస్యంగా జరిగింది. ఆయన దక్షిణాఫ్రికాలో ఉండేవాడు. వివాహము భారత దేశములో చేసికొనవలసి యుండెను. కన్యను ఎన్నుకొనేపనిని మణిలాల్ తన తండ్రికే వదలి పెట్టెను. బాపూ యొక్క చిన్న పెద్దపనులన్నింటిలో శ్రీ జమ్నాలాల్‌జీకి చాల ఆసక్తి యుండెడిది. ఆయన మశరూవాలా కుటుంబములోనుండి ఒక కన్యను వధువుగా నిర్ణయించెను. ఆమె అకోలాకు చెందిన నానాభాయి మశరూవాలా కుమార్తె సుశీల. జమ్నాలాల్‌జీ సూచనను బాపూ త్వరితముగనే స్వీకరించెను. వివాహ విధుల ప్రకా

రము వివాహమైపోయినది. గాంధి కుటుంబము వారందరు అకోలానుండి ప్రయాణమైరి.

స్టేషన్‌కు వస్తూనే నవ్వుతూ బాపూ "మణిలాల్ నీవు మా పెట్టెలో కూర్చుండరాదు. నీ స్థలం నీవు చూసుకో. సుశీల కూడ నీతో అక్కడనే కూర్చొన గలదు. పరస్పరం పరిచయం చేసుకొనుటకు యిదే అవకాశ" మని చెప్పెను.

బాపూ ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. అప్పుడు ప్రార్థన సమయములో స్వయముగా యీ వివాహమునకు సంబంధించిన వృత్తాంతమంతా వినిపించెను.

## 32

ఈ సంగతి మహాదేవభాయి నోటి నుండి వినినది. ఉత్తర భారతదేశములో బాపూతోపాటు మహాదేవభాయి ప్రయాణము చేయుచుండెను. నడుస్తున్న రైలులో వ్రాయు అభ్యాసము బాపూకు కూడ ఉండెను. ఇక మహాదేవభాయి విషయం అడగనవసరంలేదు. ఒకరోజున మహాదేవభాయి సాయంకాలమున వ్రాయుటకు కూర్చుండి రాత్రి తెల్లవారు ఝామువరకు వ్రాయుచునే ఉండెను. పనిపూర్తిచేసే నిద్ర పోయెను. ఇక ఉదయం తొందరగా లేచుట అసంభవమై పోయినది.

'నిద్రలేచి చూడగా - బాపూ స్టేషన్ వెయిటింగు రూమునకు వెళ్ళి తన మహాదేవు కొరకు టీ, పాలు, పంచదార, రొట్టె మున్నగునవన్నీ తెప్పించి ట్రే(పళ్లెము) లో

తయారుగ నుంచుట చూచెను. బాపూ స్వయముగా టీ త్రాగెడి వాడు కాదు. కాని మహాదేవుకు టీ లేకుండ గడ వదని ఆయనకు తెలియును. అందుచేత ఇదంతా సిద్ధముచేసి మహాదేవభాయి నిద్ర మేల్కొనుటకు ఎదురు చూచుచుం డెను. మహాదేవభాయి నిద్ర లేవటంతోడనే యిదంతా చూచి ముఖ్యముగ తాను టీ త్రాగే సంగతి బాపూకు తెలిసినందుకు ఆయన కలవరపడెను. కాని బాపూ ఏవేవో మాటలు తియ్యగా చెప్పుచు అతని సంకోచమును దూరము చేసివైచెను. రాత్రి వ్రాతవల్ల కలిగిన అలసటను పోగొట్టుటకై బాపూ యీ యేర్పాటు చేసెను.

# 33

ప్రభుత్వము బాపూను చంపారన్ నుండి పంపించలేక పోయినతర్వాత ఒక క్రొత్త ఎత్తు ఎత్తెను. లెఫ్టినెంటు గవర్నరు మొదలైన పెద్ద ఆఫీసర్లు బాపూను పిలిపించుకొని ఆయనతో, "మీరు చాల మంచివారు. కాని మీకు సహాయ పడేవారు కుటిలురు. వాళ్ళ సంగతి మాకు తెలియును." అని చెప్పిరి. బాపూతో వ్యవహరించుటలో యీపద్ధతి మిక్కిలి చెడ్డదని ఆ ఆఫీసరులకు తెలియదు. వెంటనే బాపూ, వారిని మీరు దూరమునుండి ఎరుగుదురు. నేను వాళ్లతో రాత్రిం బగళ్లు ఉంటాను. స్వీయానుభవమువల్ల యీ మనుష్యులు నాకంటె చాల ఎక్కువ మంచివాళ్ళని చెప్పగలను. చెడ్డ వారు వారిలో నా కొక్కరూ కనబడలేదు." అని జవాబు చెప్పెను.

బహుశః పోలీసు కమీషనర్ అక్కడనే యుండి యుండవచ్చును. ఆయన, "మీ దగ్గర ఉన్న ఆచార్య కృప లానీ మాదగ్గరున్న రికార్డు ప్రకారము చాల చెడ్డవాడు. చాలా తుంటరి [mischief monger) కూడ. ప్రజలను రెచ్చ గొట్టే స్వభావముగలవాడు (agitator) కూడ." అని అనెను.

బాపూ నవ్వి, "ఆచార్యకృపలానీ నా దగ్గర ఏమి పని చేస్తారో మీకు తెలియునా? ఆయన శ్రీమతి గాంధీతో పాటు మా కందరకును వంటచేయుపనిలో మునిగియుండును. అక్కడ ఆయన చేయగల్గిన? తుంటరిపని ఏముంది" అని ప్రశ్నించెను.

పాపమా పోలీసు కమీషనరు బాపు ముఖము వంక చూస్తూ ఉండిపోయెను. బీహారు విద్యార్థులను రెచ్చగొట్టు యీ పెద్ద ప్రొఫెసరు గాంధీజీ దగ్గర వంటవాడుగా ఎట్లుం టున్నాడో ఆయనకు అర్థము కాలేదు.

అంతట బాపు "ఏదైనా ఒకరోజు వచ్చి చూడండి. పాపమాయనకు తల యెత్తుటకుకూడ సమయము దొరకదు." అని చెప్పెను.

దీని తర్వాత ప్రఖ్యాతి చెందిన బాపు బీహారు విచారణ ప్రారంభమయ్యెను. వేలకొలది రైతులు తమ దుఃఖ కథను వినిపించుటకు ఆయనవద్దకు రాసాగిరి. అప్పుడు కలెక్టరుకు ఏదో ఒక పని మీద ఉత్తరములు వ్రాయవలసి వచ్చెడిది. అప్పుడు ప్రతిసారి బాపు తన ఉత్తరములను

కలెక్టరు బంగళాకు కృపలానీ ద్వారా పంపెడివాడు. పాపమా తెల్లదొర యీ పెద్ద రాజద్రోహియగు కృపలానీ గాంధీ దగ్గర వంటపనితోపాటు బంట్రోతు పనినికూడ చేయుటచూచి ఆశ్చర్యపడుచుండెడివాడు.

## 34

ఒకప్పుడు బాపు మహారాష్ట్రములో పర్యటనచేయు చుండెను. మీరజ్‌లో ఆయనకు కొద్ది కార్యక్రమముండెను. అది పూర్తియైపోయినది. కాని ఆయన యింకా కొంత సేపుండాలని ప్రజలు కోరిరి. దానికి బాపు అంగీకరించ లేదు. వారు బ్రతిమాలినను బాపు తన పట్టు వీడక వారు భారతదేశములో సహజమగు సంస్కారహీన పద్ధతిలో తమ కోరికను నెరవేర్చుకొనగోరి, వేళకు మోటారు కారును రాకుండచేసిరి. బాపు సమయం మించి పోతున్నందుకు వ్యాకులుడయ్యెను. ప్రజలనడుగగా మోటారు పాడైనదని చెప్పిరి. దీనితో బాపు ధైర్యము సన్నగిల్లినది. "నేను యిప్పుడే ఈ క్షణమే ముందు మకామునకు బయలుదేరక తప్పదు. నేనిక్కడ ఉండ" నని చెప్పి ఆయన కాలినడకను దారిబట్టెను. కొద్దిమంది స్వయం సేవకులు ఆయనతోపాటు బయలుదేరిరి. వాళ్ళను బాపు ముందు మకామునకు దారి నడిగెను.

ఇంకా వారి అల్లరి పూర్తి కాలేదు. వారాయనకు తప్పు దారిని చూపించిరి.

ఆ రోజులలో బాపూ చెప్పులు తొడిగెడివాడు కాడు. గోఖ్లే మృతి తర్వాత ఒక సంవత్సరముపాటు చెప్పులు తొడగనని బాపూ వ్రతము పూనిన రోజులై యుండ వచ్చును.

ముందునకు దారి లేదని చూచిన తర్వాతకూడ బాపూ అదే దిక్కుగా పొలములో పోసాగెను. కాళ్ళలో ముళ్ళు గ్రుచ్చుకొన్నను ఆయన ఆగలేదు. అప్పుడు స్వయం సేవకులు సిగ్గుపడసాగిరి. వారికి చాలా దుఃఖము కలిగినది. అంతట క్షమాపణ కోరిరి. సరియైన దారిని చూపించిరి. ఒక రిద్దరిని పరుగెత్తించి మోటారుకారును ఏర్పాటు చేయుటకు తయారయిరి.

## 35

1927 నాటి మాట. నేను బాపుతోపాటు ఒరిస్సాలోని బాలసోర్ వెళ్ళాను. అక్కడనుండి 'భద్రక్' వెళ్ళవలసి యుండెను. భద్రక్‌లో ఒక సభ ఏర్పాటు చేయబడెను. అక్కడకు బాపు వెళ్లుటకు వీలు లేకుండెను. ఆయన, "మీరు వెళ్ళి సభకు నా సందేశమును వినిపింపుడు." అని నాకు చెప్పెను. నేను తయారై తిని. కాని నన్ను తీసికొని పోవుటకు ఎవ్వరును రాలేదు.

దాదాపు ఒక గంట కాలము గడచి యుండ వచ్చును. బాపు నన్నక్కడనే చూచెను. ఎందులకు వెళ్ళలేదని అడుగసాగెను. అందుకు నేను "నేను సిద్ధముగానే

కూర్చుంటిని. నన్నెవరైనా తీసికొని వెళ్ళవలెగదా?" అని
అంటిని. బాపూకు చాల కోపము వచ్చెను. "పని ఈ విధ
ముగా జరుగదు. సమయమైనంతనే మీరు బయలుదేర
వలసినది. మోటారు దొరకకపోతే ఏమయింది? కాలి
నడకను బయలుదేరాలి. వెళ్ళుటకు రెండు రోజులు పట్టినను
పట్టనివ్వండి. మన దృష్టి అక్కడకు చేరుటమీద కాదు.
సమయమునకు బయలుదేరుటమీద నుండవలెను" అని
అనెను.

నేను సిగ్గుపడిపోతిని. అదే క్షణము బయలుదేరితిని.
దారిలో కనబడిన వారిని 'భద్రక్' కు దారి ఏదని అడిగెడి
వాడను. దాదాపు ఒక మైలు కాలినడకను యీ విధముగా
పోతిని. అక్కడికి నా వెనుకనే నా మిత్రుడు హరికృష్ణ
మెహతాబ్ వచ్చి చేరెను. నేను కాలినడకను బయలుదేరిన
సంగతి ఆయనకు తెలిసెను. ఆయన దీనిని భరించజాలక
పోయెను. మోటారును ఏర్పాటు చేయుమని ఎవ్వరికో
ఆజ్ఞయిచ్చి తాను స్వయముగ కాలినడకను బయలుదేరెను.
మేమిద్దరము కలిసి కాలినడకను దాదాపు యింకొక మైలు
వెళ్లునప్పటికి వెనుకనుండి ఆయన మోటారు వచ్చినది.

భద్రక్ మేము చేరునప్పటికి సాయంకాలము
కావచ్చినది. సభ జరుగవలసిన చోట ప్రభుత్వోద్యోగుల
డేరాలు వేయబడియుండెను. వారు పన్నులు వసూలుచేయు
ప్రభుత్వ నౌకరులు. వారంటే ప్రజలకు ఎంతోభయము.
అందుకని అక్కడికి ఎవ్వరూ రాలేదు. చాల కష్టము మీద

మేము కొద్దిమందిని పిలిచి సమావేశపరచితిమి. వాళ్లు చుట్టు ప్రక్కల గ్రామముల నుండి వచ్చిన వాళ్ళు. వారికి నేను నిర్భయత్వమును గురించి చెప్పితిని. ప్రభుత్వోద్యోగులు మన నౌకరులే. వాళ్ళు మనలను చూచి భయపడవలెను. మనము వాళ్ళకు ఎందుకు భయపడాలి? మొదలైన మాటలనేకము నేను వారికి చెప్పితిని. వినిన ప్రజల మీద ఏమి ప్రభావము పడినదో భగవంతునికే తెలియును. కాని ఆ ఉద్యోగులకు నేనంటే తప్పక కోపము వచ్చియుండును.

మరునాడు బాపు కూడ భద్రకకు వచ్చెను. ఇక చెప్పవలసిన దేముంది? ప్రజలు వేల సంఖ్యలో కూడిరి. వరదలో చెత్తచెదార మెట్లు కొట్టుకొని పోవునో అట్లే ఆ ఉద్యోగులు కూడ కనిపించకుండ ఎక్కడికో పోయిరి.

## 36

1922లో మొట్టమొదటిసారి బాపు (భారత దేశములో) జైలుకు వెళ్ళెను. ఆయన యరవడా జైలులో ఉంచబడెను. హిందూ ముసల్మానులిద్దరికిని గాంధిజీ పట్ల అసాధారణమైన భక్తి యుండుట తెలిసికొని యరవడా జైలు సూపరెంటెండెంటు ఆయన దగ్గర పనిచేయుటకు ఆఫ్రికా దేశమునకు చెందిన ఒక సిద్దీ ఖైదీని నియమించెను. పాపమా ఖైదీ భారతదేశ భాషలలో దేనిని కూడ సరిగా ఎరుగడు. ఎక్కువగా పని సంజ్ఞలవల్లను, అతనికి వచ్చిన పందొమ్మిది ఇరవై హిందీ మాటల వల్లను జరిగిపోవుచుండెడిది. అట్టి సిద్దీ గాంధిజీ యెడల భక్తి చూపించదని, పశు

పాతముతో వ్యవహరించడని ఆ తెల్ల ఉద్యోగుల ఆశ. పాపమా ఉద్యోగులకు మానవ హృదయము సర్వత్ర ఒకే విధముగా నుండునని తెలియదు.

ఒక రోజున ఆ ఖైదీని తేలు కుట్టినది. పాపమాతడు ఏడుస్తూ, మొత్తుకుంటూ బాపు దగ్గరకు వచ్చెను. వచ్చి చేతిమీద తేలుకుట్టినదని చెప్పసాగెను.

ఎవరిదైనా దుఃఖము చూస్తే బాపు హృదయము కరగిపోవును. ఒక క్షణమైన ఆలస్యము చేయకుండా ఆయన ఆ మనిషి చేతిలోని ఆ భాగమును బాగుగా నీటితో కడిగి వేసెను. తుడిచి ఆరబెట్టెను. తర్వాత తేలు కుట్టిన చోటి నుండి విషమును పీల్చసాగెను. విషము తగ్గునంత గట్టిగా పీల్చెను. పాపమాతని బాధ తగ్గిపోయినది. దాని తర్వాత బాపు ఇంకా వైద్యము చేయగా అతనిస్థితి సరియైనది.

ఆ నిర్భాగ్యుడు తన జీవితములో యింత ప్రేమను ఎక్కడను చవిచూడలేదు. ప్రేమవల్ల అతడాయనకు దాసుడే అయ్యెను. బాపు చిన్న సంజ్ఞ అతనికి మహా శాసనము. ఆయన పనులన్నీ భక్తితో చేయసాగెను. గాంధీజీకి నూలు వడుకుట చాల ప్రియమని ఆతడు కనిపెట్టెను. ఆతడు తక్లీ (చేతి కదురు) పట్టుకొని యితరులెట్లు వడుకుదురో గమనించుచు స్వయముగా నూలు వడుకుటకారంభించెను. పిమ్మట రాట్నము మీద వడుకుటకూడ మొదలు పెట్టెను. తర్వాత తర్వాత ప్రత్తిని ఏకు కళనుకూడ నేర్చుకొని బాపు కొరకు

ఏకులను తయారుచేసి యియ్యసాగెను. తాననుకొన్న దానికి వ్యతిరేకంగా జరిగిందని సూపరింటెండెంటు తెలిసికొనెను. కాని ఏమి చేయగలడు ?

# 37

1930 నాటి సంగతి. అప్పుడు నేను బాపూతోకూడ యరవదాజైలులో నుంటిని. ఆయన వంటపని చేయుటకు జైలు సూపరింటెండెంటు మేజరు మార్టిన్ దత్తోబా అని పేరుగల ఒక మహారాష్ట్ర ఖైదీని నియమించెను. దత్తోబాకు పని ఆట్టే ఉండెడిది కాదు. బాపూ బట్టను ఉతికేవాడు. మేకపాలు వెచ్చబెట్టి ఉంచేవాడు. ఇంకా అట్టివే చిన్న పనులు చేసెడివాడు. పాపమాతనికి ఒక పాదములో ఏదో నొప్పి ఉండెను. అందుచేత కుంటుతూ, కుంటుతూ అన్ని పనులు చేసెడివాడు.

ఒక రోజున బాపు మేజరు మార్టిన్‌తో మాట్లాడెను. ఆయన ఏదో మందిచ్చెను. కాని కాలి నొప్పి పోలేదు. ఈ విధముగా దాదాపు ఒకనెల గడిచి పోయింది. బాపు, "ఈ మనిషికి నేను వైద్యము చేసిన మీకేమి అభ్యంతరము లేదుగదా ?" అని మేజరు మార్టిన్‌ను అడిగెను. ఎంత మాత్రము లేదని మేజరు జవాబు చెప్పెను. "నా వైద్యములో ఆహారమే ముఖ్యవిషయము. నా తరఫున యీతనికి ప్రత్యేకమైన ఆహారమిచ్చెదను." అని బాపు చెప్పెను. దీనికి కూడ మేజరు సరేననెను.

బాపు చికిత్స ప్రారంభమైనది. మొదట ఆతనిచే ఉపవాసము చేయించెను. ఎనిమా మొదలైన వాని వల్ల వాని కడుపును శుభ్రమొనరించెను. తర్వాత కొద్ది రోజులు కేవలము శాకముల మీదనే యుంచెను. తర్వాత అతని ఆహారములో అవసరమైనప్పుడు మార్పులు చేయుచు పోయెను. ఆ కుంటివానికి మంచి లాభము కలిగినది. అతను నాతో, "సంవత్సరముల నుండి ఈ నొప్పితో బాధపడు చున్నాను. ఇప్పుడు నా పాదము బాగైనది. నడుచుటలో కొద్దిగానైన కష్టము కలుగుటలేదు. నలుగురువలె నేను ఎట్లు నడువ గలుగుచున్నానని నాకే యిప్పుడు ఆశ్చర్యము కలుగుచున్నది." అని చెప్పెను.

బాపు విడుదలైన తర్వాత ఆతడు కూడ విడుదలయ్యెను. ఆతడు బొంబాయిలోని కులాబా ప్రాంతమున కాఫీహోటలు నొకదానిని పెట్టెను. ఒక రోజున బాపు బొంబాయి వచ్చినట్లు ఎక్కడో ఆతడు విని యుండవచ్చు. అప్పుడు బాపూను చూడవచ్చి సాష్టాంగ దండప్రణామ మొనర్చెను. ఆతని కన్నులు కృతజ్ఞతా భావముతో నిండిపోయినవి. "ఈ రోజున చాలపనిలో ఉన్నాను. రేపు తప్పక కలియుటకు రమ్మని యితనితో చెప్పు." అని బాపు నాతో అనెను. బాపు ఆతనిని మరల కలియ గోరుతున్నాడని, రేపు రమ్మని నేను దత్తోబాతో చెప్పితిని. ఆతడు తప్పక వచ్చెదననెను. కాని ఆ దరిద్రుడు మరునాడు రానే లేదు. దుకాణము నడుపుకొనుటకు ఆతనికి నూరురూపాయల

వరకు డబ్బు యిచ్చినచో ఆతడు సంతోషించునని బాపు ఉద్దేశము. ఆతడు తనపూర్తి విలాసమిచ్చియుండినచో నేను వెదకి తీసికొని వచ్చెడివాడను. విలాసము లేకుండ బొంబాయిలోని మానవ సాగరములో ఆతని నెక్కడ వెదకను ?

రెండవరోజు ఆతడు రానప్పుడు బాపూకు విచారము కలిగెను. "నిన్ననే ఏదో యిచ్చిఉంటే బాగుండెడిది. కష్టపడి జీవించు వానికి మాటిమాటికి వచ్చుటకు సమయ మెక్కడ దొరకగలదు ?" అని బాపు అనెను.

## 38

బహుశః 1915 నాటి మాట కావచ్చును. బాపు ఏదో వ్రాయుచుండెను. ఉమర్ ఖయ్యామ్ రచన 'రుబాయత్' (పద్యముల) ఇంగ్లీషు అనువాదమును నేనాయన దగ్గర కూర్చుండి చదువుచుంటిని. ఆ పద్యములకు ఫిట్జరాల్డ్ యొక్క ఆంగ్లేయానువాదపు ప్రశంసను నేను చాల విని యుంటిని. కాని వాటిని నేను చదువలేదు. ఈ నా అజ్ఞానాన్ని పోగొట్టుకొను దృష్టితో ఆ పుస్తకమును తీసికొని చాల ఆసక్తితో చదువసాగితిని. పుస్తకము దాదాపు పూర్తికావచ్చినది. కాని యింతలో బాపూదృష్టి నా వైపు మరలినది. "ఏమి చదువు చున్నారు ?" అని అడిగెను. నేను పుస్తకమును చూపించితిని.

మాది క్రొత్తపరిచయము. ప్రత్యక్షముగా నా కుప దేశము చేయుట బాపుకు ఇష్టము లేకుండెను. ఒక దీర్ఘ

నిశ్వాసము తీసికొని ఆయన, "నాకుకూడ యింగ్లీషు కవిత్వ మన్న చాల యిష్టముండెను. కాని యింగ్లీషు కవిత్వము చదువుటకు నాకేమి అధికారమున్నదని నేనాలోచించితిని. సంస్కృత జ్ఞానము నాకెంత ఉండవలెనో అంత లేదు. తీరుబడి సమయమున్నచో గుజరాతీ వ్రాయుటలో నాకున్నశక్తిని ఎందుకు వృద్ధిచేసి కొనరాదు? నేడు నేను దేశసేవ చేయవలసి యున్నచో నా కాలమంతయు నా సేవాశక్తిని పెంపొందించుట కుపయోగించ వలెను." అని చెప్పి కొంచెమాగి మరల, "దేశసేవ కొరకు నేను ఏదైనా త్యాగముచేసి యుండినచో అది యింగ్లీషు కవిత్వములో నాకున్న ఆసక్తినే. ధనమును, వకీలువృత్తిని త్యాగము చేయుట నేనొక త్యాగముక్రిందనే చూడను. వాటిపట్ల నాకు రుచిలేకుండెను. కాని యింగ్లీషు కవిత్వమన్న పూర్తిగా ఆసక్తి ఉండెను. దీనినికూడ వదలిపెట్ట వలెనని నేను నిశ్చయించుకొంటిని" అని చెప్పెను.

నేను అర్థము చేసికొన్నాను. అదే సమయమున నేను ఫిట్జరాల్డ్‌ను ఒకప్రక్కకు పెట్టివేసితిని.

బాపు యొక్క ఆ ఉపదేశమును నేను పూర్తిగ పాలించ లేకపోతిని. కాని ఫిట్జరాల్డ్‌ను మరల నెప్పుడు పూర్తిచేయలేదు. గుజరాతీ వ్రాయుటలోను మాట్లాడుటలోను శక్తివచ్చునంతవరకు నేను యింగ్లీషు పుస్తకము దేనిని చదువలేదని స్థూలముగ చెప్పగలను. గుజరాతీ నేర్చుకొనుటకు నేను ప్రయత్నించ నక్కరలేక పోయినది.

గుజరాతీ వాతావరణములో నుండుటవల్ల, గాంధీజీ వ్యాసములు చదువుట వల్లనే అది నాకు రాసాగినది. నేను గుజరాతీ వ్రాయుటకు మొదలు పెట్టినప్పుడు ఏదైనా గుజరాతీ శబ్దము దొరకనప్పుడు సులభమైన సంస్కృత శబ్దమును ఆ స్థానమున నుపయోగించెడి వాడను. తత్ఫలితముగ నా గుజరాతీశైలి సులభమగుచునే సంస్కృత శబ్దములవల్ల ప్రౌఢమైనది. పండిత పామరులమధ్య నేనట్టి శైలితోనే ప్రవేశించితిని. బాపు సూచన ఫలితముగ నేనెంతప్రేమతో, ఇంగ్లీషు శబ్దముల మూలార్థముల కొరకు ఉపయోగ విశేషముల కొరకు వెదకులాడు చుండెడివాడనో అదే ప్రేమతో పట్టుదలతో గుజరాతీభాష విషయమై కృషిచేయ సాగితిని.

## 39

నేను ఆశ్రమమునకు వెళ్ళినప్పుడు నాకు గుజరాతీ రాదు. హిందీ రాదు. రెండుభాషలను నేను వినియుంటిని. కాని వాటిని మాట్లాడుటలో గాని వ్రాయుటలో గాని నాకు కొంచెమైన అభ్యాసము లేదు. నాకుమాత్రము హిందీవచ్చిన వారెవ్వరు అక్కడ లేనందువల్ల చదువు చెప్పవలసి వచ్చినప్పుడు నేను హిందీలో చెప్పేవాడను. అప్పటికిని నేను సురక్షితస్థానములో లేనని నాకు తెలియుట వల్ల కొంచెము ధైర్యము రావటము తోడనే నేను గుజరాతీలోనే మాట్లాడుట మొదలుపెట్టితిని, తర్వాత "నవజీవన్" పత్రికలో ఒక కాలమో లేక రెండు కాలములో నింపవలసి వచ్చినప్పుడు స్వామి ఆనంద్ నా చేత ఏదో

వ్రాయించి, సరిచేయించి, అచ్చు వేసెడివాడు. కాని 1922లో బాపు జైలుకు వెళ్ళినపుడు 'నవజీవన్'ను పూర్తిగ నేను వ్రాయవలసి వచ్చెడిది.

నేను 'నవ జీవన్'ను బాగుగా నడుపు చున్నానని జైలులో బాపు వినియుండవచ్చును. అందుచేత ఆయన దగ్గరనుండి నాకీ ఉత్తరము వచ్చినది. "ఏ విధముగ ఇంగ్లీషు భాషలో ఆ భాషాశబ్దముల వర్ణక్రమము నిశ్చితమైనదో, అదే విధముగా గుజరాతీలో లేదు. మరాఠీ, బంగాలీ, తమిళము, ఉర్దూ మొదలైన భాషలలో కూడ శుద్ధవర్ణక్రమము విషయమై గల పట్టుదలను నేను చూస్తున్నాను. కాని ఎవరి మనస్సునకు తోచినట్లు వారు శబ్దముల వర్ణక్రమము వ్రాయుభాష గుజరాతీ యొక్కటియే. అందుచేత గుజరాతీ భాష ఒక భూతమువలె నైపోయినది. (శరీరము లేనందున భూతము గాలిలో తిరుగాడుచుండును.) దాని దుర్దశను పోగొట్టు పని మీది కాకపోతే మరెవ్వరిది? గుజరాతీ భాషలోనున్న శబ్దములన్నీ ఉన్నట్టి, అందులోని ప్రతిశబ్దము యొక్క వర్ణక్రమము నియమాను సారము శుద్ధముగా నున్నట్టి నిఘంటువు నొకదానిని నాకు తయారు చేసి యియ్యండి. ఎవరికైనా సందేహము కలిగిన మీ కోశమును చూచి సరియైన వర్ణక్రమము వ్రాయగలరు. ఇంగ్లీషులో మనమట్లే చేయుచుముగదా?" అని దానిలో వ్రాసెను.

బాపు వ్రాసిన యీ ఉత్తరమునుచూచి నేనాశ్చర్య చకితుడనై పోయాను. తర్వాత నన్నుకూడ జైలుకు తీసి కొని పోయిరి. నేను విడుదలైన కొద్దిరోజుల తర్వాత బాపు కూడ విడుదల అయ్యేను. ఆయనను కలిసినప్పుడు నేను "బాపూజీ! మీరు యీ పనిని నేనెట్లు చేయగలననుకున్నారు. ?. గుజరాతీ నా మాతృభాష కాదు. దీనిలోని సాహిత్యమును నేను చదువలేదు. దాని వ్యాకరణమును నేను ఎరుగనే ఎరుగను" అని అంటిని.

దానికి బాపూ, "అదంతా సరే. ఈ పనంతా మీరొక్కరే చేయవలెనని నేను ఎప్పుడన్నాను? ఎవరి సహాయమవసరమైతే దానిని తీసికొనండి. ఎవరిచేత యీ పనిని చేయించగలరో వారిచేత చేయించండి. నేను యీ పనిని మీ కప్పగించితిని. దానివిషయమై మిమ్మే అడిగెదను. నిర్దోషమైన యీ నిఘంటువు నిచ్చి గుజరాతీభాషలోని శబ్దములకు వ్యవస్థితమైన వర్ణక్రమమును ఏర్పాటుచేయండి. ఈ పనిమీది". అని చెప్పెను.

నేను శిరసావహించితిని. సన్యాసికి పెండ్లిచేయవలెనన్న జుట్టు దగ్గరనుండి ఎరువు తీసికొని రావలసివచ్చునన్న సంగతిని నేను ఎరుగుదును. నేను గుజరాతీ వ్యాకరణమును తీసికొని కూర్చుంటిని. గతించిన నలభై ఏండ్లనుండి వర్ణక్రమము విషయమై జరిగిన చర్చనంతను ప్రోగుచేసితిని. మహాదేవభాయి, నరహరిభాయి, నేను సభ్యులుగ కమిటీ నొకదానిని ఏర్పాటుచేసితిని. చివరకు అనేకమంది మిత్రుల

సహాయముతో అయిదుసంవత్సరములు కష్టపడినతర్వాత బాపూకు శుద్ధమైన ఒక "జూడణీకోశ్" (వర్ణక్రమ కోశము) సమర్పించితిని. నవజీవన్‌లో దానినిగురించి, "ఇప్పుడు గుజరాతీలో ఎవరికితోచినట్లు వారు శబ్దముల వర్ణక్రమము వ్రాయుటకు వారికి అధికారములేదు." అని ఆయన వ్రాసెను.

ఆయన సంకల్ప ప్రభావమువల్ల నేడు అదే "జోడిణీకోశ్" గుజరాతంతటను ప్రామాణికముగా అంగీకరించబడుచున్నది. బొంబాయి ప్రభుత్వపు విద్యాశాఖ, బొంబాయి విశ్వవిద్యాలయము, గుజరాత్‌లోని కాఠియవాడ్‌లోని దేశీయరాజ్యములు - అందరూ దానిని ప్రమాణగ్రంథముగా అంగీకరించిరి. తుదకు క్రాస్‌వర్డ్ పజిల్‌లోవచ్చు జగడములనన్నింటిని మా 'జోడిణీకోశ్' దూరముచేయుచున్నది.

## 40

బాపూ దక్షిణాఫ్రికాను వదలి భారతదేశము తిరిగి వచ్చునప్పుడు ఆదేశమునుండి ఒక గవ్వనైనా వెంట తీసికొని రాకూడదని ఆలోచించెను. ఇంగ్లీషువారు భారతదేశములో వారు సంపాదించిన ధనమంతా ఇంగ్లాండునకు తీసికొనిపోవునప్పుడు మనకెంతకష్టమనిపించును? దానిని మనము అన్యాయమని దోపిడియని అందుము. అటువంటప్పుడు దక్షిణాఫ్రికా ధనమును భారతదేశమునకు తీసికొనిపోవుటకు మనకేమి అధికారముగలదు?

ఇట్టి యోచనతోనే దక్షిణాఫ్రికాలో తాను సంపాదించినదంతా ట్రస్టు (ధర్మనిధి) చేసి అది ప్రజాహిత కార్యములకు ఉపయోగపడునట్లు ఏర్పాటు చేసెను. అక్కడి నుండి బయలుదేరు సమయమున తనకు లభించిన సన్మాన పత్రములను బహుమతిగా వచ్చిన పుస్తకములను వెంట తీసికొనెను. సత్యాగ్రహ ఆశ్రమస్థాపన జరిగినప్పుడు ఆ పుస్తకములన్నింటిని దానికిచ్చివేసెను. ఆశ్రమమును తీసివేసినప్పుడు వాటిని అహమ్మదాబాదు మునిసిపాలిటీకి యిచ్చివేసెను. దాదాపు 20 వేల పుస్తకములుండి యుండవచ్చును. పాపమా సన్మానపత్రములు యిక్కడ అక్కడ పడిఉండి పాడైపోయినవి.

భారతదేశము వచ్చినతర్వాత బాపూకు ఆయన పిత్రార్జితసంపత్తి (తండ్రి తాతల ఆస్తి) విషయమైన సమస్య ఎదురైనది. పోరుబందరులోను రాజకోటలోను వారికి యిండ్లున్నవి. అందులో అన్నింటిలో గాంధీ కుటుంబము వారు నివసించుచుండిరి. బాపూ ఆ బంధువులనందరిని పిలిపించి, పిత్రార్జితసంపత్తిలో నాకున్న భాగమును మీ పేర వ్రాసెదను.” అని చెప్పి అట్లు వ్రాసిన దస్తావేజుమీద దీనితో మేము నలుగురము మా అధికారమునుకూడ వదలుకొంటున్నామని వ్రాయించి తన నలుగురు కుమారుల చేతకూడ సంతకములు చేయించెను.

ఈ విధముగా బాపు తనతోపాటు తన కుమారులను కూడ ఆస్తిమోహమునుండి తప్పించి వేసెను.

# 41

1927 నాటిమాట. ఖాదీపనికొరకు చందాలు వసూలుచేయుటకు దక్షిణాదిన రాజాజీ బాపు పర్యటనను ఏర్పాటుచేసెను. ఈ సందర్భములోనే మేము సింహళ యాత్రకూడ చేసివచ్చితిమి. సింహళములో బాపుచేత చాల ప్రభావ వంతమైన ఉపన్యాసములియ్యబడెను. ఒక దినము, బహుశః జాఫ్నాలోనై యుండవచ్చును. బాపు బుద్ధభగవానుని కృపినిగురించి మాట్లాడుచుండెను. బుద్ధ భగవానునినాటి పరిస్థితులెట్లుండినవో, తన జీవిత ధ్యేయము నాతడెట్టి సందర్భములో గుర్తించెనో, దానినిగురించి చర్చించుచుండెను. ఆ సందర్భములో తాను చెప్పుదానిలో బాపు ఎంత లీనమైపోయెననగా ఒకస్థానమున బుద్ధునిగురించి, Thenhe saw (అప్పుడాయన చూచెను) అని చెప్పుటకు బదులు, Then I saw (అప్పుడు నేను చూచితిని.) అను మాటలు ఆయన నోటినుండి బయలువెడలినవి. ఈ పొరపాటు ఆయన దృష్టిలోనికి వచ్చెనో లేదో తెలియదు. ఉపన్యాసము చాల ప్రభావవంతముగనుండెను.

రాత్రి బాపూ ఉపన్యాసమునుగురించి మహాదేవ భాయి, నేను, రాజాజీ చర్చించుచుంటిమి. అప్పుడు నేను, "నేటి ఉపన్యాసములో Star of The Eastకు చెందిన జిడ్డు కృష్ణమూర్తివలె బాపూ మాట్లాడెను." అని నేననగనే వెంటనే రాజాజీ Did you also mark that Kaka ? (కాకా! నీవుకూడ దానిని గుర్తించితివా?) అని అనెను.

అంతట నేను. "ఉపన్యాసములో బాపు బుద్ధభగవానునితో ఎంతతాదాత్మ్యమైపోయినాడంటే ప్రథమ పురుష సర్వనామము దానంతటదే ఆయననోటినుండి వెలువడినది. దీనికేదో గూఢార్థము లాగనవసరము లేదు. బుద్ధభగవానుడు తన కాలములో చేసిన పనినే నేటిపరిస్థితుల ననుసరించి బాపూ చేయుచుండెను." అని నేనంటిని.

"బాపూ తనను బుద్ధభగవానుని అవతారముగ నెంచుకొనసాగినచో దానిలో నాకపాయము కనబడు చున్నది. ఆయన తనను బుద్ధభగవానుని అవతారముగ భావించుకొనగలడని నేననుకొనను. ఒకవేళ అనుకొన్నచో అది స్పష్టముగా చెప్పానంత సత్యనిష్ఠ ఆయనలోగలదు. బాపూ ఎప్పుడో హిందూమతములోని సంకుచిత భావములనుండి పైకి పోయెను. కాని దానితో ఆయన తన సంబంధము తెంచుకొనలేదు. చివరివరకు ఆయన సామాన్య హిందువుగనే ఉండి ప్రపంచసేవ చేయగలడు. రూఢమైన హిందూ ధర్మమును ఆయన తన ఆదర్శమైన, ఉజ్వల హిందూ ధర్మముగ రూపొందించగలడు" అని చెప్పితిని.

## 42

రౌలట్ చట్టమునకు విరుద్ధముగ ఆందోళన ప్రారంభించిన బాపూ తీవ్రముగా జబ్బుపడిన సంగతి యిదివరకే చెప్పితిని. ఆ జబ్బులో ఒక భయంకర రాత్రి తర్వాత ఉదయం బాపూ మమ్ములనందరను పిలిచి భారత దేశము

నకు అహింసా సందేశమును తెల్పమన్న సంగతినికూడ చెప్పితిని. దాని తర్వాత సాయంకాలము ప్రార్థనలో మా సంగీతాచార్యుడు నారాయణరావు ఖరే.

గురుబిన కౌన్ బతావే బాట్

బడా వికట యమఘాట్-గురుబిన.

అను కీర్తనను మొదలుపెట్టెను.

అట్టి సందర్భములో ఈ కీర్తనను పాడుటకు ఎన్నుకొనవలసినది కాదనిపించెను నాకు. తాను మృత్యువునకు దగ్గర పడితినని బాపూ అనుకొనుచుండెను. అట్టి సమయములో మీకు గురువు దొరకలేదు. యమయాతనను మీరెట్లు దాటగలరనునట్టి కీర్తనవల్ల బాపూ మనస్సులోని చింత తప్పక వృద్ధి కాగలదు.

అనసూయా బహన్‌కుకూడా ఈ కీర్తన బాగనిపించలేదు. అందులకు ఆమె కారణము వేరే ఉండెను.

ఏదైనను బాపూ ఎల్లప్పుడు గురువుకొరకు వెదకుచున్నాడన్న విషయమై మాలో చర్చ అధికమైనది. గోఖ్లే బాపూ గురువుగా ఉండెను. కాని అది రాజకీయ క్షేత్రము వరకు మాత్రమే. ఈ విషయం బాపూయే అనేకమారులు స్వయముగా చెప్పియుండుట చేతనే మేమా సంగతిని అంగీకరింతుము. నేడు మనము పరిశీలించి చూచినచో బాపూ గోఖ్లెల రాజకీయముల మధ్య సామ్యమేమీ కనిపించదు. బాపూ గోఖ్లెను కలిసినప్పుడు ఆయనది వీరపూజ చేసెడి

వయస్సు అని నేను ఒప్పుకొందును. ఆయనకు పూజించుటకు ఒక వీరుడు కావలసియుండెను. గోఖ్లే ఆయనపట్ల అసాధారణ సానుభూతిని చూపించెను. ఆయనను గౌరవించెను. అందుచేతనే గోఖె రాజకీయములలో ఆయన తన ఆదర్శము లన్నింటిని చూచెను. ఏది యెట్లయినను గోఖలే బాపూకు ఆధ్యాత్మిక గురువు మాత్రము కాడు.

శ్రీమద్ రాజచంద్ర (బొంబాయిలోని నగల వర్తకుడు శతావధాని) ధర్మనిష్ఠను, ఆత్మసాక్షాత్కారమునకు గల తహతహను చూచి బాపు ఆయనను అనేక ప్రశ్నలడిగి సమాధానములను కూడ పొందెను. అప్పటినుండి ఆయన శిష్యులు రాజచంద్ర గాంధీజీ గురువని తరచు చెప్పుచుండెడివారు.

కొంతవరకు బాపు ఈ మాటనుకూడ అంగీకరించెను. కాని ఈ విషయమై చర్చ అధికముకాగా బాపు రాజచంద్రుని తాను ముముక్షువుగా తప్పక అంగీకరింతునని, అయితే భగవత్సాక్షాత్కారము పొందిన పురుషునిగ అంగీకరింపజాలనని ప్రకటింపవలసి వచ్చెను.

ఏదో ఒక సమయమున తన వ్యాస మొకదానిలో, "నేను గురువు కొరకు వెదకుచున్నాను. ఎందువల్లననగా గురువువల్లనే మనుష్యుని ఉద్ధరణ జరుగును". అని వ్రాసెను. సరి. ఇంత మాత్రము వ్రాయుట చాలు. ఆయన వద్దకు వందలకొలది ఉత్తరములు రాదొడగినవి. "ఫలాని

సలములో ఒక గొప్ప మహాత్ముడున్నాడు. ఆయన గొప్ప యోగి. ఆయనకు సిద్ధులన్నీ ఉన్నవి. మీరు ఆయనవద్దకు వెళ్ళి ఉపదేశము పొందండి" అని ఒకరెవరో వ్రాసిరి. మరొకరు వేరొక సత్పురుషుని సిఫారసు చేసిరి. బాపు గురువగుటకు తన్ను తానెవ్వరైనా సిఫారసు చేసికొన్నారేమో నాకు తెలియదు. కాని బాపు ఉద్ధరణకొరకు లోకులనేక మార్గములు చూపించిరి. చివరకు, "ఏ గురువు కొరకు నేను వెదకుచున్నానో ఆ గురువు స్వయముగా భగవంతుడే. భగవానుడే నా గురువు కాగలడు. ఏలనన ఆయనను పొందినపిమ్మట యింక ఏ సాధన అవసరమే ఉండదు. ఈ నాజీవితమంతా ఈ నా కార్యకలాపములన్నీ ఆ గురువును వెదకుట కొరకే." అని బాపు ప్రకటింప వలసి వచ్చినది.

ఆశ్రమ వాసులమైన మేమంతా గాంధీజీని ఏ విధముగా బాపు అని పిలిచెడివారమో అదే విధముగా శాంతి నికేతన్‌లోని వారు రవిబాబును గురుదేవుడనెడివారు. ఒక వ్యక్తి ఏ పేరుతో ప్రసిద్ధుడో అతని కాపేరునే స్వీకరించుట గాంధీజీ స్వభావము లేక ఆచారము. రవిబాబు ప్రసక్తి వచ్చినప్పుడెల్ల బాపు ఆయనను గురుదేవుడని పేర్కొనసాగెను. తిలక్ విషయము తీసికొనుడు. బాపు మొదట ఆయనను తిలక్ మహారాజ్ అనెడివాడు. కాని మహారాష్ట్రములోని వారు ఆయనను లోకమాన్యుడనుటవల్ల

తాను కూడ లోకమాన్యు డనసాగెను. మిస్టర్ జిన్నా విషయములో కూడ యిదే జరిగినది. జిన్నా అనుచరులు ఆయనను 'కాయిదే ఆజమ్' (గొప్ప నాయకుడు) అనెదరు. బాపుకూడ ఆయన ప్రసక్తి వచ్చినప్పుడు అదే పేరు నుప యోగించసాగెను. శ్రీ వల్లభభాయి పటేలును గుజరాతీ కార్యకర్తయగు శ్రీమణిలాల్ కొఠారీ సర్దారని పిలువ మొదలు పెట్టెను. ప్రజలుకూడ ఆయనను సర్దారని పిలువ సాగిరి. ఈ మాట వినినప్పటినుండి బాపుకూడ అదే పేరు నుపయోగింపసాగెను.

ఈ పెద్దవారల మాట వదలిపెట్టండి. నేను నా కుటుంబములోను, విద్యార్థులలోను, మిత్ర మండలిలోను కాకాయను పేరుతో ప్రసిద్ధి కెక్కితిని. అది ఎంతవరకు పోయినదన, ఎక్కడైన దత్తాత్రేయ బాలకృష్ణ కాలేల్కర్ అని నా పేరు పూర్తిగ వ్రాయబడినచో, ఆ దత్తాత్రేయ బాలకృష్ణ ఏమైనా మీ చుట్టమా అని ప్రజలు నన్నడి గెదరు. సరి, దీనిమీదట బాపుకూడ నన్ను కాకాయనే పిలువసాగెను. తన ఉత్తరములలోకూడా చిరంజీవి కాకా యని మొదలుపెట్టి బాపు ఆశీర్వాదము అని ముగించును. కాకాయనునది ఇంకొక పేరైనది. ఆ శబ్దమునకు విశేషా ర్థమేమీ లేదు. ఇదే విధముగా రథీబాబు (రవిబాబు కుమా రుడు) శ్రీ విధుశేఖరశాస్త్రిగారికి వ్రాయునప్పుడు రవిబాబు ప్రసక్తి వచ్చినచో గురుదేవుడనే మాటనే ఉపయోగిం చును. ఎందుకనిన అక్కడివారికి ఆ పేరే ప్రియమైనది.

ఎక్కువ తెలియనివారు గాంధీజీ గురుదేవుని తన గురువుగా ఎంచుకొనుచున్నాడని అనుకొనసాగిరి.

ఈ సందర్భములోనే ఒక చిన్న సంఘటనను వ్రాసెదను. 1914 లో నేను శాంతినికేతన్ వెళ్ళినప్పుడు ముందు గురుదేవుని కలిసితిని. అప్పుడు ఆయనతో నేను "మీ గీతాంజలి మొదలైన ఇంగ్లీషు గ్రంథములు చదివినాను. ఇప్పుడు మీ ఆధ్యాత్మికానుభవములు కొన్నింటిని తెలిసికొనగోరెదను." అంటిని. నేను విశేషముగ ప్రశ్నలడుగుటకు పూర్వమే ఆయన "లోకులు నన్ను గురుదేవుడని పిలిచెడుమాట నిజమే. కాని గురువులయందు నాకు విశ్వాసములేదు. ఎవరైనా ఒకరు ఇంకొకరికి గురువుకాగలడని, ఒకరు యింకొకరికి మార్గము చూపించగలరని నేనంగీకరించను. ఆధ్యాత్మిక సాధనాక్షేత్రములో ప్రతివానికి తన లక్ష్యమువైపు తీసికొనిపోవు మార్గమునుకూడ తనకు తానే సిద్ధముచేసికొనవలెను. ఆధ్యాత్మ ప్రపంచము దారి డొంక లేని మహాసముద్రమువంటి (unchartered sea) క్షేత్రముగానే ఉండిపోయెను. నా కవిత్వముద్వారానే నా సాధనామార్గము నాకు దొరికినది. 'సత్యమ్ జ్ఞానమ్ అనన్తమ్ బ్రహ్మ' అని నేనన్నప్పుడు నాకు యీ విశ్వమంతా సత్యరూపముగానే కనిపించును. ఈ విశ్వమును తిరస్కరించలేక దీనిని లేదనిచెప్పు మాయావాదము నావద్ద లేదు." అని చెప్పసాగెను. ఇదేవిధముగా ఆయన అనేక సంగతులు

చెప్పెను. ఆ ప్రవచనము పూర్తిపాఠము నిచ్చుటకు యిది స్థలముకాదు. నేను చెప్పగోరునది యింతమాత్రమే. గురుదేవుడని ఎల్లప్పుడు తనవారందరిచే పిలువబడెడి ఆయనయే గురువను వస్తువు దేనిని అంగీకరించెడివాడు కాడు.

## 43

1921 లో బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ (A. I. C. C.) లోకమాన్య తిలక్ స్మారక నిధిగా ఒక కోటిరూపాయలు సమకూర్చవలెనని నిర్ణయించినది. దానికొరకే ధనము ప్రోగుచేయు ప్రయత్నము నడుచుచుండెను.

ఒకరోజున శ్రీ శంకరలాల్ బేంకరువచ్చి, "మా ప్రాంతము (బొంబాయి)లోనున్న ముఖ్యనాటక కంపెనీలన్నీ కలిసి వారిలోని శ్రేష్ఠులైన నటులద్వారా ఏదైనా ఒక మంచి నాటకము నాడెదరు. ఆరోజున బాపూ థియేటర్‌లో (నాటకశాలలో) కూర్చుండినచో వారు ఆ నాటకమువల్ల వచ్చు ధనమునంతా తిలక్ స్వరాజ్యనిధికి యిచ్చుటకు సిద్ధముగనున్నారు" అని చెప్పి మరల, "వేలకొలది ధనమునకు సంబంధించిన విషయముకాదిది. లక్షలకు సంబంధించినది. ఏలనన టిక్కెట్లు యిష్టమువచ్చిన పెద్దధరలకు విక్రయించెదరు." అని చెప్పెను. బాపూ ఒకక్షణమైన ఆలస్యముచేయకుండ, "ఇది జరుగజాలదు. నటనయే వృత్తిగాగల వారి నాటకములను జూచుటకు నే నెన్నడును

వెళ్ళను. నాకు కోట్లకొలది రూపాయలిచ్చినను నియమ భంగము చేయజాలను.” అని చెప్పెను.

శంకరలాల్‌జీ ప్రతిపాదన అట్లే ఉండిపోయినది.

## 44

1921 నాటిమాట. అహమ్మదాబాదులో గుజరాతీ విద్యాపీఠము స్థాపన జరిగినది. దీనితో నాకెక్కువ సంబంధముండెను. ఆ రోజులలో నేను రాత్రి పగలు భూతము వలె పనిచేసెడివాడను. ఒకరోజు విద్యాపీఠమునకు నియమము లేర్పరచు మండలిసభ ఉండెను. దానికి మిష్టర్ ఆండ్రూస్‌కూడ వచ్చియుండెను. “విద్యాపీఠములో హరిజనులకు ప్రవేశము దొరకునుకదా?” అని ఆయన ప్రశ్నించెను. నేను వెంటనే “ఆ! తప్పక దొరకును” అని జవాబిచ్చితిని. కాని నియమముల నేర్పరచు మా మండలిలో అస్పృశ్యతను దూరముచేయుటకు సిద్ధముగాని సభ్యులుకూడ నుండిరి. మా అనుబంధ సంస్థలలో ఒక మోడల్ స్కూలుండెను. దాని సంచాలకుడు యీ సంస్కరణమునకు సిద్ధముగా లేకుండెను. ఇంకా యితరులు కూడ తమ కష్టములను బయటపెట్టసాగిరి. ఆ రోజున యీ ప్రశ్నవిషయమైనిర్ణయము జరుగకుండనుండి పోయెను. ఈ విషయమై బాపూజీని అడుగవలెననిమాత్రము నిశ్చయింపబడినది. నేను నిశ్చింతుడుగనుంటిని. చివరకు బాపూజీ నడుగుట జరిగినది. ఆయనకూడ నేనిచ్చిన జవాబునే యిచ్చెను.

ఈ విషయమైన చర్చ గుజరాతంతట వ్యాపించినది. బొంబాయికి చెందిన ధనికులైన వైష్ణవులు బాపూ దగ్గరకు వచ్చి, "జాతీయవిద్యాకార్యము చాల గొప్ప ధర్మ కార్యము. దానికొరకు మీరడిగినంత ధనమియ్యగలము. కాని హరిజనుల ప్రశ్నను మీరు వదలిపెట్టండి. అది మా కర్థము కావటము లేదు". అని చెప్పిరి. ఈ వైష్ణవులు దాదాపు ఆరేడులక్షల ధనమునిచ్చు ఉద్దేశముతో వచ్చి యుండిరి. కాని బాపు వారితో "విద్యాపీఠనిధి విషయము మాట అటుంచుడు. రేపు ఎవ్వరైనను అస్పృశ్యతనష్టే పాటించు షరతుమీద భారత దేశమునకు స్వరాజ్యమిచ్చి నను నేను దాని కంగీకరించను." అని చెప్పెను.

# 45

ఆశ్రమమును ప్రారంభించిన మొదటిరోజులలో దాని చుట్టుప్రక్కల నెక్కడ మాకు మంచిపాలు దొరకెడివి కావు. అందుచేత మేము మా ఏర్పాట్లను చేసికొంటిమి. మంచి మంచి ఆవులను గేదెలను ఉంచుకొంటిమి.

కొన్నిరోజుల తర్వాత బాపూ, "మనము గోరక్షణ చేయవలెను. గేదెలనుంచుకొని మనము ఆవులను రక్షింప జాలము. రెండింటికి ఆశ్రయమిచ్చి మనము రెండింటిని నాశనము చేయుచున్నాము. గోవునకు అన్నిటికంటె పెద్ద పోటీదారు గేదె. ఎద్దు తన సేవవల్ల చావునుండి తప్పించు కొనును. గేదె ఎక్కువ పాలిచ్చుటచేత బ్రతుకగలదు. ఇక ఆవు గేదెదూడల విషయము విచారింతము. ఆవులు పెద్ద

వైనపిమ్మట చంపబడుచుండును. కాని గేదెదూడలు చిన్నతనములోనే చంపబడుచుండును". అని మాకు నచ్చచెప్పెను. దీని ఫలితంగా ఆశ్రమమునుండి గేదెలన్నీ తొలగింపబడినవి. కేవలము గోశాలమాత్రముండెను.

ఒకరోజున ఒక ఆవుదూడ జబ్బుపడెను. దీనిబాగు కొరకు వీలైన సకలప్రయత్నములను మేము చేసితిమి. పల్లెప్రాంతమునుండి పశువైద్యము తెలిసినవారు వచ్చిరి. వెటర్నరీ డాక్టర్లు వచ్చిరి. చేయగలిగినదంతా చేసితిమి కాని దూడ బాగుపడలేదు.

దూడపడు యమయాతనను చూచి బాపూ, "ఈ మూగజంతువును యీ విధముగ బాధపడనిచ్చుట ఘాతుక కృత్యము. మృత్యువువల్ల కలుగు విశ్రాంతిని దీనిని పొందనీయవలెను". అని సూచనగావించెను.

దీనిమీదట చాలా చర్చజరిగినది. శ్రీ వల్లభభాయి అహమ్మదాబాదునుండి వచ్చెను. వచ్చి, "దూడ రెండు మూడు రోజులలో దానంతటదే మరణించగలదు. కాని అంతకుముందే దానిని మీరు చంపినచో అనవసరముగ పెద్ద జగడము తెచ్చిపెట్టుకొనగలరు. దేశమంతటా హిందూ సమాజములో గోలపుట్టును. ఇప్పుడే ఫండును (నిధిని) సేకరించుటకై బొంబాయి వెళ్లుచున్నాము. అక్కడ మీకెవ్వరూ ఒక గవ్వనైనా యియ్యరు. మన పనులలో చాలభాగము ఆగిపోగలవు." అని చెప్పసాగెను.

బాపూ ఆయన చెప్పినదంతా ధ్యానపూర్వకముగ వినెను. అంతట తన యిబ్బందిని బైటపెట్టుచు, "మీరు చెప్పినదంతా సరే. కాని దూడబాధ చూస్తూ మనమూర కెట్లు కూర్చుండగలము? దానికి చేయగలిగిన అంతిమసేవ చేయకున్నచో మనము ధర్మము తప్పిన వారమగుదుము." అని చెప్పెను.

అటువంటి విషయములలో వల్లభభాయి బాపూతో ఎన్నడు వాద వివాదములకు దిగెడివాడు కాడు. ఆయన మాట్లాడకుండ వెళ్ళిపోయెను. అంతట బాపూ ఆశ్రమ వాసులమగు మమ్ములనందరిని పిలిపించెను. మా అభిప్రాయములను తెలిసికొనెను. నేను, "మీరు చేయుచున్నది సరియైనదే. నా అభిప్రాయమును తెల్పవలెనన్న నేను ఒకసారి గోశాలకుపోయి దూడను చూడవలెను. అప్పుడే నా అభిప్రాయము నీయగలను". అని అంటిని. నేను గోశాలలోనికి పోతిని. దూడ ఒళ్లు తెలియకుండ పడియుండెను. నేను ఏదీ నిర్ణయించుకొనలేకపోతిని. అందుచేత అక్కడ కొంతసేపాగితిని. అంతట వేవేగముగ దూడ కాళ్లు కొట్టుకొనుచుండుటచూచి నేను బాపూ దగ్గరకు వెళ్ళి, "నేను మీతో పూర్తిగ ఏకీభవించుచున్నాను." అని చెప్పితిని. బాపూ ఎవరికో ఉత్తరమువ్రాసి తుపాకులు కాల్చు వారిని పిలిపించెను. వచ్చినవాళ్ళు, "తుపాకుల కాల్చుటనవసరము. ఒకటిచ్చినంతనే ప్రాణిని శాశ్వత నిద్రకు గురిచేయగల ఇంజక్షనులు డాక్టర్ల దగ్గర ఉండు"నని

చెప్పిరి. దానిమీదట ఒక పార్శీడాక్టరును పిలిపించిరి. ఆయన మరణవేదన పడుచున్న ఆ దూడకు మరణమును ప్రసాదించెను.

దీని మీదట దేశమంతటా బ్రహ్మాండమైన గోల పుట్టినది. బాపూకు ఎన్నో వ్యాసములు వ్రాయవలసి వచ్చినది. హిందూ సమాజమంతా కూకటి వ్రేళ్ళతో కదిలిపోయినది. తన యనన్య ధర్మనిష్ఠవల్ల, గోభక్తివల్ల బాపు యీ ఆందోళననుండి బైటపడెను.

## 46

పంజాబు దురంతములు, ఖిలాఫతు సమస్య స్వరాజ్య ప్రాప్తి యీ మూడు విషయములను తీసికొని బాపు దేశ వ్యాప్తమైన ఒక మహోద్యమమును మొదలుపెట్టెను. హిందూ ముసల్మానులేకమైన యీ ఆందోళన భారత దేశ చరిత్రలో బహుశః అపూర్వమైనది. ఈ అద్భుత దృశ్యమును చూచి యింగ్లీషువారు కలత చెందిరి. గాంధీజీతో ఏదో ఒకవిధమైన రాజీ చేసికొనుట మంచిదని ప్రభుత్వమునకు తోచినది. వైస్రాయి బాపును కలిసికొనుటకు పిలిపించెను.

పంజాబు దురంతములైతే జరిగిపోయినవి. వాటి విషయములో అపరాధులను శిక్షించు షరతునుకూడ బాపు దేశమును పెట్టనీయలేదు. ప్రభుత్వము తన తప్పును లేక పొరపాటును ఒప్పుకొనినచో వ్యవహారము తేలిపోయెడిది

ఇక మిగిలినవి రెండు విషయములు. ఖిలాఫతును గురించి అది భారత దేశమునకు సంబంధించినది కాదని, అంతర్జాతీయ రాజకీయములకు చెందినదని వైస్రాయి వాదన. అందు సున్నితమైన అనేక విషయములు నిండియున్నవని, దానిని వదలిపెట్టి కేవలము స్వరాజ్యమును గురించి మాట్లాడినచో మీతో రాజీ కుదరగలదని ఆయన అనెను. దానికి బాపు, "ఇది జరుగనేరదు. భారత దేశములోని ముసల్మానులు భారత దేశపు మహత్వపూర్ణమైన ఒక అంగము. వారి హృదయము వారికి జరిగిన అన్యాయముతో బాధపడు చుండ వారిట్లు నేనుదాసీనముగ నెట్లుండగలను?" అని జవాబు చెప్పెను. దీనిమీదట రాజీమాటలు భగ్నమైనవి. దేశములోని పెద్ద పెద్ద నాయకులందరు పరోక్షమున మాట్లాడునప్పుడు బాపూదే దోషమనిరి. ఖిలాఫతు సంగతి భారత దేశమునకు సంబంధించినది కాదని, దానిమాట వదలి పెట్టిన నష్టమేమున్నదని, స్వరాజ్యము లభించునుగదా యని వారి వాదన. (ఆ రోజులలో స్వరాజ్యమునుగురించిన మన భావములు యీనాటివలె స్పష్టమైనవి, శుద్ధమైనవి కావు. బహుశః ఏది దొరకినను దానిని స్వరాజ్యమనుకొని తీసి కొని రాజకీయముగ చాల నభివృద్ధి చెందినట్లనుకొనెడి వారము.) కాని బాపు ముందరఉన్న ప్రశ్న స్వరాజ్య మునుకూడ మించిన మన రాజకీయ శీలమునకు సంబంధించి నది. ముసల్మానులకు చేయూతనిచ్చి వారి దుఃఖమును తన దుఃఖముగ చేసికొని యిప్పుడు తనకు కావలసిన వస్తువు

లభించినంతనే వారిని వదలిపెట్టిన అది మోసము క్రిందకు వచ్చును. ఈ విధముగా మోసముచేయుటవల్ల ఏది దొరకి నను, బాపు దృష్టిలో, అది మలినమైనదే. అందుచేత శుద్ధమైన తన నిర్ణయమును వైస్రాయికి చెప్పుటలో ఆయనకు ఏమాత్రము సంకోచము లేకపోయినది.

## 47

చిరంజీవి చందన్ వివాహము నా కుమారునితో నిశ్చయమైనది. ఆతడు ఆక్సుఫర్డులో చదువుచుండెను. చందన్ అమెరికాలో తన చదువును పూర్తిచేసికొని భారతదేశమునకు తిరిగ వచ్చెను. ఆమె వర్ధా వచ్చినది.

అప్పుడు, "ఈ చందన్ ఇంగ్లీషుచదివి విదుషియై వచ్చినది. ఆమె యిక్కడ ఎందులకు పనికివచ్చును? ఈమెకు హిందీయైతే రానేరాదు. పెండ్లిఅయినతర్వాత ఏమి చదువగలదు? ఇప్పటినుండియే ఈమెకు హిందీ నేర్పుటకు ఏదైన ఏర్పాటుచేయవలెను." అని బాపు అనెను. ఆమెను డెహరాడూన్ కన్యాగురుకులమునకు పంపుటకు మేమిద్దరము నిశ్చయించితిమి. పూజ్యురాలైన బా (కస్తూరిబాయిగాంధి) ఉత్సవముల నిమిత్తమక్కడికి వెళ్ళవలసియుండెను. నన్నుకూడ వారు ఆహ్వానించిరి. మేము చందన్‌ను వెంటతీసికొనిపోతిమి. వారు అక్కడ ఆమెకు హిందీ నేర్పుటకు ఏర్పాటుచేసి దానికిబదులు ఆమెచేత పిల్లలకు చదువు చెప్పించుకొనిరి. ఆమె బోస్టన్

విశ్వవిద్యాలయములో సమాజ శాస్త్రములో ఎమ్. ఏ. పట్టమునందినది. ఇంతలో బాపూ రాజకోట సత్యాగ్రహము మొదలైనది. చందన్ కాఠియవాడుకు చెందిన పిల్ల. అట్టి సమయమున ఆమె ఎట్లూరకుండగలదు? సత్యాగ్రహములో చేరుటకు ఆమె దెహరాదూన్ వదలి రాజకోట వెళ్ళినది. ఇంతలో రాజీకుదిరి సత్యాగ్రహము ఆగిపోయినది. బాపూ వార్ధా వచ్చివేసెను. చందన్ రాజకోటలో కొద్దిగ జబ్బు పడినది.

'నేను జబ్బుగానున్నాను' అని చందన్ వ్రాసిన ఉత్తరము వార్ధావచ్చినది. ఆ రోజున బాపు వార్ధానుండి బొంబాయి వెళ్ళుచుండెను. ఆయనను పంపుటకు నేను స్టేషన్‌కు వెళ్ళితిని. చందన్ జబ్బుపడిన సంగతి నేనాయనకు చెప్పితిని. బాపు వివరము లడుగసాగెను. నేను చందన్ ఉత్తరమునే ఆయన చేతికిచ్చి వేసితిని. స్టేషనులో జనసమ్మర్ద మెక్కువగా ఉండుటవల్ల ఆయన దానిని చదువలేక పోయెను. వెంటతీసికొని పోయెను.

రెండవరోజు ఉదయం బొంబాయి చేరుటకు ముందే ఆయన చందన్‌కు ఒక తంతిని పంపెను. అందులో ఏ మందు పుచ్చుకొనవలెనో, ఏ విషయములలో జాగ్రత్తగ నుండవలెనో అన్నీ వ్రాసెను. వెంటనే అహమ్మదాబాదు పోయి ఫలానా వైద్యుని మందు పుచ్చుకొన వలసినదను సూచనను కూడ చేసెను. తంతికి పదునాలుగు, పదిహేను రూపాయలైనవి. అటువంటి పనులకు బాపు ఎంతడబ్బు

ఖర్చుపెట్టుటకైనా సంకోచించెడువాడు కాదు. కాని సాధారణముగా పైసపైసను చాలా పొదుపుగా వాడెడువాడు.

## 48

శ్రీ చిత్తరంజన్ దాసు దార్జిలింగులో జబ్బుగా ఉండెను. అక్కడ ఆయనను చూచుటకు గాంధీజీ వెళ్లెను. కొండ దిగిన తర్వాత ఆయన పర్యటన మరల ప్రారంభమయ్యెను. జలపాయగురినుండి గాంధీజీ, ఆయనసహచరులు దార్జిలింగు కలకత్తామెయిలు అందుకొని పోడాడీహ వెళ్ళవలసియుండెను. అక్కడనుండి గోఆలందో వెళ్ళే ఢాకా మెయిలులో ప్రయాణము చేయవలసి యుండెను. కొండనుండి ఒక పెద్దబండ విరిగి పడిపోవుటచేత దార్జిలింగు-కలకత్తా మెయిలు గంటన్నర ఆలస్యముగ చేరుకొనబోవుచుండెను. అందుచేత దానిలో వేళకు పోడాడీహ చేరుకొని ఢాకా మెయిలును అందుకొను ఆశ లేకుండెను. దీని వలన ఢాకా జిల్లాలోని నవాబ్‌గంజి కార్యక్రమము ఎగిరిపోవును. కాని గాంధీజీ వాగ్దానభంగమొనర్చునా? అది ఆయన స్వభావమునకు విరుద్ధము. అక్కడకు వేళకు చేరుట కేదో యొకటి చేయవలసియుండును. అందుచేత సతీశబాబు యిచ్చిన స్పెషల్ ట్రైన్ సూచనను వెంటనే ఆయన అంగీకరించి, "వైస్రాయిని కలియుట కేర్పరుపబడిన వేళను నేనెంత జాగ్రత్తగా పాటింతునో అంత జాగ్రత్తగనే మన ప్రజల కిచ్చిన సమయములను కూడ పాటించవలయును. నేను వేళకు నవాబ్‌గంజి చేరవలెను." అని అనెను. పార్వతీ

పురము నుండి గోఆలందో వరకు ప్రత్యేకరైలు ఏర్పాటు
చేయబడెను. దానికి రు 1140/- కిరాయియైనది. గాంధీజీ
ఆయన అనుచరులు వేళకు గోఆలందో చేరుకొని, అక్కడ
నుండి నవాబుగంజి పోవు స్టీమరును అందుకొన గలిగిరి.

ఏ గాంధీజీ ఉపయోగింపబడిన కవరులలోని ఖాళీ
స్థలము నుపయోగించకుండ వదలిపెట్టడో, ఆ గాంధీజీయే
అవసరము వచ్చినప్పుడు నూటికి బదులు వేయిరూపాయల
నైన ఖర్చుపెట్టుటలో సహితం ఎన్నడూ వెనుకాడడు.

## 49

ఒకసారి మేము మదరాసు ప్రాంతములో ఖాదీ
యాత్రలో నుంటిమి. బహుశః కాలికట్ చేరితిమేమో-
అక్కడికి ఉత్తరముగ నీలేశ్వర్ అను పేరుగల ఒక చిన్న
కేంద్రముండెను. అక్కడ నా విద్యార్థి యొకడు చాల
ప్రతికూల పరిస్థితులలో ఖాదీపని చేయుచుండెను. ఆతడు
బాపు తనదగ్గరకు రాగలడని ఆశపెట్టుకొనెను. స్వాగత
మిచ్చుట కేర్పాట్లుకూడ చేసెను. కాని మా కార్యక్రమ
ములో కలిగిన కొన్ని యిబ్బందులవల్ల నీలేశ్వర్ కార్యక్రమ
మును వదలిపెట్టవలసి వచ్చినది. బాపు దీనిని సహింప
జాలకపోయెను. "పాప మాతడు ఎంత శ్రద్ధతో పనిచేయు
చున్నాడు! ఒకమూల పడియున్నాడు. ఎవ్వరి సానుభూతి
లేదు. అక్కడకు నేను తప్పక వెళ్ళవలెను." అని అన
సాగెను. ఆ రోజులలో బాపు ఆరోగ్యముకూడ బాగుగ
లేకుండెను. ఎట్టిసందర్భములో నైన నీలేశ్వర్ వెళ్లుట సంభ

వము కాదని రాజాజీ చెప్పెను. బాపు ఉత్తేజితుడై, "సంభవ మెందుకు కాదు? ప్రత్యేక రైలు ఏర్పాటు చేయండి. ఆ పిల్లవాని శ్రద్ధ నాకు చాల విలువగలదు" అనెను. రాజాజీ డబ్బు ఖర్చుచేయుటకు సిద్ధముగానుండెను. కాని బాపుకు చాలకష్టము కలుగునని భయపడుచుండెను. ఆయన ఆరోగ్యమునకుకూడ అపాయము కలుగ వచ్చును. రాజాజీ బాపుకు నచ్చజెప్పుటకు ప్రయత్నించెను. మహాదేవభాయి కూడ నచ్చజెప్పెను. తుదకు నేను రాజాజీ చెప్పిన మాట నాకు కూడా సరియనిపించుచున్నది. మీరు వచ్చేడి వారే నని కాని మే మే ఆపివేసితిమని ఆ కుర్రవానికి నేను పెద్దఉత్తరము వ్రాసెదను." అని అంటిసి. నేనుకూడ రాజాజీ పక్షములో చేరిపోతినని చూచినప్పుడు బాపు నిస్సహాయుడై దుఃఖముతో దాని కొప్పుకొనెను.

నా విద్యార్థి పరిస్థితులన్నిటిని అర్థము జేసికొనెను. బాపు రాకపోవుటే మంచిదైనదని కూడా ఆతడు వ్రాసినాడు, కాని ఆతడు రాజాజీని క్షమించజాలక పోయినాడని నే నెరుగుదును. పాపము రాజాజీ యీ విధముగా ఎందరి చేతనో తప్పుగా అర్థము చేసికొనబడినాడు.

## 50

సాదా జీవితము గడపుట, తన చేతులతో పని చేయుట అను యీ రెండు విషయములు బాపుకు సహజముగనే అబ్బినవి. విదేశములలో విద్యార్థిగనున్నప్పుడు శాకాహారపు హోటళ్ళను వెదకుకొనుచూ, వెదకుకొనుచూ

ఎంత దూరమైనను కాలినడకను పోయెడివాడు. తర్వాత తన భోజనమును స్వయముగ వండుకొనుట మొదలుపెట్టెను. ఈ స్వయంపాక ప్రయత్నము వల్లనే శ్రీ కేశవరావు దేశ పాండేకు బాపుకు విదేశములో మైత్రి కుదిరినది. ఇద్దరు కలిసి జావ (Porridge) కాచుకొనెడివారు.

బాపు బారిష్టరయి, భారతదేశమునకు వచ్చిన తర్వాత కూడ బొంబాయిలో తన యింటినుండి కోర్టువరకు కాలినడకనే పోయెడివాడు.

దక్షిణాఫ్రికాలో తెల్ల మంగలి ఆయన తలవెంట్రుకలు కత్తిరించుట కంగీకరించనప్పుడు, వానిని ప్రతి మాలుటకు బదులు పిల్లైనట్లు తన వెంట్రుకలను తానే కత్తిరించుకొని కోర్టుకుకూడ అట్లే పోయెను. తెల్లబారిష్టరులు పరిహాసము చేయుచు, గాంధీజీ ! ఎలుకలేమైనా మీ వెంట్రుకలను కొరికివేసినవా ?" అని అడిగిరి. ప్పుడాయన జరిగిన కథను చెప్పెను.

దీని తర్వాత ఆయన టాల్‌స్టాయి రస్కినుల గ్రంథములు చదివినప్పుడు సాదా జీవితము వైపు, స్వావలంబన వైపు మరింత మొగ్గెను. జూలూ యుద్ధపురోజులలో అంబులెన్సు కారు పనితీసికొని బాపు పడిన కష్టము నాయన వర్ణించలేదు. ఆరోజులలోనే ఆదర్శసేవ చేయగోరువాడు. బ్రహ్మచర్యమును పాలించవలెనన్న భావము ఆయన మనస్సులో మొలకెత్తినది. టాల్‌స్టాయి గ్రంథములు

చదివినప్పుడు. "బ్రెడ్ లేబర్" (తిండికొరకు శ్రమపడు) భావము ఆయనకు రుచించినది. శరీరము నిలబెట్టుకొనుటకు అన్నము తినవలసిన ప్రతివాడు, శీతోష్ణములనుండి తప్పించుకొనుటకు బట్టలు ధరించవలసిన ప్రతివాడు అన్నవస్త్రముల ఉత్పత్తిలో ఏదో కొంత పాల్గొనవలెనను విశ్వాసమాయన కేర్పడినది. హరిజనుల కష్టము దూరము చేయవలెనన్నచో మలమూత్రములను శుభ్రము చేయుపనిని కూడ మనము స్వయముగ చేసికొనవలెను. ఈ పనిలో ఆధునిక విజ్ఞానపద్ధతులను ప్రవేశపెట్టి పరిశుభ్ర మొనర్చు (సఫాయీ) పనిని ఉత్తమ వృత్తిగ తీర్చి దిద్దవలెను. ఇదంతా తెలిసికొనుటతోనే ఆయన ఊరుకోలేదు. వాటిని ఆచరణలో పెట్టుటకూడ మొదలుపెట్టెను.

1917లో బాపు చంపారన్ వెళ్లెను. అక్కడ ఆయన రైతుల కైఫీయతులను వ్రాయు పనిని మొదలు పెట్టెను. బిహారులోని పలువురు వకీళ్లు ఆయనకు సహాయపడుటకు వచ్చిరి. శ్రీ రాజేంద్రబాబు, వ్రజబాబు మొదలైనవారు అందరు ఆ కాలమునాటి సహచరులే. బాపు వారి నందరిని తన దగ్గర ఉండమనెను. వారి నివాసము ఒక విధమైన ఆశ్రమ మయిపోయినది. ఈ వకీళ్ళందరు దాని ఖర్చు కొరకు చందాలిచ్చెడి వారు. కాని ఆ ఆశ్రమ నిర్వహణము పిసినిగొట్టయిన ఒక కోమటి చేతిలో నుండెను. ప్రతివిషయము జాగ్రత్తగా పరిశీలింపబడు చుండెడిది. ఒకసారి చాల ఖరీదైన మామిడిపండ్లు తేగా యిక్కడ యిట్టి

ఖర్చు చేయరాదనిచోక యినప్పుడే మామిడిపండ్లు తెప్పించవలెనని చెప్పడం జరిగినది. దాని తర్వాత ఎవరి బట్టలు వారే ఉతుకుకొన వలెనన్న ఆజ్ఞ జారీయైనది. ఇవన్నీ చేయుటలో బాపుకొక అభిప్రాయముండెను. ఖర్చుకు డబ్బు వకీల్లే యిచ్చినను అది యియ్యబడినంతనే ప్రజలడబ్బయి పోయినదని ఆయన తలంచెను. ఆ ధనమును పేదదేశపు పీడిత ప్రజల ప్రతినిధులకు తగినరీతిగ ఖర్చు పెట్ట వలెనని బాపు సిద్ధాంతము.

సాధారణ పరిస్థితులలో బీదవారివలె జీవించవలెనని ఎంత పట్టుపట్టినను ఆయన రోగికొరకు ఎంత ఖరీదైన పండ్లనైన తెచ్చియిచ్చును. అప్పుడప్పుడు రోగిని నెలల తరబడి పండ్లరసము మీదనే ఉంచును.

## 51

1930లో నేను బాపుతోపాటు యరవదా జైలులో నుంటిని. కాని నేను యిప్పుడు చెప్పబోవు సంగతి అంతకు పూర్వపుది. జైలుకు రావటం తోడనే ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ వచ్చి బాపును "ప్రతివారము మీరు ఎన్ని ఉత్తరములు వ్రాయవలసి యుండును?" అని అడిగెను. బాపు "ఒకటికూడ అవసరం లేదు." అని జవాబిచ్చెను. మరల ఆయన "బయటినుండి ప్రతివారములో ఎన్ని ఉత్తరములు వచ్చిన మీ పని కొనసాగును" అని అడిగెను. దానికి బాపు "నాకొక్క ఉత్తరముకూడ రానవసరము

లేదు" అని చెప్పెను. ఈ సంభాషణకు పిమ్మట ఆ పెద్ద మనిషికి జ్ఞానోదయ మయ్యెను. తర్వాత బాపు ప్రతి సోమ లేదా మంగళవారము రోజున ఆయన కిష్టము వచ్చినన్ని ఉత్తరములు వ్రాయవచ్చునని నిర్ణయమయ్యెను. తర్వాత ఏయే చుట్టములకు ఆయన ఉత్తరములు వ్రాయగలడను ప్రశ్న ఉదయించెను. దానికి బాపు, "భారతవాసు లందరు నా కుటుంబములోని వారే. అట్టియెడ కనీసము ఆశ్రమవాసుల పట్లనైనా నేను భేదభావము చూపించ జాలను." అని అనెను. అంతట ఆశ్రమ విలాసమునకు బాపు తన యిష్టమువచ్చిన వారికల్లా ఉత్తరము వ్రాయ వచ్చునని నిర్ణయింపబడెను.

ఇదంతా జరిగిన తర్వాత నేను యరవదా చేరు కున్నాను. బాపు స్టేటు ప్రిజనర్ కాబట్టి ఆయన ఖర్చు కొరకు ప్రభుత్వము నెల 1కి రు 150/- మంజూరు చేసెను. మొదటి రోజుననే సూపరింటెండెంటు మేజరు మార్టిన్ ఫర్నిచరు (కుర్చీలు, బల్లలు, సోఫాలు మొదలైనవి), క్రోకరీ (కప్పులు, ప్లేట్లు మొదలైనవి), పాత్రసామానువగైరా తీసుకొని వచ్చెను. వీటిని చూడటం తోడనే బాపు, "ఇవన్నీ ఎవరికోసం తీసికొని వచ్చారు? వీటిని తిరిగి తీసికొని వెళ్ళండి." అని అనెను. పాప మా మేజరున కాయన మాటలు అర్థం కాలేదు. ఆయన "ఇంత పెద్ద అతిథికి కనీసము నెలకు రు 300/- కావలెనని నేను మొదటనే వ్రాసి

యున్నాను. అది మంజూరు చేయబడునని నాకు నమ్మకము గలదు" అని చెప్పెను. దానికి బాపు "మీరు చెప్పినది బాగానే ఉన్నది. కాని యీ పైకమంతా నా దేశపు ఖజనా నుండియే ఖర్చగును గదా? నా దేశము భరించ వలసిన బరువును అధికముచేయుట నా కిష్టములేదు. నా భోజనము ఖర్చు నెలకు రు 35/- ల కంటె అధికము కాదని నా నమ్మకము. నా ఆరోగ్యము బాగా ఉంటే నేను 'సి' క్లాసు ఖైదీల భోజనమునే తిని యుండెడి వాడను. కాని నేను ఫలములను తీసికొనవలసి వచ్చుచున్నది. మేకపాలు త్రాగవలసి వచ్చుచున్నది. అందులకునాకు సిగ్గుగానున్నది" అని అనెను.

చివరకు ఆ వస్తువులన్నీ తిరిగి పంపివేయ బడినవి. ఆస్పత్రినుండి ఒక యినుపమంచము, పరుపు, "సి" క్లాసు వారి కంబళ్లు తెప్పించబడెను. తినుటకు, త్రాగుటకు వలయు పాత్రలుకూడ "సి" క్లాసువే తెప్పించబడెను. అన్నము తినే పళ్లెము, చెంబూ రెండూకూడ సత్తుతో చేయబడినవి. బహుశః ఒక్క రోజైనను వాటిని తోము టలో అశ్రద్ధచేసినచో రెండవరోజు కవి పూర్తిగ నల్లబడి పోవును. వాటిలో నుంచబడిన నీటిపై నూనెలాంటి వస్తువు తేలుచుండును. బాపునకు శౌచము నిమిత్తం ప్రత్యేక మొక గదియుండెను. దానిలో కమోడ్ ఉంచబడెను. తోటమధ్య బహిరంగ ప్రదేశములో ఆయన నిద్రపోయెడి వాడు. నేను వెళ్లిన తర్వాత బాపు తినుటకు త్రాగుటకు

ఉపయోగించు వస్తువులు పెట్టుకొనుటకు ఒక జాలీ ఉన్న అల్మైరాను, దాని నుంచుటకు ఒక మేజాను తయారు చేయించితిని, వాటితో పాటు బాపు మూత్రవిసర్జన చేయు పాత్రనుంచుటకు ఎత్తైన స్టూలునుకూడ చేయించితిని. మా వైభవమంతా యిదే.

బాపు వ్రాయుటకు కూర్చున్నప్పుడు వచ్చిన ఉత్తరములలో ఖాళీగా ఉన్నభాగమును కత్తిరించి దానిమీదనే జవాబు వ్రాసి పంపెడివాడు. ఆశ్రమము నుండి తన పేరున అందరి ఉత్తరములు వచ్చిన పెద్దకవరుకే క్రొత్తకాగితపు ముక్కను అంటించి, దానిలో తన ఉత్తరములుంచి తిరిగి పంపెడి వాడు. కవరు ప్రాతదై పోతే దానిని మరమ్మత్తు చేసి గట్టిగాచేయు పనినాది. దాని మీద ఒకరోజున మా కిద్దరకు వాదనకూడ జరిగినది. కాని మా మతభేద మట్లే యుండిపోయెను. బాపు కాలము వృథాయయ్యెను. దానికి మే మిద్దరము విచారించితిమి.

నా స్వభావములో కూడ పిసినారితనం కొద్దిగా ఉన్నది. ఖర్జూరము, కిస్‌మిస్ పండ్ల పొట్లములు బజారు నుండి వచ్చినప్పుడు ఆ పొట్లములమీది దారమును నేను జాగ్రత్తగ పెట్టుచుండెడి వాడను. ఒకరోజున బాపునకు దారము కావలసి వచ్చినది. వెంటనే నేను నా దగ్గరనున్న దానిలోనుండి యిచ్చితిని. అందుకు బాపు చాల సంతోషించి, దార మెక్కడ దొరికినదని అడిగెను. నేను సంగతంతా చెప్పితిని. అప్పు డాయన, "దేశ సంపద నీ

చేతిలో సురక్షితముగా ఉండగలదని పించుచున్నది. నిన్ను విద్యాశాఖ డైరెక్టరుగా నియమించవలెను." అనెను.

ఆ రోజులలో బాపు నూలు బాగా వడికేవాడు. వారమున కొకసారి ఉత్తరములు వ్రాయుట, గీతా శ్లోకములు కంఠస్థము చేయుట, నా దగ్గర మరాఠీవాచకములు చదువుటకు పట్టిన కాలము పోగా మిగిలిన కాలమంతా నూలు వడుకుటయందే వినియోగించెడి వాడు. ఈ రోజులలో యరవదా రాట్నమని వ్యాప్తిలోనున్న దానిని బాపు ఆ దినములలోనే ఆవిష్కరించెను. నూలు వడికేటప్పుడు అది తెగకుండా ఉండుటకు ఆయన చాల జాగ్రత్త పుచ్చుకొనెడివాడు. అప్పటికిని తెగిన దారపు ముక్కలను ప్రోగు చేసి వాటితో చిన్న చిన్న సన్నని త్రాళ్ళను తయారు చేసెడివాడు. అవి బాపు చిలపలను కట్టుటకు పనికివచ్చేవి. అప్పటికి మా వద్ద తెగిపోయిన దారపుముక్కల పెద్ద ప్రోగేర్పడి పోయినది. నేను ఖాదీ బట్ట ముక్కలతో చిన్న చిన్న సంచులను కుట్టి వాటిలో యీ దారపు ముక్కలను గట్టిగా నింపి పిన్‌కుషనులను తయారుచేయ గోరితిని. అయితే ఖాదీ రంగుది కాదు. తెల్లఖాదీ త్వరలోనే మాసిపోవును. అందుచేత అవి బాపు ముందుంచుటకు వీలులేదు. చాలా ఆలోచించి నేనొక ఉపాయము కనిపెట్టితిని. మా వద్ద అయోడిన్ ఉండెను. దానిలో సంచిని ముంచివేసి రంగులు వచ్చునట్లు చేసితిని. ఆ సంచిలో తెగిన ముక్కలను నింపి వేసితిని. దీనితో మంచి పిన్‌కుషన్ తయారైనది. బాపు

చాల సంతోషముతో దానిని స్వీకరించెను. తర్వాత చాల దినములవరకు జాగ్రత్తగా దానిని ఉపయోగించుకొనెను.

నా శిక్షాకాలము పూర్తియగుటతోడనే నేను విడుదల అయితిని. కాని ఆ పిన్‌కుషన్ బాపు డస్కుమీద చాలరోజుల వరకుండెను. విశేషమైన సాధనములతో కాకుండా వీలైనంత తక్కువ సాధనములవల్ల చేతితో తయారు చేయబడిన వస్తువులన్న బాపునకు చాలయిష్టము.

మొట్టమొదట నేను మగన్‌వాడి వెళ్ళినప్పుడు అక్కడ లావు పాటి వెదుళ్ళముక్కలు పడియుండుట చూచితిని. ఆ వెదురు ముక్కలనుండి కేవలము ఒక్క చాకు సహాయముతో నేను వెదురు చంచాలు, పేపరు కట్టరులు (కాగితములుకోయు చాకులు) మొదలైన చాల వస్తువులను తయారుచేసి బాపునకు కానుకగా యిచ్చితిని. బాపు ఆ వస్తువులను పండిత జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా ఆజాద్ వంటి వారికి కానుకగా యిచ్చి, వాటిని గురించి హరిజనబంధులో వ్రాసినప్పుడు యాభై యేండ్ల వయస్సులో కూడ నాకు పిల్లవాళ్ళకు వలె ఆనందము కలిగినది.

## 52

ఆశ్రమ ప్రారంభ దినములనాటి మాట. ఆ రోజులలో మా సత్యాగ్రహ ఆశ్రమము అహమ్మదాబాదు దగ్గర కోచరబ్ అనే గ్రామములో ఉండెను. అక్కడకు స్వామిసత్యదేవ్ వచ్చెను. నేను ఆయనను 1911, 1912లలో

ఆల్మోడాలో కలుసుకొని యుంటిని. అప్పు డాయన అమె రికానుండి క్రొత్తగా వచ్చియుండెను. దాని తర్వాతనే ఆయన దేశస్వాతంత్ర్యము కొరకు సన్న్యాసము స్వీకరించెను.

ఆయన ఆశ్రమ స్వీకారమునకు ముందే అనేక గ్రంథములు వ్రాసియుండెను. సత్యదేవ పరివ్రాజకు డనే పేరుతో ఆయన ప్రసిద్ధి కెక్కెను. ఆశ్రమమునకు వచ్చిన వెంటనే సాయంకాల ప్రార్థన తర్వాత ఆయనద్వారాతులసీ దాసకృత రామాయణము వినుచుంటిమి. హిందీపట్ల ఆయన కున్న అనురాగమును చూచి బాపు ఆయనను హిందీ ప్రచారము కొరకు మదరాసు పంపెను. మదరాసులో హిందీ ప్రచారమునకు సంబంధించిన మొదటి పాఠ్యపుస్తక మును (వాచకమును) సత్యదేవులే వ్రాసిరి.

మా ఆశ్రమము కోచరబ్‌లోని అద్దె బంగళాను వదలిపెట్టి సబర్మతీ నదీతీరమునగల తన స్థలములోనికి వచ్చి యుండెను. అక్కడకు కూడ సత్యదేవ్‌జీ వచ్చెను. దేశ స్వాతంత్ర్యము కొరకు బాపు పని చేయుచుండుట చూచి సత్యదేవ్‌జీ చాల ప్రసన్నులైరి. ఆయన ఆశ్రమములో అతిథులుగానుండిరి. మా శక్తికొలది మే మాయన సేవ చేసెడి వారము. ఆయన ఆహార పానీయముల విషయమై కొన్ని యేర్పాట్లు ప్రత్యేకముగా చేయవలసి యుండెడిది. ఆయనను సంతోష పెట్టుటయే మాకు పరమానంద ముగా నుండెడిది.

ఒక రోజున సత్యదేవ్‌జీ బాపు దగ్గరకు వచ్చి, "నేను ఆశ్రమములో చేరదలచుచున్నాను. ఆశ్రమవాసినై ఉండెదను." అని యనెను. దానికి బాపు "మంచిమాట. ఆశ్రమము మీ వంటివారి కొరకే. కాని ఆశ్రమవాసులగుటకు ముందు మీ రీ కాషాయ వస్త్రములను వదలిపెట్ట వలసి యుండు"నని చెప్పెను.

వినుటతోడనే సత్యదేవ్‌జీకి పెద్దదెబ్బ తగిలి నట్లయినది. ఆయనకు చాలా కోపము వచ్చినది. కష్టమైనది. కాని తన కోపమును బాపు ముందర యెట్లు వెలిబుచ్చగలడు? "ఇదెట్లు సంభవము? నేను సన్యాసిని గదా?" అని ఆయన అనెను. దానికి బాపు "నేను సన్యాసము వదలిపెట్టమని చెప్పుటలేదు. నా మాటను అర్థము చేసికొనండి" అని చెప్పెను.

పిమ్మట శాంతముగా బాపు ఆయననిట్లు సమాధానపరచెను. "మన దేశములో కాషాయబట్టను చూడటముతోడనే లోకులు భక్తితో సేవచేయుటకు మొదలు పెట్టుదురు. మనపని సేవచేయ చేయించుకొనుట కారాదు. సేవచేయుటయే. లోకులకు మే మెట్టి సేవ చేయ గోరుచున్నామో అట్టి సేవను యీ బట్టల మూలమున వారు మీ వల్ల చేయించు కొనరు. దానికి బదులు మీ సేవ చేయుటకే పరుగెత్తుకొని వచ్చెదరు. అందుచేత ఏ వస్తువు మన సేవాసంకల్పమునకు అంతరాయ రూపముగు చున్నదో దానిని మనమేల యుంచుకొనవలెను? సన్యాసము మనస్సు

నకు సంబంధించినది. సంకల్పమునకు సంబంధించినది. బయటి వేషముతో దానికి సంబంధ మేమున్నది? కాషాయ వస్త్రము వదలిపెట్టుటతోడనే సన్యాస మెగిరిపోతుందా? రేపు లేచి మనము గ్రామీణ ప్రాంతములకు పోయి అక్కడి పాకీదొడ్లనుశుభ్రపరచ మొదలు పెట్టినచో కాషాయ వస్త్రములను ధరించిన మిమ్ము ఎవరైన ఆ పని చేయనిచ్చెదరా?". సత్యదేవ్‌జీకి సంగతి అర్థమయింది కాని, రుచించ లేదు. నా దగ్గరకు వచ్చి, "ఇది నా వల్ల కాదు. సంకల్ప పూర్వకముగ నే నే బట్టలను ధరించ మొదలు పెట్టితినో వాటిని వదలిపెట్ట జాలను".

# 53

"శిష్టాచారములనే పేర సమాజములో ప్రచారములో నుండెడి అసత్యముల నిరోధించుటలో 'క్వేకరు'ల మగు మేము చాల ప్రసిద్ధి చెందితిమి. కాని గాంధీజీ మా కంటెకూడ చాల ముందుకు పోయినాడు." అని హారేస్ అలెగ్జాండరు ఒకచోట వ్రాసెను. దీనికి హారేస్ అలెగ్జాండరిచ్చిన ఉదాహరణను నే నీయ నవసరము లేదు. నేను స్వయముగా చూచిన ఉదాహరణ నిచ్చెదను.

(క్వేకర్ శాఖ క్రైస్తవమతమునకు చెందినశాఖ. దీనిలో అహింసాపాలన విశేషముగా ఉండును. వీరు యుద్ధములలో పాల్గొనరు. వీరిలో ధర్మోపదేశకులగు పాదరీ లుండరు. ధ్యానము కొరకు అందరు ఒకచోట చేరెదరు.

అందులో ఎవరైనా తన మనస్సునకు వచ్చిన ఉపదేశ వాక్యములను చెప్పును.)

బాపు మనస్సులో తక్కువవాళ్ళు గొప్పవాళ్ళు అనే భేదభావము లేనేలేదు. ఆయన వశములో నున్నంత వరకు సంఘము లేక సమాజముయొక్క నియమములను పాలించును. కాని తత్వము విషయము వచ్చినప్పుడు ఆయన స్వభావము బైటపడుచుండును.

చాలా కాలంనాటి ముచ్చట. ఆ రోజులలో బాపు బొంబాయి వెళ్ళినప్పుడు తన మిత్రుడైన డాక్టరు ప్రాణ జీవన్ మెహతా సోదరుడైన రేవాశంకర్ జగజీవన్ దాసు ఇంట్లో దిగెడివాడు. మహాత్ముడైన పిమ్మట ఆయనకు ఆతిథ్యమిచ్చుట మహాసౌభాగ్యమని బొంబాయిలోని బాగా పెద్దవాళ్ళు భావించుట మొదలు పెట్టినారు. కాని బాపు రేవాశంకర్ భాయి జీవించి యున్నంతవరకు ఆయన దగ్గరనే దిగెడివాడు.

బాపు దిగినచోట ఆయన అతిథులకు లోపం ఉండేది కాదు. గృహయజమాని అందరికిని ఏర్పాట్లు చేయవలసి ఉండేది. ఒకరోజున స్వామి ఆనంద్ అక్కడకు చేరుకొనెను. స్వామి ఆనంద్ సన్యాసుల బట్టలు ధరించెడి వాడు కాదు. ధోవతీ, చొక్కా గాంధీటోపి ఈ రకమైన మామూలు దుస్తులలో ఎప్పుడూ ఉండేవాడు.

బాపు యీ తీవ్రనిర్ణయాన్ని విని నేను కంగారు పడి పోతిని. నాకు భయము కలిగినది. ఎక్కడైన స్వామి ఆలస్యము చేసియుండినచో బాపు ముందర ఆయన ప్రతిష్ఠ ఏముండును? రెండవ రోజున స్వామి వచ్చెను. ఆయనను చూచుటతోడనే నిన్న యెందుకు రాలేదని నేను ప్రశ్నించితిని. దానికి ఆయన, "నేను బొంబాయి నుండి సరియైన వేళకు బయలుదేరితిని. కాని రైలులో నాకు జ్వరము వచ్చినది. అందుచేత సూరత్‌లో దిగవలసి వచ్చినది. సోదరిదగ్గరకు వెళ్ళితిని. కొంచెం మందు తీసికొంటిని. కొంత విశ్రాంతి తీసికొని నేడు వచ్చితిని" అని చెప్పెను. నిన్న బాపు అన్నమాటలు నేనాయనకు చెప్పితిని. బాపునకు స్వామి ఆలస్యముగ వచ్చుటకు కారణము తెల్పితిని. ఆయన "అటువంటిదేదో జరిగియుండునని నేననుకొంటిని. లేకపోతే ఎందుకు రాకుండును?" అని యనెను.

## 55

అదేరోజున స్వామి నవజీవన్ ప్రెస్ చార్జి తీసికొనెను. ఆ ప్రెస్‌లో ఆయనకూడ ఒక భాగమైపోయినంత శ్రద్ధతో పనిచేయసాగెను. పిమ్మట పెద్ద ఆందోళనలు మొదలైనవి. మేమందరము బాపు పనిలో లీనమైపోతిమి. మాకు రాత్రి పగళ్లు తెలిసినవి కావు.

ఒకరోజున నేను ప్రెస్‌కు వెళ్ళినాను. మామూలు ప్రకారము స్వామి పనిచేయుచుండెను. పాలగ్లాసొకటి ప్రక్కన ఉండెను. పండిన మంచి అరటిపండ్లు ముందు

యుండెను. ప్రెస్‌నుండి ప్రూఫులు ఒకదాని తర్వాత
ంకొకటి చేతిలోనికి వచ్చుచుండెను. ఆయన ఎడమ చేత
టిపండు ముక్కను విరుచుకొనును. కుడిచేతితో ప్రూఫు
దిద్దును. ఒక ప్రూఫు చేతిలోనుండి పోవుటతోడనే
గ్లాసును నోటిదగ్గర పెట్టుకొనును. అందులోనుండి ఒక
క్కెడు త్రాగి మరల ప్రూఫులు దిద్దుటకు మొదలు
ను. మూడు నాలుగు రోజులవరకు ఆయన స్నానము
డు. పనిదగ్గరే పడుకొనుటకు ఒక జంపఖానా ఉంచు
ెను. అటువంటి స్థితిలో ఉత్తరభారతములోని ఏదో
స్థలమునుండి కార్డొకటి బాపునుండి స్వామిపేర
్చెను. దానిలో "మీరు నవజీవన్ ప్రెస్ పనిని బాగుగా
చుకొనుచున్నారు గనుక ఆ విషయములో నేను
ంతుడను. మీ పని బాగుగా జరుగుచున్నదని ఆశిం
ను" అని. యింతమాత్రమే అర్థమువచ్చు మాటలు
్రతముండెను. స్వామి చిక్కులో పడిపోయెను. "అట్టి
ెందుకు వచ్చినది. నేనెట్టి కష్టమును గురించి
్యాదు చేయలేదు. నన్నుగురించి కూడ ఎవ్వరు ఫిర్యాదు
నట్లు లేదు." అని ఆయన పెద్ద ఆలోచనలో పడి
యెను. ఇంతలో- నవజీవన్ ప్రెస్ ఆరునెలలు నడుపు
తాను వాగ్దానము చేసిన సంగతి, ఆ గడువు నాటితో
రియైన సంగతి ఆయనకు జ్ఞాపకమువచ్చెను. అది
పునకు రావడంతోడనే స్వామి "ముసలికోమటి చాలా
పరుడు. ఇది నా వాగ్దానమును యింకను కొనసాగించు

టకు ఎత్తు. ఆరునెలల కొరకే యిక్కడికి వచ్చిన సంగతిని నే నేమో మరచిపోయాను. కాని ముసలివాడు మరచిపోయే వాడు కాడు. చూడు, మరల నన్నెట్లు కట్టివేయుచున్నాడో? జీవత్ రామ్ (కృపలానీ) ఈ ముసలి వాడు పెద్ద ఐంద్రజాలికుడని చెప్పినది సరిగానే ఉన్నది." అని స్వామి అనెను.

## 56

నన్ను బాపు ఆశ్రమమునకు ఆశ్రమవాసిగా గాక జాతీయపాఠశాల నడిపెడు ఒక ఉపాధ్యాయునిగా పిలిచెను. శ్రీ కిశోర్‌లాల్ మశరువాలా, శ్రీ నరహరి పరిఖ్‌లు కూడా యిదే విధముగా వచ్చిరి. కాని మామాసాహెబ్ ఫడ్కే, శ్రీ వినోబాబావే ఆశ్రమవాసులగుటకు ఆశ్రమమునకు వచ్చిరి. మా జాతీయోపాధ్యాయులకు ఆశ్రమ నియమములు వర్తించవు. ఆశ్రమవ్రతములుకూడ మాకు నిర్బంధములు కావు. అయినప్పటికి నెమ్మది నెమ్మదిగా మే మెప్పుడు ఆశ్రమవాసుల మైపోతిమో మాకే తెలియదు.

బాపు అహమ్మదాబాదు నుండి చంపారన్ వెళ్ళుచుండెను. నే నాయనను బరోడా స్టేషన్ దగ్గర కలిసినాను. అప్పు డాయన నన్ను "చంపారన్ ఎక్కడున్నదో ఎరుగుదురా?" అని అడిగెను.

ఆ రోజులలో యీ ప్రశ్నకు జవాబు చెప్పగలిగిన వారు భారతదేశములో చాలా తక్కువగానే ఉండవచ్చును. కాని నేను జాతీయోపాధ్యాయుడను కనుక

జవాబు చెప్పలేక పోయినచో సిగ్గుపడవలసిన విషయమగును. అదృష్టమువల్ల నేను నేపాలు యాత్రకు ముజఫర్పూర్ వెళ్లినప్పుడు అక్కడ చంపారన్ పేరు వినియుంటిని. అందుచేత నేను, "సరిగా చెప్పలేను కాని బీహారులోని ఉత్తరభాగములో ఎక్కడో ఉన్నది. చంపారన్- ఒక పట్టణమో లేక జిల్లాయో నేనది చెప్పలేను. నైమిశారణ్యమువలె, దండకారణ్యమువలె అడవి కాదనిమాత్రము ఎరుగుదును." (వేదారణ్యము పేరు ఆ రోజులలో నేను వినియుండలేదు) అని జవాబు చెప్పితిని.

బాపు సంతోషించెను. అంతట నేను, "మీ ఆశ్రమములో జాతీయపాఠశాలను స్థాపింప గోరుచున్నారు. కాని మీరు స్వయంగా చంపారన్ వెళ్లుచున్నారు. దాని పునాదిని మీరే వేయవలసియుండును. ప్రతి విషయములోను మాకు మీ సలహా అవసరమై యుండవచ్చును." అని అంటిని. దానికి బాపు "ఇప్పుడైతే మొదలు పెట్టవలసియుండును. దాని నిప్పుడే వృద్ధిచేయుము. అందులో ఏదైనా తప్పులు చేసినను వాటిని దిద్దుకొనుటలో కష్టమేమున్నది?" అని జవాబు చెప్పెను. ఆ జవాబువల్ల నాకు సంతోషము కలుగలేదు. మరల బాపు "ఇప్పుడింకా ఆశ్రమముయొక్క ప్రారంభపు దినములు. నేను చాలా రోజులు దానినుండి దూరముగా ఉండజాలను. ప్రతి పక్షమునకు ఆశ్రమమునకు ఒకసారివస్తూ ఉండెదను" అని మరల చెప్పెను. ఇది విని నాకు ఎంత సంతోషము కలిగినదో

అంత ఆశ్చర్యముకూడ కలిగినది. అహమ్మదాబా దెక్కడ, చంపారన్ ఎక్కడ? ఈ రాజకీయ నాయకుడు చిన్న ఆశ్రమముకొరకు, అందులోని మా చిన్నపాఠశాల కొరకు ప్రతి పక్షము ఇంత కష్టపడి యింత ఖర్చుపెట్టి చంపారన్ నుండి ఆశ్రమమునకు రాగలడని నా ఊహాకు తట్టలేదు. నేను చాల సంతోషించాను. "ఆశ్రమ జీవితముపై పాఠశాల ఏర్పాటుపట్ల మీ మనస్సులో యింత శ్రద్ధాసక్తులున్నప్పుడు నాకే విచారము లేదు. మేము తనువర్పించి పనిచేయగలము" అని నా మనస్సులో నేననుకొంటిని.

బాపు అన్న దానిని చేసి చూపించెను. ప్రతిపక్షమున కొకసారి వచ్చెడివాడు.

## 57

ఆశ్రమములో మా పాఠశాల ప్రారంభమైనది. తర్వాత మశరూవాలా పరీక్షలు వచ్చారు. బాపు పక్షమున కొకసారి తప్పక వచ్చెడివాడు. ఆయన వచ్చి మా మధ్య కూర్చుండి చిన్న పెద్ద విషయములన్నీ చర్చించెడివాడు.

ఒక రోజున బాపు "ఒక్క విషయము స్పష్టము చేయగోర్తాను. మీరు నడిపెడి పాఠశాల మీది నాది కాదు. లోకులు నన్ను ఎరుగుదురు కాబట్టి నా యందు విశ్వాసముంచుదురు కాబట్టి పాఠశాల ఖర్చు భారమును తీసికొన్నాను, అందుచేత పాఠశాల నాది కాజాలదు. నే నిక్కడిచ్చు సలహాలన్నీ కేవలము సలహాలు మాత్రమే

అది మీకు రుచించక పోతే వాటిని తీసిపార వేయండి. మీ బుద్ధికి తోచిన దానిని మంచిదనుకొని ఏవిధమైన సంకోచము లేకుండా అమలులో పెట్టుతూ పొండి. నేను మీ వెంటనుండి నట్లయితే మీ వలె ఉపాధ్యాయుడనై పని చేయుచున్నచో మిమ్ములను నా అభిప్రాయముల లోనికి తీసికొని వచ్చుటకు పూర్తిగ ప్రయత్నించి యుందును. నేను ఉపాధ్యాయుడుగా పనిచేయ కుండుటవల్ల నా అభిప్రాయములను మీ నెత్తిన రుద్దుటకు నా కధికారము లేదు. మీ యందు నాకు విశ్వాసము గలదు. మీ రేమి చేసినా సరే. అందులో చెడుగుండబోదు." అని చెప్పసాగెను.

# 58

ఒక రోజున మంచి దస్తూరిని గురించి చర్చ బయలు దేరినది. బాపునకు తన వంకర టింకర అక్షరములన్న చాల విచారముండెడిది. అందుకని దస్తూరి మంచిగ ఉండ వలెనని గట్టిగ చెప్పెడివాడు.

బాపు ఇంగ్లీషు అక్షరములంత చెడుగా ఉండెడివి కావు. అది కాక ఆయన ధ్యానపూర్వకముగ ఏదైనా ప్రత్యేకమైన ఉత్తరముగాని, వ్యాసమునుగాని వ్రాసి నప్పుడు ఆయన అక్షరముల వ్యక్తిత్వము తమ ప్రభావము చూపించకుండ ఉండెడివి కావు. గుజరాతీని ఆయన రెండు చేతులతో వ్రాయును. కుడిచేయి అలసిపోయి

నప్పుడు ఎడమచేతితో వ్రాసెడివాడు. 'హింద్ స్వరాజ్'ను ఆయన ఇంగ్లండునుండి దక్షిణాఫ్రికా తిరిగి వెళ్ళునప్పుడు ఓడమీద, ఓడ కాగితముల మీదనే వ్రాసియుండెను. ఆ పుస్తకము బ్లాకులుగా చేయబడి అచ్చువేయబడెను. దానిలో రెండుచేతుల వ్రాత కనబడును. రెండువ్రాతలలో చాల భేదమున్నది. ఎడమచేతి వ్రాత ఎక్కువ సాఫుగా నున్నది.

పిల్లలకు అక్షరములు నేర్పుటకుముందు వారికి చిత్రలేఖనము - డ్రాయింగు - నేర్పవలెనని బాపూ మాకు చెప్పుచుండెడివాడు. చిత్రలేఖనములో చేయితిరిగినతర్వాత అక్షరములు చెడుగా ఉండే భయమెంతమాత్రముండదు. బాపూ యీ సిద్ధాంతమునకే నేనొక వైజ్ఞానిక రూపము నిచ్చియున్నాను. దానినిక్కడ క్లుప్తముగా చెప్పెదను.

లిపులు రెండురకములుగా ఉన్నది. చిత్రలిపి, అక్షర లిపి. చిత్రలిపి సూటిగా ఉండును. కనిపించిన ఆకృతికి ప్రతి కృతిని దించుటే చిత్రలిపిపని. ఎవరైనా కుర్చీని గాని, కుండనుగాని, లేక మామిడిపండును గాని చూచి, ఉన్నదున్నట్లు దాని ఆకృతిని దించుట చిత్రలిపిపని.

అక్షరలిపి పని జటిలమైనది, బరువైనది. ఏదైనా వస్తువునకు మనము పేరు పెట్టుదుము. కంఠమునుండి వచ్చు ధ్వనిద్వారా దాని పేరును వ్యక్తము చేయుదుము. అంతట మనస్సు ఆ వస్తువు ఆకృతిని తెలిసికొనును. ఈ ధ్వనిని

ఏదైనా ఆకృతిద్వారా వ్యక్తము చేయుటే అక్షరలిపి. దీనిని సర్ప విద్య* యనియే యనవలెను.

చిన్నపిల్లలకు ఆకృతులను చూచి ఆకృతులను వ్రాయుట చాల సులభము. అందుచేత వారికి ముందర చిత్రలిపి, తర్వాత అక్షరలిపి నేర్పవలెను.

విద్యాప్రారంభము అక్షరములద్వారా చేయక నిరీక్షణ (చూచుట), పరీక్షణ (పరిశీలించుట), ప్రయోగము, రచన మొదలైన వాటిద్వారా చేయవలెను. పార్థివ (భూమికి సంబంధించిన) వస్తువులను వ్యక్తము చేయుటకు చిత్రలిపిని నేర్పవలెను. ఒకటి రెండు సంవత్సరముల అట్టి శిక్షణ తర్వాత అక్షర జ్ఞానము కలిగించినట్లయితే శిక్షణ యథాయోగ్యముగా ఉండగలదు.

చిత్రలిపి నేర్చుకొనుటవల్ల చేతివ్రేళ్ళు, పూర్తిగా వశంలోనికి వచ్చును. అప్పుడు మనస్సులోనున్న ఆకృతిని బోలు ఆకృతులు వ్రేళ్ళద్వారా రూపొందును. దాని తర్వాత వ్రాయుటలో అక్షరములు ముత్యములవలె సుందరముగా వచ్చును.

---

*సర్పవిద్య : పాములకు చెవులుండవని చెప్పుదురు. అవి కండ్ల ద్వారానే వినును. ఒకే యింద్రియము ద్వారా రెండేసి పనులను మనము కూడ చేయుదుము. ఉదా: నాలుకద్వారా రుచిచూచుట, మాట్లాడుట. అటు వంటప్పుడు పాము కండ్లద్వారా వినునంటే ఆశ్చర్యము లేదు. అందు కనియే అక్షరముల మూలమున కన్నులద్వారా ధ్వనిని గ్రహించుట వల్ల దీని సర్పవిద్య యన్నాను. చదువుట_ కండ్లద్వారా వినుట..

# 59

మేము దక్షిణ దేశ పర్యటనలో నుంటిమి. స్థానము జ్ఞాపకము లేదు. బహుశః బెంగుళూరు కావచ్చును. బాపు తనగదిలో ఏదోపని చేయుచుండెను. ఆయన దర్శనాభిలాషులు వచ్చిపోవు చుండిరి. ఇంతలో ఒక సజ్జనుడు క్రొత్తగా పెండ్లయిన దంపతులను తీసికొని వచ్చెను. ఇద్దరి దుస్తులు ధనవంతుల దుస్తులవలెనుండెను. క్రొత్తగా పెండ్లయిన వాళ్ళ బట్టలు కొంచెము ఖరీదైనవై మెరుస్తూ ఉండటం సహజం. కాని వీరివాటిలో కొంచెం విశేషమున్నది. తీసికొనివచ్చిన సజ్జనుడు, "మహాత్మాజీ నేడే వీరి పెండ్లయినది. మీ ఆశీర్వాదము కొరకు వచ్చినారు." అని చెప్పెను. బాపు వారిద్దరిని తన ముందర కూర్చుండబెట్టుకొని, "అయితే ఆశీర్వాదము ఊరికే దొరకదు. హరిజనుల కొరకు ఏమైనా తెచ్చినారా? పెండ్లిలో పురోహితులకు బాగా దక్షిణయిచ్చి ఉండవచ్చు. హరిజనులకు ఏమైనా యిచ్చారా? హరిజనులకు ఎగగొట్టుట జరుగరాదు. ఇయ్యి. కొంతదక్షిణ ఇయ్యి. అప్పుడు ఆశీర్వాదము లభించగలదు." అని చెప్పెను.

క్రొత్తగా పెండ్లయిన దంపతు లెట్లు మాట్లాడగలరు? తీసికొనివచ్చిన సజ్జనుని వైపు యిద్దరూ చూడసాగిరి.

అప్పుడా సజ్జనుడు, "మహాత్మాజీ, మీ రన్నది సరే. కాని యీ నవయువకుడు యం. సి. రాజాకొడుకు (యం.సి.

రాజా స్వయం హరిజనుడు. దక్షిణ దేశములోని హరిజనుల ప్రధాన నాయకుడు) ఈమె ఆయన కుమారుని వధువు.'' అని చెప్పెను.

బాపు పెద్దగా నవ్వి, "అయితే మీకే పన్ను ఉండదు." అనెను.

అప్పుడు నేను మనస్సులో "చిత్రము జరిగినది. కాని యీ హరిజన నవదంపతులకు బాపు మనస్సులో వాళ్ళ జాతిపట్ల ఎంత ప్రేమ ఉన్నదో గ్రహించి యుండు''రని అనుకొంటిని.

# 60

బహుశః 1933 నాటి సంగతి కావచ్చును. బాపు హరిజన పర్యటనలోని ఆఖరిదినము. బాపు సింధు వెళ్లి యుండెను. నేనప్పుడే హైదరాబాదు జైలునుండి విడుదలైతిని. అందుచేత ఆయనతో చేరిపోతిని.

చూస్తే బాపు పాదములమీద చాల గాయములుండెను. వాటినుండి రక్తము వచ్చుచుండెను. ఇదేమిటని యడిగినప్పుడు, అవి మహాత్ముని చరణస్పర్శ వల్ల పవిత్రులు కాగోరు భక్తుల చేతిగోళ్ల చిహ్నములని తెలిసినది. మనుష్యుల యీ భక్తిని చూచి నాకు విచారము కలుగసాగినది. మనుష్యుడు యింకెవరినైనా కష్టపెట్టినచో నరకమునకు పోవును. కాని మహాత్ముడన్నచో ప్రజలందరూ భోగించు వస్తువు కదా! జీసస్ క్రైస్తును యీ విధముగానే

శిలువపై నెక్కించి గదా ప్రపంచము ఆయనపట్ల తన ప్రేమను చూపించినది. అట్లు మహాత్ముల చరణస్పర్శ గావించువారలకు స్వర్గమునకు సూటిగా టిక్కెట్టుదొరకును.

ఆ రోజు రాత్రి నేను వేడినీటితో బాపు పాదములను కడిగితిని. వేసలీన్ వ్రాసితిని. రెండవరోజు నుండి నేను స్వాయముగా నియుక్తుడనైన చరణసేవకుడినే గాదు, చరణ రక్షకుడుగ కూడ నైతిని. ఈ సేవకు బదులు ప్రజలనుండి తిట్లరూపమున పూర్తి బహుమతి లభించుచుండెడిది.

## 61

సింధునుండి మేము లాహోరు చేరుకొంటిమి. అక్కడ అనార్కలీలో సర్వెంట్స్ ఆఫ్ పీపుల్స్ సొసైటీ (ప్రజాసేవకుల సంఘు) భవనంలో దిగితిమి. మహాత్ముని ఆరోగ్యము సరిగా లేదని, పర్యటనలో కూడ చాల బాధ కలిగినదని ప్రఖ్యాతుడైన అక్కడి డాక్టరునకొకనికి కబురు తెలిసెను. వెంటనే ఆయన బాపూను చూచుటకు వచ్చెను. "మహాత్మాజీ! మిమ్ము నేను వైద్యపరీక్ష చేయగోర్తాను." అని అనెను. దానికి బాపూ, "మంచిది. మీరు చేయవచ్చు. కాని నేనంత జబ్బుగా లేను." అని చెప్పెను. దానికి డాక్టరు భక్తిభరితమైన స్వరముతో, "మిమ్ము పరీక్షచేసిన గాని మాకు తృప్తి కలుగదు." అని పలికెను. అంతట బాపు, "తృప్తిపడగోరినట్లయితే సరే. నా ఫీజు నియ్యనిదే నన్ను ఎవ్వరిని పరీక్ష చేయనీయను. ఎంతమందో నన్ను

కలియుటకు ఎదురు చూచుచున్నారు. మీ కొరకు నేను ఊరికే సమయము నెందుకు వెచ్చించవలెను?" అని అనెను.

అంతట నా డాక్టరు తన జేబునుండి రు 13_00 తీసి బాపూముందర పెట్టి "ఇక్కడకు వచ్చుటకు ముందు ఒక రోగిని చూచుటకు వెళ్ళితిని. అక్కడ నాకు లభించినదంతా మీ ముందర పెట్టితిని" అనెను. బాపు ప్రసన్నతాపూర్వక ముగ ఆ పైకమును తీసికొని హరిజన నిధికి జమకట్టుకొనెను.

లాహోరు వదలునప్పుడు అక్కడి పత్రికా ప్రతి నిధులు సమయ మడిగిరి. వారందరు కలిసివచ్చిరి. ఇక్కడ కూడ బాపు తనకు ఫీజు యియ్యవలెనని షరతుపెట్టెను. పెద్దపులికి రక్తపు రుచి తగిలినది. పత్రికా ప్రతినిధులు అక్కడే కొంత డబ్బు వసూలుచేసి అర్పించిరి. బాపూ, వారుకూడ ప్రసన్నులైరి. పత్రికాప్రతినిధులకు పత్రికలకు సమాచారము కావాలి. వారికి దానితోపాటు యీ కథకూడ లభించింది.

# 62

చంపారన్‌నుండి ఒకరోజున బాపు ఉత్తరము వచ్చి నది. ఆ రోజులలో మా ఆశ్రమము కోచరబ్ లోని ఒక అద్దె యింట్లో ఉండెను. ఉత్తరములో, "అక్కడ యిప్పుడు వానలు మొదలై ఉండవచ్చు. ఇప్పుడు గాలివీచు దిక్కు కూడ మారిపోవును. అందుచేత నేటివరకు ఏ గోతులలో పాయఖానా డబ్బాలను ఖాళీ చేయుచున్నారో – అక్కడ

యికముందు ఖాళీచేయవద్దు. చేసినచో అక్కడి నుండి దుర్వాసన వచ్చే అవకాశమున్నది. అందుచేత పాతగోతులను పూడ్చివేసి ఫలానా స్థలములో క్రొత్త గోతులను త్రవ్వవలెను.'' అని వ్రాసెను.

ఈ ఉత్తరమును చూచి నేను చాల ఆశ్చర్యపడితిని. బాపు చంపారన్‌లో విచారణ పని సాగిస్తూకూడ ఆశ్రమమునకు సంబంధించిన యిట్టి చిన్న విషయములను గురించి కూడా శ్రద్ధవహించుటను చూచినప్పుడు నాకు నెపోలియన్ చెప్పిన విషయ మొకటి జ్ఞాపకము వచ్చినది. చిన్నచిన్న విషయములకు సంబంధించిన వివరములను ఆలోచించుకొని వాటికి తగిన ఉపాయములను కనిపెట్టి తగిన ఏర్పాట్లు చేసికొని యుండువాడు. యుద్ధములో సదా విజయు డగునని ఆతడు చెప్పియుండెను. దీనితోపాటు డాక్టరు మార్టినో వచనముకూడ జ్ఞాపకమునకు వచ్చెను. Trifles make perfection and perfection is not a trifle. (చిన్న చిన్న విషయములు కలిసి పూర్ణత్వమును పొందును. అయితే పూర్ణత్వము చిన్న విషయము కాదు.)

## 63

మహాదేవభాయి, నరహరిభాయిల మధ్య దృఢమైన స్నేహముండినది. ఆశ్రమము ప్రారంభదినములలో మహాదేవభాయి ఎక్కడినుండో బాపు తనను ఫలానా ఫలానా పనులలో ఎప్పటికీ అట్టిపెట్టగోరుచున్నా''డని నరహరి

భాయికి ఒక ఉత్తరములో వ్రాసియుండెను. దానికి నరహరి భాయి పరిహాసపూర్వకముగా "ముసలివాడు చాల చతురుడు. ఒకసారి ఆయన చేతిలో చిక్కుకొన్నచో తప్పించుకొనుటకల్ల" అని జవాబు వ్రాసెను.

సాధారణముగా బాపూ యితరుల ఉత్తరములను చదువడు. కాని ఆరోజున ఉత్తరములన్ని బాపూ చేతిలోనికి పోయినవి. ఆశ్రమమునుండి మహాదేవు పేర ఉత్తరము, నరహరిభాయి వ్రాత, దానిలో ఆశ్రమమునకు సంబంధించిన కబుర్లుండవచ్చుననుకొని బాపూ ఆ ఉత్తరమును తెరచెను. దానిని చదివి చాల దుఃఖితుడయ్యెను. ఆయన నరహరిభాయికి, "అకస్మాత్తుగా నీ ఉత్తరమును నేను చదివినాను. జీవితములో యిన్ని సంవత్సరములు గడచిపోయినవి. ఈ ముసలితనములో మిమ్ము మోసముచేయవలసినంత స్వార్థము నాకేమున్నది?" అని జాబు వ్రాసెను.

ఈ ఉత్తరము రాగానే పాపము నరహరిభాయి ఖిన్నుడైనాడు. ఆయన ఖంగారుపడి పరుగెత్తుకొని నా దగ్గరకు వచ్చెను. జరిగినకథ సాంతంచెప్పి బాపూ ఉత్తరమును నాచేతిలో పెట్టెను. "ఇప్పుడు ఏవిధముగా బాపూను క్షమాపణ అడగను?" అని అడుగసాగెను. నేనాతనికి ధైర్యముచెప్పి "క్షమాపణ, గిమాపణ మాటలు కట్టిపెట్టు. క్షమాపణ అడిగితే చచ్చిపోయినట్లే అనుకో. ఇట్టి సంకటములనుండి ఉపాయముగ బయటపడవలెను. బాపూనకు "మా ఉత్తరము మీరెందుకు చదివినారు? మంచిదైంది.

దానిలో యింత కంటె ఎక్కువేదీ వ్రాయలేదు. మా యువకుల ప్రపంచము వేరు. మిమ్ములను గురించి మేమేమి చెప్పుకుంటామో మీకు తెలియుటకిక్కడ వ్రాస్తున్నాను. ఇట్టి వినోదములవల్లనే మేము జీవించెదము. ఈ విధముగా మీపట్ల మాకుగల శ్రద్ధాభక్తులను వృద్ధిచేసికొందుము." అని వ్రాయమంటిని.

ఈ ఉత్తరమువల్ల మంచిఫలితము కలిగినది. బాపూ మమ్ములను బాగా అర్థము చేసికొనెను.

## 64

1930 లో బాపూతో కలిసి ఉండుటకు ప్రభుత్వ పక్షమున నేను సాబర్మతీ జైలునుండి యరవదా జైలుకు పంపబడితిని. బాపూ ఎప్పుడూ ఆహారముగా తీసికొనే పండ్లను తీసికొనకుండుట నేను చూచితిని. కమలా ఫలములు, ద్రాక్షపండ్లు ఆయన ఆరోగ్యమునకు అవసరము. కాని ఆయన ఆ రెంటిని తీసికొనుటలేదు. మేకపాలు, ఖర్జూరము, కొద్దిగ కిస్‌మిస్‌పండ్లు - ఉడకబెట్టిన కూరలు, యిది ఆయన ఆహారము. ఆయన ఆరోగ్యము పాడైపోవునేమోనని నాకు భయముగానుండెను. వెళ్ళుటముతోడనే కమలాఫలములను తీసికొన వలసినదని నేను పట్టుబట్టితిని. కాని ఆయన ఎందుకు ఒప్పుకొంటాడు?" నేను యిక్కడ స్టేటు ప్రిజనరునై కూర్చున్నాను. బైట ప్రజలు ఎన్నికష్టములు పడుచున్నారు? లాఠీఛార్జీలు జరుగుచున్నవి. అటిస్థితిలో

బజారునుండి ఖరీదైన యీ పండ్లను తెప్పించుటకు మనస్సు పుట్టుటలేదు." అని ఆయన వాదించెను.

నాకేమీ తోచలేదు. తన పట్టుదలను ఆయన వదలిపెట్టడు. ఆయన పండ్లుతినుటవసరము. అట్టిస్థితిలో ఏమిచేయవలెను? నేను జైలువాళ్ళనుండి అనేక రకముల కూరలను తెప్పించ మొదలుపెట్టితిని. వాటిని ఉడుకబెట్టుకొని మేమిద్దరము తినసాగితిమి. తర్వాత జైలుతోటనుండి టొమాటోలను తెప్పించితిని. ఆ టొమాటోలు కూర క్రిందకువచ్చును. పండ్ల క్రిందకు కూడవచ్చును. వీటివల్ల అవసరమైన విటమినులు (పోషకపదార్థములు) బాపూనకు దొరకునని నేను సంతోషించితిని. ఒకరోజున జైలుతోట నుండి నాకు పచ్చి బొప్పాయికాయ దొరకినది. దానిని కూడ నేను ఉడకబెట్టితిని. రెండవరోజున దొరకినది బొప్పాయపండు. నేను బాపూతో, "నేటి కూరను నేను వండనవసరములేదు. సూర్యనారాయణుడు పండించిపంపినాడు. అది బజారునుండికూడ రాలేదు. జైలుతోటలోనిది. అన్నిటికంటె చవుకయైనది." అంటిని.

నేను బొప్పాయిపండును ఆయనముందర పెట్టితిని. నా వాదన వినేటప్పటికి దీనిలో ఏదో నా ధూర్తత్వమున్న దని బాపు తలంచెను. కాని నా వాదనకు తిరుగులేకుండెను. అందుచేత బాపు బొప్పాయిపండును తినెను. బొప్పాయి పండు ఒకప్పుడు దొరకేది, ఒకప్పుడు దొరికేదికాదు.

అయినప్పటికిని ఏదో ఒక పండు ఆయన కడుపులోనికి పోతున్నందులకు నాకు సంతోషముగా నుండెడిది.

నా విషయమక్కడితో పూర్తియగుచున్నది. కాని దానికొక అనుబంధమును చేర్చుట ఉచితము.

రాజీ సంభాషణలకొరకు పండిత మోతీలాల్‌జీ, జవహరలాల్‌జీ, వల్లభభాయి వగైరాలను యరవదా జైలుకు తీసికొనివచ్చిరి. వారితో సింధుకు చెందిన జయరాందాస్‌జీకూడా ఉండెను. ఆయన నన్ను బాపు జైలు జీవితమునుగురించి అడిగెను. నేను ఆయనకు పై కథను కూడ చెప్పితిని.

జయరాందాస్‌జీ జైలునుండి విడుదలైన పిమ్మట ఆయన పత్రికలలో బాపు తన యెప్పటి ఫలహారమును తీసికొనుటలేదని వ్రాసెను. దానికి గాంధీజీ ఫలములను తింటున్నాడని ప్రభుత్వపక్షమునుండి జవాబు వెడలెను. అదిచూచి నాకు చాల కోపమువచ్చినది. కాని ఏమిచేయగలను? నేను జైలులో ఉంటిని.

ఆ కాలమునాటి మన భారతప్రభుత్వమట్టిది. ఏదో విధముగా శబ్దవైచిత్ర్యమును సాధించి, సూటిగా అబద్ధములు చెప్పి ప్రజలను తప్పుదారిపట్టించుట నాగరికత లేక సభ్యతయనుకొనేది.

## 65

ఈ విషయముకూడ పైనచెప్పిన సంగతులనాటిదే. ఆ రోజులలో జె. సి. కుమారప్ప 'యంగ్ ఇండియా'కు

సంపాదకుడుగా ఉండెను. జైలులో మాకు 'యంగ్ ఇండియా' లభిస్తూఉండేది. ప్రభుత్వము దానిని జప్తు చేసిన తర్వాత కుమారప్ప దానిని సైక్లోస్టైల్ మీాదనో, టైపురైటరుమీాదనో ప్రకటింపసాగిన పిమ్మట ప్రభుత్వము వారి అజాగ్రత్తవలన దానివికూడ రెండుమూడు సంచికలు మా దగ్గరకు వచ్చినవి. కాని తర్వాత అది వచ్చుట ఆగిపోయెను.

ఈ వచ్చిన సంచికలలోనే కొంతమందిని అరెస్టు చేసి జైలులో పెట్టిన తర్వాత వారిమీాద లాఠీచార్జి చేయుబడినట్లు వార్త ఉండెను.

అది చదువుచునే బాపు వ్యాకులపాటు చెందెను. ముంగిలిలో సాయంకాలము అటునిటు తిరుగుతూ, "దీనిని నేను సహింపజాలను. నేను వైస్రాయికి ఒక ఉత్తరము వ్రాసి ఉపవాసము చేయగోరెదను." అని ఆయన అనెను. ఎన్నిరోజులవరకని నేనడిగినప్పుడు, "దినముల ప్రశ్న కాదు. దీనినంతా నేను కొంచెమైనా భరింపజాలకున్నాను." అని చెప్పసాగెను.

నాకు దిక్కుతోచలేదు. ఆయన యీా ఆలోచన నాకు నచ్చలేదు. అందుచేత నేను, "బాపూజీ! మీారు చేసికొను నిశ్చయమేదైనా దానికి విరుద్ధముగా మాట్లాడుటకు నాకు ధైర్యముగాని, కోరికగాని లేదు. కాని మీారేదైన నిశ్చయము చేసికొనుటకు ముందు నా దృష్టి కోణ

మును మీ ముందుంచుటకు అనుమతించ గోరెదను. నేను మోహావశుడనై అట్టి కార్యమునుండి నివృత్తుల గావించుటకు ప్రయత్నము చేయుచున్నానని మీరనుకొనరని నా అభిప్రాయము. రక్తము కార్చనిదే దేశము బలయుతము కాదనియే నేను చెప్పగోరునది. 1857 సంవత్సరపు విప్లవము తర్వాత రాజకీయములవల్ల మనము చాల తక్కువ దెబ్బలు తిన్నాము. స్వాతంత్ర్య యుద్ధములో తలలు పగులును. గుండ్లు తగులును. ఈ విషయములన్నీ మనము పూర్తిగ మరచిపోయినాము. అందుచేత యివి మనముందర పెను భూతములైనవి. ఈ లాఠీలు తిని బలిష్ఠ మొనర్చుచున్నవి. మన మెవ్వరినీ కొట్టము. మన రక్తమే కారుట సరిగాదా? ఎర్రరంగు చూచుటకు మన కలవాటగుచున్నది. ఇదేగాక యింకొకమాట. నేడు జాతి మీ ఆధారముమీదనే శక్తినంతను కూడతీసుకొనుచున్నది. మీ బలిదానమువల్ల యీ సమయమున స్వాతంత్ర్య కాంక్ష ఉన్మాదమువరకు వృద్ధి పొందినచో - ఆ బలిదానమునకు కూడ నేను స్వాగతమిచ్చెదను. కాని జాతి నేడు స్వశక్తిపై గాక మీ యొక్కరి శక్తి మీదనే ఆధారపడియున్నది. అటువంటప్పుడు యీ సమయములో మీ దేహాంతం జరిగినపక్షంలో జాతి యంతా నిస్సహాయమై కూలబడిపోతుంది. అందువలన జరుగుదానినంతను సహించి మేము - మా రక్తము కార్చుటకు అవకాశ మియ్యవలెను.” అని చెప్పితిని.

నేను చెప్పినదానివల్ల ఏమి ప్రభావము కలిగినదో నాకు తెలియదు. కాని బాపు గంభీరుడై పోయెను. ఏమీ మాట్లాడలేదు. దీని తర్వాత ఆయన ఉపవాసము సంగతి ఎత్తలేదు.

# 66

ఆ రోజులనాటి మాటే. బాపు బరువు కొంచెము తగ్గిపోయినది. అంతట నేను, "బాపూజీ! మీరు మీ ఆరోగ్య విషయం కొంచెం ఉపేక్ష చేయుచున్నారు. శ్రమ కూడ ఎక్కువ పడుతున్నారు" అని అంటిని. దానికి జవాబుగా, "కాకా! అది సరికాదు. నా మీద ఏదీ ఆధారపడి లేదని నే నెరుగుదును. అంతా ఆయనమీదనే ఆధారపడి ఉన్నది. లేదా మన అందరి బరువు ఆయనమీదనే ఉన్నది. కాని లోకులు అంతా నా మీదనే ఆధారపడి ఉన్నదను కొందురు. అందుచేత ఏ విధముగా గర్భిణియైన తల్లి తన గర్భములో నున్న శిశువుకొరకు తన ఆరోగ్యం విషయమై అతి జాగ్రత్త వహించునో అదేవిధముగా ఏ స్వరాజ్యము నా గర్భములో ఉన్నదనుకొనుచున్నారో దానికొరకు నా ఆరోగ్యం విషయమై నేను జాగ్రత్తగా ఉంటున్నాను." అని బాపు చెప్పెను.

# 67

కొన్నిరోజుల తర్వాత బాపు సాయంకాలపు షికారు కాలమును హెచ్చించెను. అప్పుడు నేను, "ఏమి బాపూజీ!

మొదట మీరు అరగంటే తిరిగెడివారు. ఇప్పుడు దాదాపు ఒకగంట తిరుగుట మొదలుపెట్టినారు. ఇప్పుడు ఉదయం కూడా చాలసేపు తిరుగుచున్నారు. దీనివల్ల మీ ఆరోగ్యం చెడిపోవునేమో ?" అని అంటిని. దానికి బాపూ, "నాకు లోపలనుండి ఎక్కువ శక్తి వచ్చినట్లనిపించుచున్నది. అందు చేత తెలిసియే నేను తిరుగు కాలమును హెచ్చించినాను. తిరుగుట బ్రహ్మచర్య వ్రతపాలనలో ఒక అంశము" అని జవాబు చెప్పెను. ఇదెట్లాగని నే నడిగినప్పుడు ఆయన "మని షికి పగలంతా పనిచేయుటకు ఉదయం లభించు శక్తిని ఆతడు పడుకొనే సమయములోపల ఖర్చుపెట్టవలెను. ఇది అపరిగ్రహము యొక్క లక్షణము. పూర్తిశక్తిని శ్రద్ధా పూర్వకముగ ఖర్చుచేయని యెడల మిగిలిన శక్తి వికార ముల రూపము పొందును. మనకు రోజున కవసరమైన శక్తి లభించునప్పుడు యీనాటి శక్తిని రేపటి కెందుకు మిగుల్చు కొనవలెను ? శరీరములో పుట్టుకొనివచ్చు వీర్యమును పరి శ్రమ ద్వారా చెమట క్రింద రూపాంతరము పొందునట్లు చేసి నచో రాత్రికి నిద్ర బాగా పట్టును. వికారములు కలుగుటకు తక్కువ అవకాశముండును. అందుచేత అపరిగ్రహ దృష్టి తోను, బ్రహ్మచర్య దృష్టితోను పూర్తిగా పరిశ్రమ చేయనేవలెను" అని చెప్పి, కొంచెమాగి మరల యిట్లనెను "దక్షిణాఫ్రికాలో 40 మైళ్ళు తిరుగుశక్తి నాలో ఉన్నంత కాలము ఎన్నడును 39 మైళ్ళే తిరుగలేదు. కావలసినంత తినెడివాడను. బాగా పరిశ్రమ చేసెడివాడను."

ఒకరోజున ఆశ్రమములో చెప్పసాగెను. "కేవలము అపరిగ్రహ వ్రతమునే దృష్టిలో పెట్టుకొన్నచో మనిషి సాదా జీవితము గడుపవలెనని దాని కర్థముకాదు. మనము ఎక్కువ పరిగ్రహణము – అనగా ధనసంచయము చేయువారము. మనతో పోల్చినచో తెల్లవారు చాల అపరిగ్రాహులు. రు 500 సంపాదించినను నెలాఖరునకు దానినంతా ఖర్చు చేసివైచెదరు. నా ముందు గతేమి? నా పిల్లల గతియేమి? అనునట్టి చింత వారికుండదు. అట్టి చింతయుండుట శుద్ధ నాస్తికత. మన పిల్లలు మనకంటె తక్కువ పురుషార్థులు లేక ప్రయోజకులు కాగలరని మన మెందుకనుకొనవలెను? పిల్లలకొరకు ధనము కూర్చియుంచుట, వారిపట్ల అశ్రద్ధ చూపుటే. వారిని చెడగొట్టుటే, లాహోరులోని బారిష్టరు సంతానం కూడ యిదే మతమువాడు. పిల్లలకొరకు ధనమునుకూర్చి వదలిపెట్టుట వారిపట్ల అన్యాయము చేయుట యని ఆయన నోట ఒకరోజు వినియుంటిని.

## 68

ఆశ్రమముయొక్క ఆరంభదినాల నాటి విషయము. బాపు దగ్గరకు ఒక జ్యోతిష్కుడు తరచు వచ్చుచుండెడివాడు. ఆయన పేరు గిరిజాశంకర్ అని జ్ఞాపకం. ఆయనతో ఒకరోజున బాపూ, "మీరు నియమము ప్రకారము వచ్చుచున్నప్పుడు ఆశ్రమములోని పిల్లలకు సంస్కృతము నేల నేర్పరాదు." అని అనగా ఆయన సంస్కృతము చెప్పుట మొదలుపెట్టెను.

ఆయన మంచి జ్యోతిష్కుడు. అహమ్మదాబాదు లోని అనేకమంది ధనికులకు ఆయనమీద విశ్వాసముండెను. సోమాలాల్ అనే ఒక ధనికునకు బాపూనకు కొంచెము దాన మివ్వవలెనని కోరిక కలిగెను. నాకు జ్ఞాపకమున్నంత వరకు ఆయన 40 వేల రూపాయలను జ్యోతిష్కునిద్వారా జాతీయ పాఠశాల భవన నిర్మాణమునకై పంపించెను. ఆ రోజులలో మేము వాడజ్ లో డేరాలలోను, తడికెల గుడిసెలలోను నివసించుచుంటిమి. భవన నిర్మాణమునకై ఆలోచించుటకుముందే అహమ్మదాబాదులో ఇన్ ఫ్లుయంజా వచ్చినది. రోజుకు వంద, రెండువందల మనుష్యులు మర ణింపసాగిరి. పెద్దపెట్టున హాహాకారములు కొనసాగినవి.

బాపు జ్యోతిష్కునితో, "ఈ సంవత్సరము మేము ఇండ్లు కట్టము. పాఠశాల భవన నిర్మాణముకూడ జరుగదు. అందుచేత సోమాలాల్ భాయి యిచ్చిన రూపాయలను తిరిగి తీసికొని వెళ్ళండి" అని చెప్పెను. దానికా జ్యోతిష్కుడు, "ఆయన డబ్బు అడుగ లేదు కదా !" అని అనెను. అప్పుడు బాపు, "అయిన నేమి ? ఏ పనికొరకు ఆయన ధనము నిచ్చెనో ఆ పని యిప్పుడప్పుడే జరుగుట లేదు. అటువంట ప్పుడు యీ డబ్బును ఎందుకు పెట్టుకొనవలెను ? మేము యింకొకరి డబ్బును జాగ్రత్తపెట్టుట కిక్కడ కూర్చొనలేదు గదా ?" అని బాపు అనెను. అంతట ఆ జ్యోతుష్కుడు "ఇప్పుడు కాకపోతే ముందెప్పుడైనా ఛాత్రాలయ నిర్మా ణము జరుగును గదా ? అప్పుడు డబ్బు అవసరముండును

గదా!" అని అనెను. దానికి బాపు "ఎందుకు అవసర ముండదు? కాని ఈ భవననిర్మాణ సమయము వచ్చినప్పుడు యీ సోదరుడు కాకపోతే యింకొక రెవ్వరైనా యిచ్చే వారు దొరకగలదు." అని జవాబు చెప్పెను. జ్యోతిష్యుడు వెళ్ళి దాతకు జరిగినదంతా వినిపించెను. దాని కతడు, "ఒక్కసారి యిచ్చిన దానిని నేను తిరిగి తీసికొనను." అనెను.

## 69

మండాలేనుండి తిరిగివచ్చిన పిమ్మట లోకమాన్య తిలక్ కాంగ్రెస్‌లో తిరిగి చేరుటకు నిశ్చయించుకొనెను. ఆయన బెల్గాం ప్రాంతీయ రాజకీయ మహాసభలో తన పక్షము వారికి నచ్చజెప్పుటకు ప్రయత్నించెను. నా పట్టు దలవల్ల, శ్రీ గంగాధర దేశపాండే ఆహ్వానమువల్ల బాపు మహాసభకు వచ్చెను.

మేము లోకమాన్య తిలక్ అనుచరులము. కాని బాపు తేజస్సునకు, దేశభక్తికి, పవిత్రశీలమునకు మేము ముగ్ధుల మైతిమి. నేను హృదయములో ఆయన వాడనై గంగాధర రావును ఆయన దిక్కునకు లాగుటకు ప్రయత్నించు చుంటిని.

గాంధీ తిలకు లిద్దరు ఒకరి నొకరు తెలిసికొన్నచో దేశమునకు చాల లాభము కలుగునని మా నమ్మకము. లోకమాన్యుడు, బాపు పూర్తి ఏకాంతములో పర స్పరం కలుసు కొనునట్లు ఏర్పాటు చేయవలెనను కొంటిమి.

అయితే లోకమాన్యుని మకాములో ఈ కలయికకు అవకాశము లేనందున గంగాధరరావు బాపు నివాస స్థానమునకు లోకమాన్యుని తీసికొని వెళ్లెను. ఆయన నక్కడ వదలినపిమ్మట గంగాధరరావు స్వయముగా అక్కడనుండి వెళ్ళిపోయెను. అక్కడ వారిద్దరిమధ్య ఏమి సంభాషణ జరిగెనో అది మాకు తర్వాత కూడ తెలియలేదు. గది బయటకు వచ్చి గంగాధరరావుతో "ఈ మనిషి మనవాడు కాడు. ఈయన మార్గము భిన్నమైనది. కాని ఈయన పూర్తిగా సత్యవంతుడు. ఈయన చేతలవల్ల భారతదేశమున కెన్నడూ నష్టము జరుగబోదు. ఈయనతో మన కెక్కడను విరోధము రాకుండునట్లు మనము సావధానులమై యుండవలెను. వీలైనంతవరకు మన మీయనకు సహాయము చేయవలెను." అని లోకమాన్యుడు చెప్పెను.

ఆ మహాసభలో తన ఉపన్యాసములో మీరు కాంగ్రెసులో మరల ప్రవేశించుచున్నారు. ఇది మంచి సంగతి. కాని దానిలో మీరు సిపాయీలవలె రావలెను. వకీళ్ళవలె కాదు." అని బాపు చెప్పెను.

రెండవరోజుననో మూడవరోజుననో బెల్గాం నాయకుడు వకీలు నగు శ్రీ బెల్వీ ఏదో పనిమీద అక్కడి కలెక్టరు వద్దకు వెళ్ళెను. అప్పుడా కలెక్టరు ఆయనతో, "మీరు బారిష్టరు గాంధీని పిలిచారు గదా! ఆయన మీకు చేసు మాటలు వినిపించినట్లు విన్నాము. ఈ మనిషిని ఎందుకు పిలిచామా!" అని మీ కనిపించి యుండవచ్చు." అనెను

దానిపై శ్రీ బెల్వీ "మీరు మా భారతీయుల స్వభావమును గుర్తించలేరు. గాంధీజీ మాకు పూజ్యుడైన వ్యక్తి. మాకు సలహాలిచ్చుటకు ఆయన కధికారమున్నది. మేము ఆదరభావముతో ఆయన ఉపదేశమును విన్నాము. ఆయనను మే మెంత ఆదరించెదమో మీకు తెలుస్తుంది." అని జవాబు చెప్పెను. పాపమా కలెక్టరు నిరుత్తరుడైనాడు.

# 70

అవి మా ఆశ్రమము డేరాలలో ఉండేరోజులు. అహమ్మదాబాదులోని మితవాదనాయకుడు సర్ రమణభాయి నీలకంఠ్ బాపుతో కలియుటకు వచ్చెను. వారి సంభాషణలో ఆయన బాపును, మహారాష్ట్ర విషయము, తిలక్ విషయము మీ అభిప్రాయ మేమిటి" అని అడిగెను. దానికి బాపు "తిలక్ మహారాజ్ చాల కుశలుడగు రాజనీతిజ్ఞుడు. ఈ హోమ్‌రూల్ లీగ్ యొక్క అడుగులనే చూడండి తిలక్ పాచికలు ఎంత సరిగా పడినవో చూడండి. ఇక మహారాష్ట్ర సంగతా? దాని విషయ మేమిచెప్పను? ఎక్కడ తిలక్ వంటి వారున్నారో, ఎక్కడ దేశసేవ కొరకు జీవితము లర్పించే ఉజ్వల పరంపర కొనసాగి వచ్చుచున్నదో దాని విషయమేమి చెప్పవలెను? అక్కడి వారు ప్రారంభించిన కార్యమును పూర్తిచేసియే తీరెదరు." అని చెప్పెను.

ఇంకెవరితోనో మాట్లాడుచు బాపు, "నేను నా అహింసా విషయము మహారాష్ట్రకు నచ్చచెప్ప గలిగిన చో

ముందుసంగతి విషయమై చింతింపవలసిన అవసరముండ బోదు. సుఖముగా నిద్రపోగలను. ఆ ప్రాంతములో అంత కార్యశక్తి గలదు. కాని ఏమి చేయగలను? మహా రాష్ట్రిలో శ్రద్ధ లోపించినది.''అని చెప్పియుండెను.

## 71

మేము ఆశ్రమములో శివాజీ ఉత్సవము చేసితిమి. శ్రీ నారాయణరావు ఖరేగారు భజన కీర్తనలు పాడిరి. శ్రీ వినోబా, నేను ఉపన్యసించితిమి. మా ఉపన్యాసములలో శివాజీని గురించి, రామదాసు, తుకారామ్, మోరోపంత్ మొదలైన భక్తులు, కవులు చెప్పిన విషయముల ప్రసక్తి యుండెను. చారిత్రిక విషయములుకూడ చాల ఉండెను.

అంతమున బాపును రెండుమాటలు మాట్లాడమని కోరితిమి. అంతట బాపు, "చరిత్ర చెప్పు దాని విషయమై నేను పట్టించుకొనగోరను. భక్తులమాటల మీద నే నాకు శ్రద్ధ. భక్తులు శివాజీ జనకుడులాంటి వాడని చెప్పి నచో, ధర్మావతారుడని నమ్మినచో అదినాకు చాలు. ఇంతకంటె అధిక ప్రమాణము లవసరము లేదు." అని చెప్పెను.

## 72

బాపు ఆశ్రమము స్థాపించుకొని గుజరాతులో ఉండ టము మొదలుపెట్టినప్పుడు ఆయన తన రాజకీయ గురు వైన గోఖలే సాహిత్యానికి గుజరాతీ అనువాదము చేయిం

చుట స్వాభావికమైన విషయమే. విద్యను గురించి గోఖలే వ్రాసిన లేఖలు ఉపన్యాసములుగల స్వతంత్రమైన ఒక సంపుటమును ప్రకటించుటకు నిర్ణయం జరిగినది. ప్రసిద్ధికెక్కిన ఒక విద్యావేత్త కాపని అప్పగింప బడెను. అనువాద మచ్చువేయబడి ప్రస్తావన వ్రాయుటకు అచ్చువేయబడిన ఫారములు బాపు దగ్గరకు వచ్చినవి. వాటి నన్నిటిని చూచుటకు బాపు మహాదేవభాయి నప్పగించెను. మహాదేవభాయి బాపు దగ్గర క్రొత్తగ కార్యదర్శిగా చేరిన రోజులవి.

అనువాదము మహాదేవభాయికి తృప్తికరముగ లేదు. ఆయన బాపుతో "అనువాదము సరిగాలేదు. భాష సరిగాలేదు." అని చెప్పెను.

అభిప్రాయము చెప్పినంతమాత్రమున బాపు సంతుష్టి చెందడు. దానికి నిదర్శనము అడుగుతాడు. ఆయన ముందర అభియోగము చేయువాడు (వాది) కూడా అభియుక్తుడై (ప్రతివాదియై) పోవును. నేరము మోపినవాడు కూడా నేరస్థు డయిపోవును. మహాదేవభాయి కొన్ని ఉదాహరణలను చూపించెను. అంతట బాపు, "సరే నీ మాట నాకర్థమైంది. ఇక యీ అనువాదమును నరహరి కియ్యి. ఆయన అభిప్రాయము నాకు కావలెను." అని అనెను. పాపము మహాదేవభాయి అభిప్రాయము ప్రక్కకు త్రోసి వేయబడినది. అయితే ఆయనకు తన అభిప్రాయము

సరియైనదను నమ్మకమున్నది. అందుచేత యింకేమీ మాట్లాడలేదు.

నరహరిభాయిది కూడ అదే అభిప్రాయమయ్యెను. అప్పటికిని బాపునకు సంతృప్తి కలుగలేదు. ఆయన "ఇక యిప్పుడు కాకా అభిప్రాయము తీసికొనండి." అని అనెను.

ఆ రోజులలో నేను గుజరాతీ సరిగా మాట్లాడుట కూడ చేతకాక పోయెడిది. గుజరాతీ సాహిత్యముతో పరిచయము లేనట్లే. అయినప్పటికిని బాపు అనువాదము బాగున్నదో లేదో అను విషయములో నా అభిప్రాయము తీసికొన గోరుచున్నాడు. కాబట్టి నేను యింగ్లీషు మూలగ్రంథమును- అనువాదమును తీసికొని కూర్చుంటిని. ఈ విషయములో బాపు ముందర చెప్పవలసి ఉంటుందను భయముతో చాలా జాగ్రత్తగా ఎన్నో పుటలు చూచితిని. ఇంగ్లీషు వాక్యమునకు గుజరాతీ వాక్యము సరిగా అనువాదమగునో కాదో చూచితిని. దురదృష్టవంతుడైన అనువాదకుని అనువాదముపట్ల నాదికూడ అదే అభిప్రాయమైనది.

ముగ్గురి అభిప్రాయములు ఒక్కటే అయినప్పుడు బాపు "ఇక యిప్పుడు రెండవ మార్గమే లేదు. అచ్చు వేసిన దంతయు తగుల బెట్టవలెను. గుజరాతునకు నే నిట్టి కానుక నియ్యజాలను" అని నిర్ణయించెను.

గ్రంథము చాలా పెద్దది. ఎన్ని వేల ప్రతులు అచ్చు వేయబడినవో తెలియదు. అన్ని ప్రతులను తగులబెట్టవలె

నని బాపు ఆజ్ఞయైనది. చిత్తుకాగితాల క్రింద అమ్మోట కూడ నిషేధింపబడెను. పాపమూ అనువాదకునకు ఆయన ఏమి వ్రాసినాడో తెలియదు. ఈ విషయ మక్కడితో అంతమైనది.

ఆ అనువాదకుని మీద దీని ప్రభావమేమి పడినదో మాకు తెలియదు. కాని మేము ముగ్గురము చాల భయపడి పోతిమి. ఇక ముందర ఏమైనా వ్రాయవలసి వస్తే ఆలోచించి మరీ వ్రాయవలెనని తెలిసికొంటిమి. మూలమునకు తగినట్లు అనువాద ముండవలెను. అందుకు పయోగింప బడిన గుజరాతీ సరిగా ఉండవలెను. అనువాదము-భాష ఆదర్శమునుండి దిగజారరాదు. 'యంగ్ ఇండియా'లో వచ్చు బాపు వ్యాసములను గుజరాతీలో అనువాదము చేయు భారము మాపై పడినప్పుడు కడు జాగ్రత్తతో చేయవలసి వచ్చెడిది. మేము ఒకరితో ఒకరము సలహా సంప్రతింపులు జరుపుకొనెడి వారము. ప్రతిశబ్దమును భాషా ప్రయోగమును పరీక్షించెడి వారము. అనేక విధములుగ వాక్య రచనలు చేసి చూచుకొనెడి వారము. అప్పటికి కూడ బాపూనకు ఏదైనా శబ్దము నచ్చదేమో నన్న భయముండెడిది.

ఒకసారి బాపు వ్యాసమున కొక దానికి 'Death Dance' అని మకుట ముండెను. దానికి మే మనువాదము చేసితిమి. మా అనువాద మేమంత చెడుగాలేదు. కాని బాపూన కది నచ్చలేదు. మీ రేమని అనువాదము చేసెద

రని మే మాయనను అడిగినప్పుడు ఆయన పతంగ నృత్య మని (శలభ నృత్యమని) చేసెదనని చెప్పెను. బాపు సాహిత్యజ్ఞానము మా కంటె అధికము కానప్పటికిని మాటలను ఆయన సునిశితముగా ఉపయోగించ గలడు.

ఆ రోజులలో 'నవ జీవన్' లో స్వామి ఆనంద్, మహాదేవభాయి, నరహరిభాయి, నేను అనువాద కళలో ఆచార్యులుగా పరిగణింప బడెడి వారము. మాతో పాటు శ్రీ జుగత్ రామ్‌దవే, చంద్రశంకర్ శుక్ల, మిగతా యువ కులు కొందరు కూడ తయారైరి. 'నవ జీవన్' ప్రెస్‌లో యీ పరంపర నేటివరకు అఖండరూపములో కొనసాగి వచ్చుచున్నది. ఇంతే కాదు. బాపు పట్టుదలవల్ల గుజ రాతంతటా సాహిత్య ఆదర్శముపట్ల, అనువాద శుద్ధిపట్ల పట్టుదల చాలవరకు ఎక్కువైనది. దీనికి పూర్వము ఇంగ్లీషులోని వంగభాషలోని లేదా మరాఠీభాషలోని కఠిన శబ్దములన్నీ విడిచివేయ బడినట్టి, కొన్ని కఠిన వాక్య ములకు సగమే అర్థము వ్రాయబడినట్టి వందలకొలది గ్రంథములు గుజరాతీ భాషలో వెలువడి యుండెను.

## 73

ఒకరోజున మేము యరవదా జైలులో సాయంకా లము తిరుగుచుంటిమి. ఏదో సందర్భములో బాపు యిలా చెప్ప సాగెను. "ఏ విషయము వ్రాయవలసి వచ్చినను యిప్పుడు నాకు దానిపై వ్రాయుటలో ఆలస్యముండదు. నాకు సహాయ మవసరము లేదు. కాని దీనికొరకు నేను

సాధన చేయలేదని అర్థము కాదు. దక్షిణాఫ్రికాలో నా సహచరు లొకరు న్యాయశాస్త్ర పరీక్షకు కూర్చొనవలసి యుండెను. ఆయనకు దానికి కావలసినంత తీరుబడి లేదు. శక్తిలేదు. నేను అతని కొరకు డచ్‌లాకు నోట్సు తయారు చేసి రోజూ అతని యింటికి కాలినడకను వెళ్ళి అతనికి న్యాయశాస్త్రమును నేర్పెడివాడను. ఇక్కడ నా కేసులను యిదే విధముగా ఏదో పరీక్షకు కూర్చొనవలసిన వాడివలె తయారు చేసుకొని కోర్టుకు తీసికొని పోయెడి వాడను."

ఇంతకుపూర్వం శ్రీ మగన్‌లాల్‌భాయి నోటినుండి వినిన యీ క్రింది కథ నాకు జ్ఞాపకము వచ్చెను. దక్షిణాఫ్రికాలో ఒకసారి ఒక ముసల్మాను బట్లరు బాపు దగ్గరకువచ్చి తనకు యింగ్లీషు వచ్చియుండినచో మంచి జీతము దొరుకుననియు, యిప్పటి జీతము సరిపోవుటలేద నియు చెప్పెను. ఇక నేమున్నది. బాపు అతనికి ఇంగ్లీషు నేర్పుటకు సంసిద్ధుడయ్యెను. అప్పుడా బట్లరు, "మీరైతే సిద్ధమైనారు. ఇది మీదయ కాని నేను నౌకరిచేయనా లేక మీదగ్గరకు యింగ్లీషు నేర్చుకొనుటకు రానా?" అని ప్రశ్నించెను. దీనికి మార్గమును బాపు ఆలోచించి యుంచెను. రోజూ నాలుగుమైళ్ళు అతని యింటికి నడిచి వెళ్ళి అతనికి యింగ్లీషు నేర్పెను.

## 74

సంవత్సరము సరిగా జ్ఞాపకములేదు. నేను చించవడ నుండి తిరిగి వచ్చితిని. బాపు ఆత్మకథ నవజీవన్‌లో ఒక

ప్రకరణము తర్వాత యింకొకటి-చొప్పున ప్రకటింపబడు చుండెను. దానివిషయమై చర్చ మొదలైనది. నేను, "మీ ఆత్మకథ విశ్వసాహిత్యములో ఒక అద్వితీయ వస్తువుగా పరిగణింపబడగలదు. లోకులు యిప్పటినుండే దానికాస్థానమిచ్చుచున్నారు కాని దానివల్ల నాకు పూర్తి తృప్తి కలుగలేదు. యువావస్థలలో మనుష్యునకు తన దర్శమును నిర్ణయించుకొనవలసియుండును. తనకు ఏ పంథా లనుకూలముగనుండునో యను ఆలోచనలో ఆతడు పడి నప్పుడు అతని మనస్సులో జరుగు సంఘర్షణ మహాసంగ్రా మమునకేమీతక్కువకాదు. ఆ కాలములో పరస్పర విరుద్ధములైన ఆదర్శములుకూడ ఒకదానిని మించి యింకొకటి ఆకర్షణీయముగ కనుపించును. నేను మీ ఆత్మ కథలో అట్టి మనోమంథ్యమును చూడగోరితిని కాని అట్టి దేదీ నాకు కానిపించదు. ఇంగ్లీషువాళ్ళను దేశమునుండి పారద్రోలవలెనని మీరు మాంసముకూడ తినుటకు తయారైనారు. ఆ స్థితినుండి అహింసాస్థితికి మీరెట్లు చేరుకొన్నారు? ఆ చేరుకొనుటలో మీ మనస్సులో జరిగిన మథనను మీరు ఎక్కడను వ్రాయులేదు." అని అంటిని.

దీనిమీదట బాపూ, "నేను ఒకేమార్గము ననుస రించు మనిషిని. నా మనస్సులో అట్టి మంథన మేమీ జరుగదు. ఎటువంటి పరిస్థితులు నన్నెదుర్కొన్నను అప్పుడు నా కర్తవ్యమేమని మాత్రమే నేను ఆలోచింతును.

కర్తవ్యము నిశ్చయమైన తర్వాత దానిలో నేను లగ్నమై పోదును. ఇది నా పద్ధతి" అని జవాబిచ్చెను.

అప్పుడు మరల నేను రెండవ ప్రశ్నను అడిగితిని. "సామాన్య మానవులనుండి నేను కొంత వేరు మనిషినని నా జీవితమునకొక ఆశయం ఉన్నదని మీరెప్పటినుండి అనుకొనసాగిరి. మీరు హైస్కూలులో చదువుచున్నప్పుడు నేను నలుగురివంటివాడని, కాదని మీకెప్పుడైన అనిపించినదా?"

నా ప్రశ్న విషయమై బహుశః బాపూ ఆలోచించ లేదు. నిస్సందేహముగా హైస్కూలులో నేను నా క్లాసు పిల్లలకు నాయకుడుగా ఉండేవాడను." అని అనెను.

ఇంతలో ఎవ్వరో వచ్చిరి. మహత్వపూర్ణమైన యీ ప్రశ్న అట్లే ఉండిపోయినది.

## 75

ఆత్మకథ విషయమే నేను మరొకసారి చర్చించుచు "బాపూజీ ఆత్మకథను వ్రాయుటలో మీరు చాల పిసినారి తనం చేశారు. ఎన్నో మంచి విషయములను వదలిపెట్టి నారు. ఆత్మకథనుమీరెపట్టున పూర్తిచేశారో దానిముందు విషయములను మీరే బహుశః వ్రాయవచ్చు. దాని విషయము నేను మాట్లాడను. కాని మిగిలిపోయిన విషయము లనే వ్రాసినచో ఆత్మకథతో సమానమైన పెద్దగ్రంథ మింకొకటి తయారుకాగలదు." అని అన్నాను. దానికి

బాపు "అన్నివిషయములను నేనే వ్రాయవలెనని ఎక్కడున్నది? మీకు తెలిసినవిషయములను మీరు వ్రాయండి." అని అనెను.

నేను మరల నిట్లన్నాను. "అక్కడక్కడ మీరు బుద్ధిపూర్వకముగానే విషయములను వదలిపెట్టినారు. మీకు విరుద్ధములైన విషయములను మీరు చాల రుచితో వ్రాశారు. కాని యితరుల విషయములు వ్రాయలేదు. దక్షిణాఫ్రికాలో మీ యింట్లో ఉంటూ మీరు యింట్లో లేనప్పుడు మీ మిత్రుడు మీ యింటికి వేశ్యను తీసికొని వచ్చిన వర్ణన సరిగానే ఉన్నది. కాని అట్లుచేసిన యతడు హైస్కూలు దినములలో మీ చేత మాంసము తినిపించీ దానికొరకు మీ యింట్లో ఒక్కసారి మీచేత దొంగతనము చేయించిన ముసల్మానుడేనని మీరు వ్రాయలేదు."

దానికి బాపు "మీరు చెప్పినది సరిగానే ఉన్నది. బుద్ధిపూర్వకముగానే దానిని నేను వదలిపెట్టితిని. నాకు ఆత్మకథ వ్రాయవలసియుండెను. దానిలో యీ విషయము చెప్పుటవసరముకాదు. ఇంకొక విషయమేమంటే ఆ మనిషి యింకా జీవించియే యున్నాడు. కొంతమంది మా యిద్దరి మధ్య సంబంధమును ఎరుగుదురుకూడ. రెండు విషయములు ఒక వ్యక్తికే సంబంధించినవని తెలియుటవల్ల ఆతనిపట్ల వారి మనుష్యులలో ఆతడన్న అసహ్యము అధికము కావచ్చును." అని చెప్పెను.

ప్రతి మనుష్యుని యెడల బాపు మనస్సులో కారుణ్యభావమెంత ఉన్నదో చూడగా నాకొక పాతసంగతి జ్ఞాపకము వచ్చినది.

బెనారస్ యూనివర్సిటీలో బాపు యిచ్చిన ఉపన్యాసము తర్వాత పత్రికలలో బాపు అనీబిసెంటులగురించి చాల దీర్ఘమైన తీవ్రమైన చర్చ మొదలైంది. ఇదే సందర్భములో బొంబాయిలోని ఇండియన్ సోషల్ రిఫార్మరు పత్రికలో శ్రీ నటరాజన్ బాపూను గురించి Every ones honour is safe in his hands (బాపూవల్ల ఎవ్వరి గౌరవమునకు ఎట్టిభంగము కలుగదు.) అని వ్రాసెను.

బాపు శీలముయొక్క యీ అంశమును నటరాజన్ యొక్కడే యిట్టి సుందరశబ్దములలో వ్యక్తమొనర్చెను.

ఈ ప్రసంగముతోపాటు యింకొక ప్రసంగము జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

ప్రముఖుడైన ఒక ముసల్మాను కార్యకర్తవిషయమై మాట్లాడుచుంటిమి. నేను అతని ప్రజాహిత జీవితమునకు సంబంధించిన అనుచిత వ్యవహారమును ప్రస్తావించితిని. బాపు దుఃఖముతో, "అప్పటినుండి అతనంటే నా మనస్సులో పూర్వపు విలువలేదు. కాని దానివల్ల నేమగును? అతని కేమీ నష్టము కలుగబోదు. నా మనస్సులో ఎవరి విలువైనా తగ్గిననేమి హెచ్చిననేమి! నా ప్రేమ కొంచెమైనా తగ్గడిదా?" అని అనెను.

## 76

1926-1927 నాటిమాట. ఖాదీ పర్యటనమును పూర్తిచేసికొని బాపు ఒరిస్సాకు చేరెను. అక్కడ మేము ఈటామాటీయను గ్రామమునకు వెళ్ళితిమి. బాపు ఉపన్యస్థమైనది. పిమ్మట ప్రజలు తమకానుకలను చందాలను తీసికొనివచ్చిరి. ఒకడు గుమ్మడికాయ తెచ్చెను. ఇంకొకడు బిజౌరా తెచ్చెను. మరొకడు వంకాయలు ఇంకొకడు అడవికూరగాయలు తెచ్చిరి. కొందరు బీదవాండ్రు తమ గుడ్డపేలికలనుండితీసి కొన్ని పైసల నిచ్చిరి. సభలో తిరుగుతూ నేను డబ్బును ప్రోగుచేయుచుంటిని. పైసలకుబట్టిన కిలుము చేత నా చేతులు పచ్చబడి పోయినవి. నేను బాపునకు నా చేతులను చూపితిని. నేను మాట్లాడలేక పోతిని. మరుసటి రోజు ఉదయము బాపుతో షికారు బయలుదేరితిని. దారిని వదలిపెట్టి మేము పొలములలో తిరుగసాగితిమి. అప్పుడు బాపు "ఎంత దారిద్ర్యము, దైన్యముఉన్నవిక్కడ! ఈ ప్రజల కొరకు ఏమి చేయవలెను? నా మరణ ఘడియలలో ఒరిస్సాకు వచ్చి యీ ప్రజలమధ్య చావవలెనని పించుచున్నది. ఆ సమయమున నన్ను కలియుట కిక్కడకు వచ్చువారు యీ ప్రజల దీనావస్థను చూడగలరు. వారిలో ఎవరిదో ఒకరి హృదయము కరిగి, ఆతడు యిక్కడకువచ్చి వీరిసేవలో ఉండిపోగలడు." అని చెప్పెను.

దీని మీాదట నే నేమి చెప్పగలను? ఆయన యీ పవిత్రభావనకు సాక్షినై ధన్యుడను కాగలిగితిని.

# 77

ఈ పర్యటనలోనే మేము చార్‌బటియా చేరుకొంటిమి. అక్కడకూడ అటువంటిదే ఒకసభ జరిగినది. ఈ టూయాటీనిమించిన కారుణ్య జనక దృశ్యము యింకెక్కడను ఉండదని నే ననుకొంటిని. కాని చార్‌బటియాలోని దృశ్యము దానిని మించిపోయెను. కొద్దిమంది ప్రజలే వచ్చిరి. కాని ఆ వచ్చిన వారెవ్వరి ముఖములలోను చైతన్యము కనిపించలేదు. ప్రేతముల ముఖములలో నుండునట్టి శూన్యత్వమున్నది.

ఇక్కడ కూడ బాపు డబ్బుకొరకు విజ్ఞప్తి చేసెను. వచ్చినవారు ఏదో కొంత తీసియిచ్చిరి కూడ. నా చేతులన్నీ పచ్చబడి పోయినవి.

వీరు రూపాయలను ఎప్పుడూ చూచియుండరు. రాగి పైసలే వారి ధనమంతా. ఏదైనా పైస చేతిలోనికి వస్తే దానిని ఖర్చుపెట్టుట కెన్నడు వారికి ధైర్యము చాలేడిది కాదు. చాల దినములవరకు గుడ్డలో కట్టి ఉంచుటవల్ల, లేదా భూమిలో పాతిపెట్టుటవల్ల వాటికి కిలుము పట్టెడిది.

నేను బాపూను, "వీరినుండి అట్టి పైసలు తీసికొనుట వల్ల ఉపయోగమేమి?" అని అడిగితిని. దానికి బాపు, "ఇది పవిత్రమైన దానము. మనకిది దీక్ష. దీనిద్వారా నిరాశతోనిండిన యిక్కడి ప్రజల హృదయములలో కూడ ఆశాంకురములు మొలకెత్తినవి. ఈ పైసలు ఆ ఆశకు

చిహ్నములు. వారుకూడ ఉద్ధరింప బడుదురని వారికి నమ్మకము కుదిరినది." అని అనెను.

ఈ స్థానము, దానము జ్ఞాపకముండుట కింకొక కారణముకూడ గలదు. రాత్రి మే మక్కడే నిద్రపోతిమి. రెండవరోజు సూర్యోదయ మతిసుందరముగా నుండెను. దానిని చూచుటకు బాపు నన్ను పిలిచెను. పిమ్మట "మీరు గుజరాత్ విద్యాపీఠము స్థితినెరుగుదురు గదా! నేను దాని బాధ్యతను మీ కప్పగించినచో తీసికొనెదరా?" అని నన్ను ప్రశ్నించెను. దానికి నేను, "బాపూజీ విద్యాపీఠ స్థితిని గురించి మీ రెంత ఎరుగుదురో దానికంటె ఎక్కువగా నే నెరుగుదును. సమస్య చిక్కులతో కూడినదై పోయినది. కాని కనీసము ఒక విషయములో మిమ్ము నిశ్చింతుల చేయుటకు నేను దాని బాధ్యతను తీసికొనుటకు సంసిద్ధుడను" అని చెప్పితిని. అంత బాపు, "ఎవరైనా డాక్టరు వద్దకు ఒకరోగి వెళ్లినప్పుడు, ఆ రోగి ఎట్టిస్థితిలో నున్నను అతనికి చికిత్సచేయుటకు డాక్టరు నిరాకరింపజాలడు. బ్రతుకుటకు అవకాశమున్న రోగికే చికిత్సచేయుదునని డాక్టరు ఎన్నటికి చెప్పజాలడు." అని అనెను.

అప్పుడు నేను, "దానిస్థితి అంత చెడుగా లేదు. విద్యాపీఠమును బాగా నిలబడునట్లు చేయగలను. నెమ్మది నెమ్మదిగా అది గ్రామోన్ముఖ మగునట్లు కూడ చేసెదను." అని చెప్పితిని.

నేను విద్యాపీఠము బాధ్యత తీసికొన్నప్పుడు దాని పాఠ్యప్రణాళికలో ఖాదీ, వడ్రంగము మున్నగు వాటిని మొదలు పెట్టితిని. వాటితోపాటు 'గ్రామసేవా దీక్షితు'లను క్రొత్త డిగ్రీని (ఉపాధిని) ప్రవేశపెట్టి దానికికూడ విద్యార్థులను తయారు చేసితిని. శ్రీ బబల్‌భాయీ మెహతా, శ్రీ ఝువేర్‌భాయీ పటేల్, అదే గ్రామ సేవా మందిరమునకు చెందిన ఆది దీక్షితులు. ఈ ఇద్దరు గ్రామసేవా కార్యమును ఎంత బాగుగా చేసిరో అందరెరుగుదురు. శ్రీ బబల్‌భాయీ మెహతా 'మారుం గామదు' (నా గ్రామము) అను పుస్తకములో వ్రాసిన ఆయన అనుభవములు ఏదైనా నవలలోని రోమాంచ కారులగు సంఘటనలవలె కను పించును.

## 78

బాపు భారతదేశమునకు తిరిగివచ్చి ఎక్కువ రోజులు జరుగలేదు. ఏదో పనిమీద ఆయన బొంబాయి వెళ్లవలసి వచ్చెను. అక్కడ ఆయనకు జ్వరము వచ్చినది. ఆయన రేవాశంకరభాయి మణిభవనములో దిగియుండెను. అక్కడ మహాదేవభాయీ ఆయనసేవ చేయుచుండెను. ఒకరోజు జ్వరము చాలా ఎక్కువై బాపునకు సంధించెను. రాత్రి మహాదేవభాయీని నిద్రలేపి యీవిధంగా చెప్ప సాగెను. "మహాదేవ్! యీ బంగాళీలు కలకత్తాలో కాళీ పేర కాళీఘాటులోని దేవాలయములో పశుహత్య చేయు దురు. ఇది ధర్మము కాదని, గొప్ప అధర్మమని ఏదిమైన

నచ్చచెప్పవలెను? . పద. మన మిద్దరము పోయి సత్యా
గ్రహము చేసి వారిని ఆపుదము. అప్పుడు కోపోద్రేకులైన
బంగాళీ బ్రాహ్మణులు మనమీద విరుచుకు పడెదరు. మన
లను ముక్కచెక్కలు చేసెదరు. ఈ పశుహత్యను ఆపుటకై
మన ప్రాణములు పోయిన నష్టమేమి?"

ఇది నేను మహాదేవభాయీ చెప్పగా వింటిని.

## 79

1926లో మదరాసులో కాంగ్రెసు సమావేశము
జరుగుచుండెను. అప్పుడు మేము శ్రీ శ్రీనివాస అయ్యం
గారి ఇంటిలో దిగితిమి. ఆయన హిందూ ముసల్మానుల
ఐక్యత విషయమైన చిత్తుప్రతిని తయారుచేసి బాపు అంగీ
కారము కొరకు తెచ్చెను. ఆ రోజులలో దేశరాజకీయము
లతో బాపుకు సంబంధము లేకుండెను. ఆయన తన
యావచ్ఛక్తిని ఖాదీ పనిలో వినియోగించు చుండెను.
ఆ చిత్తుప్రతి ఆయన చేతిలోనికి వచ్చెను. అంతట ఆయన
"ఎవరి ప్రయత్నము వల్లనైనను, ఏ షరతుల మీదనైనను
హిందూ ముసల్మానుల మధ్య రాజీ కుదిరినచో నా కిష్టమే.
ఇందులో నాకు చూపించవలసిన దేమున్నది?" అని అనెను.
అయినప్పటికిని ఆయనకది చూపబడెను. ఆయన దానిని పై
పైన చూచి సరిగా ఉన్నదనెను.

సాయంకాలప్రార్థనచేసి బాపు త్వరగా నిద్రపోయెను.
ఉదయం చాలా పెందలకడ తొందరగా మహాదేవభాయిని

లేపెను. నేనుకూడ లేచితిని. అంతట బాపు, "పెద్ద తప్పు చేసితిని. నిన్న సాయంకాలమూ చిత్తుప్రతిని నేను శ్రద్ధగా చదువలేదు. బాగున్నదని ఊరికే అనివేశాను. దానిలో ముసల్మానులకు గోవధ చేయుటకు ప్రత్యేకముగా అనుమతి యియ్యబడినది. గోరక్షణ ప్రశ్న అట్లే వదలివేయబడెను. ఇది నేనెట్లు సహించగలను? వారు గోవుల వధించుచున్నచో బలవంతముగ మనమాపలేము. కాని వారికి సేవజేసి నచ్చజెప్పగలముగదా? స్వరాజ్యముకొరకైనను నేను గోరక్షా ఆదర్శమును వదలజాలను. ఈ రాజీ నాకిష్టములేదని యిప్పుడేవెళ్ళి వారితో చెప్పు. దీని ఫలితమేమైనను పాపమూ గోవులను యీ విధముగా వదలిపెట్టలేను." అని చెప్పెను.

## 80

అనిబిసెంటుసతి హోమ్‌రూల్ లీగును స్థాపించి భారత దేశములో రాజకీయాందోళనను జోరుగా సాగించెను. ప్రభుత్వమూమెను ప్రవాసమునందుంచెను. అప్పుడేమి చేయవలెనని ఆలోచించుటకు శ్రీ శంకరలాల్ బేంకరు బాపూ దగ్గరకు వచ్చెను. సత్యాగ్రహమును సిఫారసు చేయుచు బాపూ ఆతనికొక ఉత్తరము వ్రాసెను. ఆ ఉత్తరమును శంకరలాల్ భాయి ప్రకటించి సత్యాగ్రహ మొనర్చుటకు సంసిద్ధుడయ్యెను. ఇదంతాచూచి ప్రభుత్వము అనిబిసెంట్ సతిని విడుదల చేసెను.

అంతట ఆందోళనరూపమే మారిపోయెను. సహాయ నిరాకరణోద్యమపు రోజులు వచ్చినవి. అనిబిసెంట్ సతి

'న్యూయిండియా' అను పేర ఒక యింగ్లీషు పత్రికను నడిపెను. అందులో బాపూనకు విరుద్ధముగా ప్రతిరోజూ ఏదో ఒకటి వ్రాయసాగెను. ఒకరోజున అందులో చాలా చెడ్డ వ్యాసము వచ్చెను. నేను బాపూను, "న్యూఇండియా లోని వ్యాసమును మీరు చదివితిరా?" అని అడిగితిని. "నేను 'న్యూఇండియాను' చదవుట ఎప్పుడో మానివేసితిని. ఏదైనా మంచి హేతువాదనతోగూడిన వ్యాసములు వచ్చి నంతకాలము నేను చదివెడివాడను. కాని దానిలో నామీద వ్యక్తిగత విమర్శనలు బయలుదేరుటతో నేను చదువుటమానివేసితిని. వ్యక్తిగత విమర్శనల చదువుట వల్ల మనస్సు పాడైపోవుట కవకాశమున్నది. వాటిని చదు వుటే మానివేసినచో మనస్సులో సద్భావమట్లే నిలిచి యుండును. ఇప్పుడు నేను అనిబిసెంటుసతిని కలిసినచో యిదివరకు ఆమెపట్ల నాకున్న ఆదరభావము మాత్రము తగ్గదు." అని బాపు చెప్పెను.

## 81

ఆశ్రమ మప్పుడే స్థాపింపబడిన రోజులు. మేము కోచరబ్‌లోని ఒక బంగళాలో నివసించుచుంటిమి. ప్రొఫెసర్ కర్వే తన సంస్థకు ధనము ప్రోగుచేయుటకు అహమ్మదాబాదు వచ్చియుండెను. ఆయన బాపూను కలియుటకు ఆశ్రమమునకు వచ్చెను. బాపూ ఆశ్రమ వాసుల నందరను జమచేసి వారందరిని ఆయనకు సాష్టాంగ నమస్కారమొనర్చుడనెను. పిమ్మట "గోఖ్లేజీ దక్షిణా

క్రికావచ్చినప్పుడు మీప్రాంతములో సత్యనిష్ఠాపరులగు వారెవ్వరెవ్వరున్నారని నేను అడిగితిని. దానికి ఆయన "నాపేరును నేను చెప్పజాలను. సత్యపథముమీదనే నడచుటకు నేను ప్రయత్నముచేయుచున్నాను. కాని రాజకీయ వ్యవహారములలో ఎప్పుడైనా నోటినుండి అసత్యము బయటకు వచ్చుచునేయుండును. నేనెరిగియున్న వారిలో ముగ్గురు పూర్తిగ సత్యవాదులు. అందులో ఒకరు ప్రొఫెసర్ కర్వే, రెండవవారు శంకరరావులవాలే (ఆయన మద్యపాన నిషేధకార్యక్రమము నిర్వహించెడివాడు). ఇక మూడవ వారు......" అని చెప్పెను. సత్యనిష్ఠాపరులైనవారు మనకు పుణ్యతీర్థములవంటివారు. సత్యాగ్రహ ఆశ్రమ స్థాపన సత్యము నుపాసించుటకే జరిగినది. అట్టి ఆశ్రమమునకు, ఎవరైనా సత్యనిష్ఠాపరులు విచ్చేసినచో అది మనకు శుభదినము." అని చెప్పెను.

పాపము కర్వేగారు గద్గదకంఠులైనారు. ఏమీ జవాబు చెప్పలేకపోయినారు. తుదకాయన, "గాంధీజీ! మీరు నన్ను బాగా సిగ్గుపడునట్లు చేశారు. మీముందర నేనెంతవాడను." అని అన్నారు.

## 82

1930 లో బాపూతో ఉండుటకు నేను యరవడా జైలుకు పంపబడితిని. నేను నా వెంట కావలసినన్ని వస్తువులను తీసికొని వెళ్ళితిని. అక్కడ నేను అయిదు నెలలకంటె ఎక్కువ కాలముండనక్కర లేకుండెను. అయిదు నెలలవరకు

మరల తెప్పించుకోవలసిన అవసరము లేనన్ని ఏకులు నాదగ్గరనుండెను. కాని కొన్నిరోజులలోనే ప్రభుత్వము శ్రీ వల్లభభాయిని యరవదాజైలుకు తీసికొనివచ్చి అక్కడ ఉంచుట జరిగినది. ఆయనకు మాకు మధ్య ఒక్క గోడ మాత్రమే అడ్డుగానుండెను. కాని మేము కలియుటకు వీలు లేకుండెను. దీనివల్ల బాపూనకు చాల దుఃఖము కలుగు చుండెడిది. ఆయన, "ఈ ప్రభుత్వము ఏవిధముగ మనల నిబ్బంది పెట్టుచున్నదో, వల్లభభాయిని సాబర్మతీనుండి యిక్కడికి తీసికొనివచ్చిరి. మనమాయన కంఠధ్వనిని కూడ అప్పుడప్పుడు వినగలము. కాని ఆయనను కలియ లేము. ప్రభుత్వమునకు దీనివల్ల ఏమి ఆనందము కలుగు చున్నదో?" అని అనెడివాడు. బాపూను దూరమునుండి చూచువారు ఆయన ధీరోదాత్తతనే చూడగలరు. ఆయన ప్రేమ ఎంత ప్రబలమైనదో దానికి దెబ్బతగిలిన ఆయన ఎంత వ్యాకులుడగునో బయటి ప్రజలు తెలిసికొనజాలరు. బాపు ముంగిలిలో తిరుగునప్పుడు ఆయనదృష్టి మాటి మాటికి గోడకవతలిభాగమునకు పోవుచుండెడిది.

ఒకరోజు మేజరు మార్టిన్ (సూపరింటెండెంటు) వల్లభభాయి చీటీని తెచ్చెను. అందులో ఆయన," ఏకులన్ని అయిపోయినవి. మీ దగ్గర ఏమైనా ఉంటే పంపండి." అని వ్రాసెను. వల్లభభాయి బాగా నూలు వడకెడువాడు. తీరుబడి కలిగినప్పుడు తన గదిలో సింహమువలె తిరుగు చుండెడివాడు లేదా నూలు వడికెడువాడు. ఆయన తల్లికి

కూడ బాగా నూలువడకు అలవాటుండెడిది. ఆమె వృద్ధురాలైనను నూలువడకుట మానలేదు. ఇంటిలోనివారికి తమ ఏకులను దాచి ఉంచుకొనవలసి వచ్చెడిది. అవి ఎక్కడైనా దొరికినచో నూలు వడికివేసెడిది. వల్లభభాయి అట్టి తల్లి కొడుకు.

'కాకా ! మీ దగ్గర ఏకులున్నాయా' యని బాపు నన్నడిగెను. దానికి నేను, "కావలసినన్ని ఉన్నాయి. కాని నాకు ఏకుట రాదు. వీటి నిచ్చివేసి నేనేమి చేయను!" అని జవాబు చెప్పితిని. దానిపై బాపు, "ఆ పనిని నేను మీకు నేర్పెదను. లేకపోతే నేను ఏకులను తయారు చేసెదను." అని చెప్పెను. నేను నేర్చుకొనుటకే ఎన్నుకొంటిని. కాని నా మనస్సులో భయముగానే ఉండెను. ఏకులన్నింటిని వల్లభభాయికి పంపివేసితిమి.

ఇప్పుడు బాపు ప్రక్కగదిలో సరంజామా (సామగ్రి) అంత ఏర్పాటు చేసెను. నాకు దూదిఏకు కళను నేర్పెను. కొద్దిరోజులలోనే నేను తయారైనాను.

కాని యింతలో వానాకాలము వచ్చినది. గాలిలో చల్లదనమువల్ల ఏకు సాధనమునకు కట్టిన నరము వదులై పోయెడిది. ఎండవచ్చినప్పుడు విల్లును, దూదినికూడ ఎండ బెట్టుటకు దీనికి ప్రతిక్రియగా ఆలోచించితిమి. నేనట్లు చేసితినికూడ. కాని వాన బాగా పడెడిది. మాకోసం ఎండ రోజూ వచ్చెడిది కాదు. మా అంగణములో ఆంగ్లేయండి

యన్ ఖైదీలు నాన్ రొట్టెలు తయారుచేయుట కుపయోగించు బట్టీ యున్నట్లు మాకు జ్ఞాపకము వచ్చినది. నేను సాయంకాలము దూదిపేకే విల్లును దూదిని బట్టీ దగ్గర ఉంచి వచ్చుట సాగించితిని. దీనివల్ల విల్లుకు కట్టిన నరములతో చేయబడిన త్రాడు ఎండి బాగా బిగిసిపోయెడిది కాని ఆ త్రాడులోనుండి లేచిన నరములను అణచియుంచు టెట్లను ప్రశ్న బయలుదేరెను. చేదువేప ఆకులను దానిమీద గట్టిగా రుద్దవలెనని ఉపాయము తోచెను.

ఒకరోజు నాలుగైదు వేపఆకుల కొరకు నేనొక చిన్ని కొమ్మను విరుచుకొనివచ్చుట బాపు చూచెను. అప్పుడాయన, "ఇది కేవలము హింస. ఇతరులు అర్థముచేసికొన లేకపోయినను మీరు సులభముగా అర్థము చేసికొనగలరు. ఈ నాలుగాకులనుకూడ మనము చెట్టును క్షమాపణ అడిగే కోసుకొనవలెను. కాని మీరు పూర్తిగా ఒక చిన్ని కొమ్మనే విరుచుకొని వస్తున్నారు." అని మందలించెను.

రెండవరోజున ఆ పని చేయుట మానివేసితిని. పొడుగైనవాడను కాబట్టి చెట్టుమీదనుండి నాకు కావలసిన నాలుగైదు ఆకులను కోయసాగితిని. నేను యింకొకపనిని కూడా చేసినాను. బట్టీపని చేయనిరోజున వింటి త్రాటిని చెమ్మనుండి రక్షించుటకు దానిమీద క్రొవ్వొత్తితో రాయసాగితిని. దానివల్ల మంచి లాభము కలిగినది. బాపు ప్రసన్నుడయ్యెను.

ఇంతలో బయటనుండి పలుతోము పుల్లలు దొరకుట ఆగిపోయినది. అప్పుడు నేను, "బాపూజీ యిక్కడ వేపచెట్లు చాలా ఉన్నవి. నేను రోజు కొక క్రొత్తపుల్లను యిచ్చెదను." అని అన్నాను. బాపు దాని కొప్పుకొనెను. మరుసటిరోజు పలుతోముపుల్లను తెచ్చి ఒకకొనను మంచి కుంచెగ జేసితిని. దానిని ఉపయోగించిన తర్వాత బాపు, "ఇప్పుడు దీనిలో కుంచెయున్న భాగమును కోసివేసి మరల క్రొత్త కుంచెను తయారుచేయుము." అని అనసాగెను. దానికి నేను యిక్కడ ప్రతిరోజూ క్రొత్త పలుతోముపుల్ల దొరకగలదంటిని. అప్పుడు బాపు, "ఆ సంగతి నే నెరుగుదును. కాని మనకట్లు తీసికొను అధికారములేదు. ఉన్న పలుతోముపుల్ల ఎండిపోనంతవరకు దానిని మన మెట్లు పారవేయగలము?" అని అడిగెను. రెండవరోజు నుండి అట్లే చేయసాగితిని. అప్పుడప్పుడు కుంచె మంచిగ తయారయ్యెడిదికాదు. బాపూకున్న కొద్ది దంతములకు చిగుళ్లకు కష్టము కలుగుట నే నెట్లు సహించగలను? కాని పలుతోముపుల్ల చాల చిన్నదగునంతవరకు లేదా ఎండిపోనంతవరకు క్రొత్తది కోయుటకు నా కనుమతి లేకుండెను.

ఈ విధముగా బాపు జైలులో ఆదర్శ ఖైదీగానేగాక ఆదర్శ అహింసావ్రతధారిగా కూడ నుండెను.

## 83

1921 నాటి దినములు. బెజవాడలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశము జరుగుచుండెను. కాంగ్రెసు

యొక్క వార్షిక సమావేశమున కది ఏ విషయములోను తీసి పోకుండెను. తిలక్ స్వరాజ్యనిధికి ఒక కోటిరూపాయలు సేకరించుట, కోటిమందిని కాంగ్రెసు సభ్యులుగ చేర్చుట, 20 లక్షల రాట్నములను ఉపయోగములోనికి తెచ్చుట, యీ కార్యక్రమ మక్కడ నిశ్చయింపబడినది.

దానితర్వాత ఒక పెద్ద సభ జరిగినది. మట్టితో ఒక పెద్ద దిబ్బనువేసి దానిమీద నాయకులను కూర్చుండబెట్టిరి. నాలుగువైపుల జనసముదాయము సముద్రమువలె పొంగి వచ్చుచుండెను. ఆ రోజులలో లౌడ్‌స్పీకర్లు లేకుండెను. ఉపన్యాసము దూరమువరకు వినబడెడిదికాదు. ప్రజలు క్రొత్త ఆశతో పిచ్చివాండ్లయిపోయారు. కేవలము గాంధీ జీని దర్శింపవలెననే వారి కోరిక. సభాప్రారంభములోనే ప్రజలమధ్య కొక ఆవు చొచ్చుకొని వచ్చినది. సభలో గడబిడయైనది. బాపు "మీరు నన్ను చూచుట కిక్కడకు రాలేదు. స్వరాజ్యమును గురించి వినుటకు వచ్చిరి." అని యింతయే చెప్పగలిగెను. కాని ఆ అల్లకల్లోలములో ఏమీ వినిపించెడిదికాదు. బాపు కుర్చీమీద నిలబడెను. అదిచూచి పిచ్చివాండ్రయిన ప్రజలు యింకను పిచ్చివాండ్రైపోయిరి. దిబ్బవైపు రాసాగిరి. ప్రజలను అదుపులో పెట్టగలిగినట్టి ఏర్పాట్లు అక్కడ లేకుండెను. నాకు బాపు ప్రాణవిషయములో కూడ భయము కలుగసాగెను. శత్రువుల నుండి రక్షింపవచ్చును. కాని గ్రుడ్డివారైన భక్తులనుండి తప్పించు టెట్లు? చొచ్చుకొని వచ్చువారు దిబ్బమీది మండపము

స్తంభములను పట్టుకొని పైకిరా ప్రయత్నింపసాగిరి. మండప స్తంభమేదైన జారిపోయినచో మండపమంతా నాయకుల నెత్తిమీాద పడునన్నది స్పష్టమైన విషయము.

బాపు పరిస్థితుల నర్థముచేసికొనెను. క్షణమాత్ర మాయన నలువైపుల చూచెను. తర్వాత రెండు మూడు కుర్చీలమీాదనుండి దూకి ఏవైపున ప్రజాసమూహము తక్కువగ నున్నదో ఆ వైపు గుంపులో దుమికెను. ప్రజలను జోరుగా యిటునటు త్రోసివైచుచు బాణమువలె గుంపును చీల్చుకొనుచు బైటకు వెళ్ళిపోయెను. ఆయన అట్లు వెళ్ళిపోయినసంగతి ఎవ్వరికిని తెలియనే తెలియదు.

నేనుకూడ కుర్చీమీాద నిలబడి నలువైపుల ధ్యానముతో చూచితిని. కాని బాపు ఎక్కడను కనబడలేదు. అంతట నేనుకూడ సభాస్థానమును వదలిపెట్టుటకు తయారైతిని. గాంధీజీ సభలో లేడని తెలిసికొన్న ప్రజాసంవోహము చెల్లాచెదరైపోవుటకు ఎంతోసేపు పట్టలేదు. నేను చాల కష్టముమీాద బసకుచేరితిని. చూడగా సభకువెళ్ళనట్లేలేని బాపు తన గదిలో కూర్చుండి ఉత్తరములు వ్రాయుచుండెను. మీారెట్లు వచ్చితిరని బాపును నేనడిగినప్పుడు ఆయన, "జనసమూహము బయటకు వచ్చినతర్వాత చూడగా ఎవరిదో కారు పోవుచుండెను. నేను దానిని ఆపి దానిలో కూర్చుండి యీా బసకువచ్చాను." అని ఆయన చెప్పెను.

# 84

గుజరాత్ విద్యాపీఠపు సెనేట్ (శిష్టసభ) సమావేశము - దానికి బాపు పోవలసియుండెను. కాని వేళకు ఆయన వద్దకు బండి బహుశః రాజాలకపోయియుండును. బాపు వేళకు పోవుటలో చాల పట్టుదలగలవాడు. బండి రాకపోయేటప్పటికి ఆశ్రమమునుండి కాలినడకను బయలుదేరెను. కాని సభాసమయమునకు ఎట్లుచేరుకొనగలడు? సభ మొదలగు సమయము దాదాపు కావచ్చినది. విద్యాపీఠము ఆశ్రమమునుండి చాల దూరముగనుండెను. రెండింటిమధ్య దారి నిర్జనమగుటచే ఏదైనా ప్రయాణసాధనము దొరకుటకూడ సంభవముకాదు. కొంతదూరము నడచినతర్వాత ఖాదీబట్టలు కట్టుకొన్న వాడొకడు దారి వెంట సైకిలుమీద పోవుటచూచెను. బాపు అతనిని ఆపి, "నాకు సైకిలియ్యి - నేను విద్యాపీఠమునకు వెళ్ళవలెను" అని అడిగెను. అతడు మాట్లాడకుండ సైకిలునిచ్చివేసెను.

బాపు ఎప్పుడో దక్షిణాఫ్రికాలో సైకిలెక్కియుండవచ్చును. భారతదేశమునకు వచ్చినతర్వాత ఎప్పుడుకూడ అట్టి అవసరమే రాలేదు. అంతట సైకిలెక్కి విద్యాపీఠమును చేరుకొనెను. సమయమునకు బాపు వచ్చుటచూచి మాకు ఆశ్చర్యమే కలిగెను. కాని ఒక చిన్న దోవతి కట్టుకొని, వట్టి ఒంటితో సైకిలుమీద పోవుచున్న బాపు దృశ్యము, యీ జీవితములో మరెప్పుడూ కనబడదు.

# 85

1924 సంవత్సరపు ప్రారంభములో బాపు యరవాడ జైలులో జబ్బుపడిన కారణమువల్ల త్వరగా విడుదలయ్యెను. నేనుకూడ నా సంవత్సరపు శిక్షను పూర్తిచేసికొని ఆయనను కలిసికొనుటకు పూనా వెళ్ళితిని.

మేము చిన్నపిల్లలకొరకు గుజరాతీలో ఒక బాల శిక్షను తయారుచేసితిమి. దానికి 'చాలన్‌గాడీ' అని పేరు పెట్టితిమి. అక్షరములలో నాలుగైదింటిని నేర్చిన వెంటనే పిల్లలు శబ్దములను చదువగలుగుట దాని ప్రత్యేకత. ప్రతి పుటలో తీగెల పువ్వుల బొమ్మలు కలవు. పుస్తకమంతా రంగులతోకూడిన ఆర్టు కాగితముమీద అనేకరంగులలో అచ్చువేయబడియుండెను. అక్షర జ్ఞానముతోపాటు కళాత్మకమైన అభిరుచి పిల్లలకు కలుగునట్లుచేయుట మా ఉద్దేశము. ఒక్కొక్క ప్రతి అయిదు అణాలలో అమ్ముడయ్యెడిది. దానికి గుజరాతు హృదయపూర్వకముగ స్వాగతమిచ్చినది. ఆ పుస్తకము పూర్తికల్పన, దాని ప్రతి పేజీ ఎట్లుండవలెనో చూచుబాధ్యత నాదగుటచే అందున నాకు కొంచెము అభిమానము - గర్వము - కూడ ఉండెను.

ఒకరోజు నేను బాపూను అడిగినాను. "మీరు చాలనగాడీ చూచియేయుందురు?" దానికి ఆయన "అవును చూచాను. సుందరముగనున్నది. కాని ఎవరికోసం తయారు చేసితిరి? జాతీయ విద్యకు ఆచార్యులుగా

మీారు? ఆకలితోనుండు కోట్లకొలది ప్రజల పిల్లలకు విద్యా దాన మొనర్చు భారము మీామీాదనే ఉన్నది. నేటి బాల శిశులు ఒక అణాకు లభించినచో మీా బాలశిశు రెండు పైసలకు లభించవలెను. ఒక్కపైసలోనే ఎందుకు దొరక రాదని నే ననెదను. మీా పుస్తకము అయిదు అణాలలో చాల చవుకయన్న సంగతి నే నెరుగుదును. కాని బీదవారు అయిదణాలు ఎక్కడినుండి తేగలరు!'' అని అనెను.

నా పుస్తకముమీాద నాకు మోహమున్నప్పటికిని నా గ్రుడ్డితనమునకు నేను సిగ్గుపడిపోయాను. అహమ్మదా బాదు వెళ్ళి రంగురంగుల కాగితములమీాద, రంగురంగుల సిరాల మీాద పట్టుదల వదలిపెట్టి దానిని క్రొత్తగ అచ్చువేయించి అయిదుపైసలకు అమ్మనట మొదలుపెట్టి తిమి. అప్పటికి ఆ పుస్తకమును తీసికొని బాపూదగ్గరకు పోవుటకు ధైర్యము చాలలేదు.

బాపూయొక్క యీా మందలింపు నామీాద ఎంతపని చేసినదనిన గుజరాత్ విద్యాపీఠమున రెండున్నర రూపా యలకు అమ్మబడు బుద్ధభగవానుని జీవితచరిత్రను మరల ముద్రించినప్పుడు కాగితములోగాని అచ్చులోగాని ఎట్టి మార్పు లేకుండగనే మేము ఎనిమిదణాలకు అమ్మితిమి. దానిఫలితముగ గుజరాతంతటను దాని ప్రతులెన్నో అమ్ముడుపోయినవి. దానివల్ల నవజీవన్ ప్రకాశన్ మంది రమునకు నష్టమేమీా రాలేదు.

# 86

బాపు మాట్లాడునప్పుడు తానెవ్వరితో మాట్లాడుచున్నాడో ఆతని జీవితపద్ధతిని, ఆతని మతమును, ఆతని యిష్టాయిష్టతలు అన్నింటినీ జాగ్రత్తగా మనస్సులో పెట్టుకొని మాట్లాడెడివాడు.

ఒకరోజున ఒక క్రైస్తవసోదరుని ఉత్తరమువచ్చెను. అందులో స్వదేశీనిగురించి ఆతడు ప్రశ్నలడిగెను.

దానికి జవాబుగా బాపు యీ క్రిందివిధముగా వ్రాసెను "స్వదేశీ ధర్మము బైబిలులోని ఒక ఉపదేశమును అమలులో పెట్టుటకు మార్గము. నిన్నెట్లు ప్రేమించుకొందువో అట్లే నీ పొరుగువానిని ప్రేమించుమని జీసస్ క్రైస్తు చెప్పలేదా? ఎవరైనా ఒకరు తన పొరుగుననున్న దుకాణదారును వదలిపెట్టి ఎక్కడో దూరముననున్న దుకాణదారునుండి వస్తువులను కొన్నచో ఆతడు పొరుగువానిపట్ల తనకున్న ధర్మమును మరచిపోయి స్వార్థపరుడయ్యేటంత దూరముపోవును. అతని పొరుగువాడగు దుకాణదారుడు తన యిరుగు పొరుగు క్రయదారుల ఆధారముమీదనే దుకాణమును తెరచెనుగదా? పొరుగువానికి నీమీదనున్న అధికారమునకు ద్రోహముచేయవద్దని స్వదేశీ ధర్మము చెప్పును."

బాపు వ్రాసిన యీ ఉత్తరమును చదివినపిమ్మట నే 'నీ పొరుగువానిని ప్రేమింపుము' అనుదాని అర్థమును నేను తెలిసికొనగలిగితిని.

## 87

అట్టిదే యింకొక ఉదాహరణ కలదు. మీరాబహన్ (మిస్ స్లేడ్) కొరకు బాపూ ఆశ్రమ భజనావళిని యింగ్లీషు లోనికి అనువదించుచుండెను. ప్రార్థన తర్వాత ప్రతిరోజు కొద్దికొద్దిగ వ్రాసి ఆయన పూర్తి ఆశ్రమభజనావళికి అనువాదము చేసివైచెను. అందులో ఒక శ్లోకములో 'జయ జయ కరుణాబ్ధే శ్రీ మహాదేవశంభో' అని ఉన్నది. ఆ సంస్కృతమునకు యింగ్లీషు అనువాదమును నేను చూచితిని. చేసితినికూడ. జయజయకు సూటి అనువాదము Victory-Victory- కాని బాపూ "Thy will be done" అని అనువాదము చేసెను. దానినిగురించి నేనడిగినప్పుడు "భగవానుని విజయము విశ్వములో జరుగుచునేయుండును. మన హృదయములో కామక్రోధాదుల విజయమేది సాగుచున్నదో అది జరుగరాదని, అవి తొలగిపోవలెనని మనము ప్రార్థన చేసెదము. అనగా భగవంతుని యిచ్ఛ యెట్లుండునో అట్లే కర్మను మనము చేయుచు పోవలెను. క్రైస్తవులకొరకు, Thy Kingdom come లేక Thy will be done అనేదానికి అనువాదము కాగలదు. భగవంతుని విజయము కొనసాగవలెనని యేగదా మనము హృదయములో ప్రార్థించునది." అని చెప్పెను.

## 88

యరవడాజైలు జైలరు మిష్టర్ క్వీన్ ఐరిషు దేశ

స్థుడు. ప్రతిరోజు మా క్షేమమడుగుటకు వచ్చేవాడు. వచ్చి కూర్చున్నచో ఏదో సంభాషణ జరిగెడిది. ఒకదినమున బాపూతో నేను గుజరాతీ నేర్చుకొనగోరుతాను" అని అనెను. బాపూ మంచిమాటనెను. ఆతడు రోజూ సాయంత్రము గుజరాతీ బాలశిక్ష చదువుట మొదలుపెట్టెను. బాపూ కూడ సమయమిచ్చి ప్రేమతో చెప్పుచుండెను.

ఒకరోజు ఆతడు వెళ్ళిపోయినపిమ్మట నాతో ఇట్లనెను. "నాకంటె మీరీతనికి బాగా చదువుచెప్పగలరని నా సమయము మిగులునని నే నెరుగుదును. కాని యీతనికి నా దగ్గరనే చదువవలెనని కోరిక."

తర్వాత ఆతడు ఉదయము రాసాగెను. ఒకరోజు ఆతడు రాలేదు. మాకు కొంత ఆశ్చర్యము కలిగినది. నేను విచారించితిని. కారణము తెలిసినది. మరుసటిరోజున భోజనము తర్వాత బాపూతో "మిస్టర్ క్వేన్ నిన్న రాకుండుటకు కారణము నాకు అర్థమైనది. నిన్న ఉదయమిక్కడ ఒక ఖైదీ ఉరితీయుబడెను. ఆతని కక్కడకు వెళ్ళవలసి యుండెను. అందుచేత యిక్కడకు రాలేదు" అని చెప్పితిని.

నామాట వింటూనే బాపూ అస్వస్థులై పోయెను. ఆయన ముఖము మారిపోయినది. "నిన్న అన్నము యిప్పుడే బైటకువచ్చునట్లనిపించుచున్నది."అని అనసాగెను.

మేమున్నచోటికి ఉరితీసే స్థలము దగ్గరేయని బాపూ యెరుగును. తనకు దగ్గరగనే నిన్న ఒక మనిషి ఉరితీయ

బడెనన్నమాట వింటూనే ఆయన మనస్సులో ఆ దృశ్యము రూపొంది నాకు భయముకలుగునంత అస్వస్థుడయ్యెను.

ఒకరోజున మిస్టర్ క్విన్ బాపూతో, "గుజరాతీ వ్రాతను నేను మాటిమాటికి చదువుకొనుటకు వీలుగ మీరు ఏమైనా వాక్యములను నాకొక కాగితముపై వ్రాసి యియ్యండి." అని అడిగెను. బాపు "ఖైదీలమీద ప్రేమ చూపించుము. ఏదైనా కారణమువల్ల కోపమువచ్చిన మనస్సులో విచారించి శాంతుడవుకమ్ము." అని వ్రాసి యిచ్చెను.

ఈ మిస్టర్ క్విన్నే తర్వాత విసాపూర్ జైలు సూపరింటెండెంటు అయ్యెను. గుజరాతులోని రాజకీయ ఖైదీలక్కడికి పోయిరి. అప్పుడు ఒకసమయమున ఆయనకు చాల కోపమువచ్చెను. రాజకీయ ఖైదీలుకూడ ఆతనిపట్ల చాల ఆగ్రహావేశులైరి. తుపాకులు కాల్చవలసిన పరిస్థితి వచ్చినది. కాని మిస్టర్ క్విన్ జేబులో బాపూచే వ్రాయబడిన ఆ గుజరాతీ వాక్యములున్న కాగితముండెను. ఆతడు దానిని అనేకమారులు చదివెను. శాంతచిత్తుడాయెను. ఆయన సత్యాగ్రహులను క్షమాపణకూడ వేడుకొనెను. ఇదేవిధముగా జైలులోని ఒక ఆంగ్లోయిండియన్ నౌకరు ఒకసారి బాపూను తన పుస్తకములో ఏదైనా వ్రాసి సంతకము చేయుడని కోరెను. బాపూ, "It does not cost to be kind" (దయగా ఉండుటలో ఖర్చులేదు.) అని వ్రాసి

యిచ్చెను. ఆ వాక్యము చదివినమీదట తన స్వభావమే మారిపోయినదని నాతో ఆ జవాను అనేకమారులు చెప్పెను.

## 89

నాకు క్షయరోగము వచ్చినది. అప్పుడు నేను ఆరోగ్యముకొరకు సింహగడమునకుపోయి ఉంటిని. ఆరోగ్యము బాగుపడిన తర్వాత ఆశ్రమమునకువచ్చి ఉంటిని. కొన్ని నెలలు నేను విశ్రాంతితీసికొనవలెనని డాక్టరు సలహానిచ్చెను.

నేను ఆశ్రమముచేరి కొద్దిసేపే యైనది. ఇంతలో ఒక పిల్ల పళ్ళెములో పూలు తీసికొని వచ్చినది. ఇవి బాపూ మీకొరకు పంపినాడని చెప్పినది. నా కండ్లవెంట నీరు వచ్చినవి. ఆ పిల్ల, "కాకాదగ్గరకు ప్రతిరోజు యీ విధముగానే పువ్వులను తీసికొని వెళ్ళుచుండుము. కాకాకు పువ్వులంటే చాలా ప్రేమ. అని బాపు తనతో చెప్పినట్లు చెప్పినది.

బాపూకూడ ప్రతిరోజూ తీరుబడిచేసుకొని నా దగ్గరకు వచ్చుచుండెడివాడు.

ఇదే విధముగా ఆశ్రమములోని పిల్లవాండ్రు ఒకసారి వచ్చి బాపూతో, "బాపూజీ, ప్రొఫెసర్ వచ్చినా"రని చెప్పినారు. ఆశ్రమములో శ్రీజీవత్ రామ్ కృపలానీని ప్రొఫెసర్ అని పిలిచేవారు. అది వింటూనే బాపు దేవదాసుతో,

"దేవా! వెళ్ళి పెరుగున్నదో లేదో జానడుగు. ప్రొఫెసర్‌కు పెరుగు తప్పక కావలెను. లేకపోతే ఎక్కడినుంచైనా విమ్మాషంమును తీసికొనిరా. ఎక్కడ దొరక్కపోయినా కాకా యింటిలో తప్పక దొరుకుతుంది." అని చెప్పెను.

బాపూ ప్రేమ సేవామయమైనది. ప్రతి మనుష్యుని సుఖదుఃఖములను పూర్తిగా గ్రహించు స్వభావమాయనది.

ఒకదినము యరవదాజైలులో నేను గుమ్మడికాయ కూరచేసి యిచ్చితిని. నేనేమీ ఉంచుకొనలేదు. కొంత తిన్నతర్వాత ఆయన, "గుమ్మడి కాయనిన మీకిష్టము లేదని నాకు తెలియును. కాని యీ రోజు గుమ్మడికాయ చాల రుచిగానున్నది. కొంచెము తినిచూడండి." అని అనసాగెను. అస్వాద వ్రతదీక్షపూనిన బాపూనుండి ఏదైనా రుచిమాటుమునుమాట వచ్చుట చాల ఆశ్చర్యకరమైన సంగతి. ఆయనకుకూడ ఆ మాట తోచినది. అంతట "గుమ్మడికాయకూర ఎంత తియ్యగా ఉండగలదో దానిని తెలిసికొనుటకు మిమ్ము రుచిచూడుమని నే నంటిని." అని అనెను.

ఇక్కడ యింతకుముందు జరిగిన యింకొక విషయము నాకు జ్ఞాపకము వచ్చుచున్నది.

ఏదో కారణముమీద నేను బాపూదగ్గరకు వెళ్లాను. అక్కడకు ఒక సజ్జనుడువచ్చి బాపూముందర కొన్నిపండ్లుంచెను. వాటిలో సపోటాపండ్లు చాల బాగున్నవి. బాపు వెంటనే అందులోని పెద్దపండ్లు రెండుతీసి నాకిస్తూ, "కాకా

యీ రెండుపండ్లను మహాదేవ్‌కు యివ్వండి. అతనికి సపోటాపండ్లన్న చాల యిష్టము." అని చెప్పెను. మహాదేవ భాయి నా పొరుగుననే ఉండేవాడు. నేను అతనిదగ్గరకు వెళ్ళి, "మహాదేవ్ భాయీ! నేను నీ కొరకు ప్రేమసందేశ మును తెచ్చితిని." అని అంటిని. సపోటాపండ్లనుచూచి మహాదేవభాయి చాల సంతోషించెను. "నిజముగా ప్రేమ సందేశమే"అనెను.

## 90

బాపు ఏ విషయములోనైనా మూలమునకు పోయి విచారించును. ఆయన విచారించనట్టి ఏ అంగముగాని ఏ అంశముగాని మానవజీవితములో లేదు. ఆయన మిత్రు డగు కేలన్‌బక్ జర్మనీ దేశపుజూ (యూదీయ) వాస్తు శాస్త్రజ్ఞుడగుటచే బాగా సంపాదించేవాడు. ఆతడు బాపూతో, మీరు చెప్పు ఏ విషయమైనా ఎవరికైనా నచ్చినా నచ్చకపోయినా, ఆ విషయమై మీరు బాగుగా ఆలోచించి, పరిశీలిస్తారనే విషయం ప్రతివారును తెలుసు కొనగలరు." అని చెప్పుచుండెడివాడు.

ఈ విషయము ఆశ్రమమునకు వెళ్ళుటతోడనే నాకు కూడ అనుభవములోనికి వచ్చినది. ఆశ్రమములోని అన్నము నాకు ఏమాత్రము రుచించెడిది కాదు. ఒకరోజున నేను బాపూతో, "ఇది అన్నమా లేక మట్టియా? మేమిట్టి అన్నము ఎన్నడు తినము." అని అంటిని. బాపు నవ్వి

"ఆ సంగతిని నేనుకూడ ఎరుగుదును. ముందర దీనిని రుచి చూడండి." అనెను.

అంతట దాని తత్వమును ఉత్సాహముతో నాకు చెప్పుట మొదలుపెట్టెను.

"ప్రజలకు మల్లెమొగ్గలవంటి అన్నముకావలెను. మిల్లులో పౌష్టికపదార్థమంతా తీసివేయబడిన బియ్యమును తీసికొందురు. ఎక్కడనుండి మొక్క మొలచునో అదే బియ్యముయొక్క పౌష్టిక భాగము. ఆ భాగముకూడ పోవును. అన్నము యింకను తెల్లగ ఉండవలెనని నీటితో ఎన్నోసారులు కడుగుదురు. దీనివల్ల మిగిలియున్న సారము కాస్తా పోవును. ఉడికిన తర్వాత ఉన్న గంజినికూడ వార్చి వేయుదురు. ఈ విధముగా బియ్యమును పూర్తిగా నిస్సారముగ చేసి తినెదరు. అదికూడ పూర్తిగా ఉడకకపోయినచో సరిగా నములుటకుకూడ వీలుండదు. దీనితోపాటు అవసరమైనదానికంటె అధికముగా తినెదరు. తినటముతోడనే నిద్రవచ్చును. గణపతి పొట్టలాంటి పొట్ట పెరుగును. ఆశ్రమములో యీ విధమైన బియ్యమును వండరు. మొదటిసంగతి మాది దంపుడుబియ్యము. దానిని కొద్దిగానే కడిగెదము. తర్వాత నీళ్ళలో నానబెట్టెదము. తర్వాత దానిలోని నీళ్ళు యిగిరిపోయేటట్లు వండెదము. వండినతర్వాత దానిని మెత్తగ కోవావలె అగునట్లు చేసెదము. అది రుచికి బాగుండును. చక్కెర వెయ్యకపోయినను తియ్యగ

నుండును. తక్కువగ తిందుము, ఇది చాల పుష్టినిచ్చును. పొట్ట పెరుగదు.”

ఇంత హేతువాదన వినిన పిమ్మట నాలోకూడ ఆసక్తి జనించినది. నాకుకూడ ఆ అన్నముపట్ల యిచ్చపొడ పొడమినది. తరువాత యీ అన్నములోనే నాకు మంచి గుణములన్నీ కనిపించసాగినవి. నేను దానిని సమర్థించు వానిగ మారిపోతిని.

## 91

ఒకరోజున నేను బాపూను “నేడు గాంధిటోపీయని పిలువబడెడిది మీ కెందుకు నచ్చినది?” అని అడిగినాను. దానికి బాపు ఇట్లు చెప్పసాగెను. “భారతదేశపు భిన్న భిన్న ప్రాంతాలలోనుండే శిరోవేష్టనముల విషయమై నేను ఆలోచించసాగితిని. మనది వేడిదేశము. అందుచేత నెత్తి మీద ఏదోఒకటి తప్పక ఉండవలెను. బంగాళీలు దక్షిణ ప్రాంతములోని కొందరు బ్రాహ్మణులు వట్టితల తోనే ఉందురు. కాని భారతీయులలో అధికాంశము ఏదో ఒక శిరోవేష్టనమును తప్పక పెట్టుకొందురు. పంజాబీ తల పాగా చాలా బాగా ఉంటుంది. కాని దానికి చాల బట్ట పట్టును. పగిడీలు వాసన వేయును. చెమటనెంతయినా పీల్చుకొనును. మన గుజరాతులోని గోపురాకారపు బెంగు ళూరు టోపీలు పూర్తిగ వికారముగ కనిపించును. మహా రాష్ట్రములోని హాంగేరీటోపీలు వాటికంటె కొంచెము నయమే-కాని అవి ఉన్నితో తయారుచేయబడును. ఉత్తర

ప్రదేశ్ బీహారులలోని పల్చని టోపీలు టోపీలే కావు. అవి శోభను కూడ నీయవు. ఇదంతా ఆలోచించగ ఆలోచించగ నాకు కాశ్మీరుటోపీ మంచిదనిపించినది. అది తేలికగా, అందముగా నుండును. తయారుచేయుటలో కష్టము లేదు. మడత పెట్టుటకు వీలుగనుండుటవల్ల దానిని మనము జేబులోగాని పెట్టెలోగాని పెట్టుకొనవచ్చును. కాశ్మీరు టోపీలు ఉన్నితో తయారుచేయబడును. కాని అవి నూలు బట్టతో చేయబడవలెనని నేనాలోచించితిని. తర్వాత రంగు విషయమాలోచించితిని. ఏ రంగు తలమీద బాగుండును ? ఏ రంగూ నాకు నచ్చలేదు. చివరకు అన్ని రంగులకంటె తెలుపే మంచిదను నిర్ణయమునకు వచ్చినాను. చెమట దానిమీద తొందరగా కానిపించును. అందుచేత దానిని ఉతకవలసివచ్చును. ఉతుకుటలో కష్టము లేదు. టోపీ మడతపెట్టుటకు వీలుండుటచేతను, తెల్లగనుండుట చేతను మనిషి శుభ్రముగాను, ఆకర్షణీయముగాను కనిపించును. ఇదంతా ఆలోచించి నేనీ టోపీని తయారుచేసితిని. నిజమునకు మనదేశ శీతోష్ణస్థితిదృష్ట్యా నాకు సోలా హేట్ నచ్చుతుంది. అది ఎండనుండి శిరస్సును, కండ్లను మెడను రక్షిస్తుంది. జీలుగుబెండుతో చేయబడుటవల్ల తేలికగను, చల్లగను ఉంటుంది. తలకు కొంచెము గాలి కూడ తగులవచ్చును. దాని ఆకారము మన యితర దుస్తులతో సరిపోదు కాబట్టి నేడు దాని ప్రచారము చేయజాలను. అదిగాక యూరోపియన్ పద్ధతికి చెందినదగుటచేత

లోకులు దానినవలంబించరు. మన కళాకారులు యూరోపి యన్ టోపీలోనుండు మంచిగుణములు పోకుండ ఆకార ములో మన దుస్తులతో సమన్వయపడునట్లు టోపీని నిర్మిం చిన చాల ఉపకారము చేసినవారగుదురు. మన కళా కారులు ఆలోచించినచో యిదేమంత కష్టమైనపనికాదు."

# 92

బాపు వర్ధా వచ్చి మగన్‌వాడిలో నివసించసాగెను. అప్పుడు అక్కడి ప్రజలస్థితి చూచి, ఆహారము విషయమై ఎక్కువగా ఆలోచించసాగెను. బజారులో కూరలు దొరకవు. ఒకవేళ దొరకినను ఖరీదు చాల ఎక్కువ. ఇదిచూచి బీద వాళ్లు తినేవి, పట్టణములోని మార్కెటుకు అమ్మకమునకు రానివి కూరలేమియుండునని గ్రామములో వెదకెను. ఆతర్వాత మగన్‌వాడిలో ఆ కూరగలనే కొనుట మొదలుపెట్టెను. అట్టి కూరలలో పుష్టినిచ్చే పదార్థమెంత యున్నది? వాటి గుణ దోషము లేవి? అను విషయము బాపు తెలిసికొనగోరు చుండెను. భోజనము చేసేవారందరిని వారి వారి అనుభవ ముల నడుగుచుండెడివాడు. తర్వాత కొన్ని కూరలు అన్ని విషయములలో తినుటకు తగినవని తెలిసికొని ఆయన చాల సంతోషించెను.

అదే రోజులలో సోయా చిక్కుడు ప్రయోగముకూడ సాగెను. సోయాచిక్కుళ్ళు తెప్పించబడును. అవి వండ బడును. వండిన తర్వాత రుబ్బబడును. ఇవన్నీ కొన్ని

రోజులవరకు కొనసాగుచుండెను. ఈ లోపుగ సోయాచిక్కుడు మీద వ్రాయబడిన సాహిత్యమును బాపు చాలా చదివెను. కాని సోయాచిక్కుడువల్ల ఆయనకు ఎక్కువ తృప్తికలిగినట్లు కనుపించదు.

# 93

1927 తర్వాత సంగతి మైసూరులో స్టూడెంట్స్ వరల్డ్ ఫెడరేషన్ సమావేశము జరుగుచుండెను. విద్యార్థులలో పనిచేసే అమెరికా దేశస్థుడగు రెవరెండ్ మాట్ దాని కధ్యక్షుడు. ఆయన భారతదేశము వచ్చిన తర్వాత బాపును కలియకుండ ఎట్లు వెళ్ళిపోగలడు? ఆయన అహమ్మదాబాదు వచ్చి బాపును కలియుటకు సమయము కోరెను. బాపు రోజంతా పనిలో ఉండెను. అందుచేత రాత్రి పండుకొనేముందు పదినిమిషముల నొసమిచ్చెను. నేనుకూడ విద్యాపీఠమునుండి ఆశ్రమమునకు వెళ్ళితిని. పదినిమిషముల కాలములో ఏమేమి మాటలు జరుగగలవో చూడవలెనని కుతూహలముగా నుండెను.

బాపు ముంగిలిలో పండుకొనియుండెను. దగ్గరనున్న ఒక బెంచీమీద రెవరెండు మాట్ వచ్చి కూర్చుండెను. ఆయన తన ప్రశ్నలను వ్రాసికొని తెచ్చెను. మిషనరీల సేవవల్ల ఏమి ఫలితము కలిగినదని అడిగెను. తర్వాత ఇంకొక రెండు ప్రశ్నలు ఆతడు అడిగెను. వాటి జవాబులు నా మనస్సులో అంకితమైపోయినవి. అట్టి ప్రశ్నలు బహుశః ఎవ్వరోగాని అడుగుట జరుగదు.

ప్రశ్న : మీ జీవితములో ఆశానిరాశలకు సంబంధించిన అనేక సందర్భములు వచ్చుచుండవచ్చును. అప్పుడు దేనివల్ల మీకు అధికాధికమైన మనశ్శాంతి లభించును ?

జవాబు : మా దేశప్రజలను ఎంత రెచ్చగొట్టినను వారు అహింసాప్రవృత్తిని వదలరు. దీనివల్ల నాకు అన్నిటికంటె ఎక్కువ మనశ్శాంతి లభించును.

ప్రశ్న : మిమ్ము అహోరాత్రములు చింతలోను, వ్యాకులపాటులోను ఉంచున దేది ?

ప్రశ్న కొంచెం విచిత్రమైనదే. బాపు ఒక్క క్షణ మాగి యిట్లు చెప్పెను- విద్యావంతులలో దయాభావము మృగ్యమయినది. దీని విషయమై నేను సదా చింతించుచుందును.

ఈ ప్రశ్నను దాని జవాబును విని నేను కొంత అస్వస్థుడనై పోయాను. విద్యాపీఠమునకు పోయి ప్రక్కమీద పడుకొన్నప్పటికి నాకు నిద్రపట్టలేదు. చదువురాని ప్రజలలోని యువకులను రప్పించి వారిని నేను విద్యావంతులను చేయుచున్నాను. దీనికర్థము బాపూనకు మనశ్శాంతి నిచ్చే వర్గమును తక్కువచేసి - ఆయనను చింతాగ్రస్తునిగను, అస్వస్థునిగను చేయు వర్గమును పెంచుతున్నానన్నమాట. ఇదేనా నా పరిశ్రమకు ఫలితము ? నేను నేర్పే విద్యకు జాతీయ విద్య యను నామకరణం ఉన్నది. అంతమాత్రం చేత నాకెలా సంతోషము కలుగగలదు ?

దీని తర్వాతనే నేను విద్యాపీఠములో గ్రామసేవా దీక్షితుల తరగతులు మొదలుపెట్టితిని.

## 94

బాపునకు ఒక సోదరి కలదు. బాపు దక్షిణాఫ్రికాలో ఆశ్రమము మొదలుపెట్టినప్పుడు తన సర్వస్వమును అక్కడి ఆశ్రమమునకు అనగా దేశమునకిచ్చివేసెను. భారతదేశమునకు వచ్చిన పిమ్మట తండ్రి తాతల యింట్లో తనకున్న అధికారమును కూడ వదలుకొనెను. జ్ఞాతులను పిలిపించి వ్రాతమూలకముగ తన అధికారమును వదలుకొనుచు దానిమీద తన నలుగురు కొడుకులచేత కూడ సంతకములు చేయించెను. ఈ విధముగా ఆయన పూర్తిగా ఆస్తిలేనివాడయ్యెను.

ఇప్పుడు గోకీబహన్ ఖర్చు జరుగు టెట్లు? తన సొంతపనుల కొరకు బాపు ఎన్నడూ ఎవ్వరినీ ధనమడుగడు. అప్పటికిని తన పాతమిత్రుడైన డాక్టరు ప్రాణజీవన్‌దాస్ మెహతాతో గోకీబహన్‌కు నెలకు రు 10 పంపవలసినదని చెప్పెను.

కొన్ని దినముల తర్వాత గోకీబహన్ కుమార్తె విధవయయ్యెను. ఆమె తల్లికడ వచ్చియుండెను. “ఇప్పుడు ఖర్చు ఎక్కువ. దానిని పూర్తిచేసుకొనుటకు మేము యిరుగు పొరుగువారి ధాన్యమును విసరవలసి వచ్చుచున్నది.” అని గోకీబహన్ వ్రాసినది. దానికి జవాబుగ బాపు, “పిండి విసరుట చాల మంచిపని. ఇద్దరి ఆరోగ్యము బాగుగా

నుండును. మేముకూడ ఆశ్రమములో పిండి విసరుదుము.”
అని వ్రాసెను. దాని తర్వాత యింకను యిట్లు వ్రాసెను.
“మీ మనస్సునకు నచ్చినప్పుడు మీ రిద్దరు ఆశ్రమమునకు
వచ్చి చేతనైన ప్రజాసేవ చేయుటకు పూర్తి అధికార
మున్నది. మేమెట్లుందుమో, అట్లే మీరు కూడ ఉండ
వచ్చును. మీ యింటి వద్దకు నేనేమీ పంపించలేను. నా
స్నేహితులకు పంపమని చెప్పలేను.”

పిండివిసరేపని చేయగల సోదరికి ఆశ్రమజీవిత
మేమంత కష్టమనిపించజాలదు. కాని ఆశ్రమములో
హరిజనులుకూడ ఉన్నారుకదా? వారితో కలసి ఉండుట,
తినుట, త్రాగుట పురాతన పద్ధతికి చెందిన వారికెట్లు
కుదురును?

సోదరి రాలేదు. కేవలమొక్కసారి బాపూను
కలియుటకు వచ్చినది. అప్పుడు నేనామె దర్శనము
చేసికొంటిని.

## 95

ఆశ్రమ ప్రారంభమునాటిమాట. మేము కోచరబ్‌లో
ఉంటిమి. మా బంగళాకు ఎదురుగనున్న రోడ్డుకవతల
ఒక బావిఉండెను. దానినుండి నీరుతెచ్చేవారము. ఆశ్రమ
ములో నౌకరెవ్వడూ లేకుండెను. అంతపనిని మేము మా
చేతులతోనే చేసెడివారము.

మధ్య మధ్య బాపూనకు బొంబాయి పోవలసి
వచ్చెడిది. మూడవతరగతిలో ప్రయాణము. రాత్రంతా

జాగరణము. తర్వాత పగలంతా పని. పిమ్మట రాత్రి నిద్ర. మొదట బాపు ప్రక్కమీదకు చేరినంతనే నిద్రపోయెడివాడనుకొనేవాడను. కాని అదిసరికాదు. అక్కడకూడ పూజ్య బాపూతో అస్పృశ్యతా నివారణవిషయమై చర్చ జరిగెడిది. ఆశ్రమములో ఒక హరిజనకుటుంబము చేరినది. వారి చేతి భోజనం తినుట బాకు యిష్టములేదు. అందుకని పాపమామె ఫలహారముమీదనే ఉండెడిది. కాని బాపు దీనిని ఎట్లు సహించగలడు ? ఆయన, "ఆశ్రమములో అంటరానితనం సాగజాలదు. ఈ భేదభావమును ఉంచుకొనదలచినచో రాజకోట వెళ్ళి ఉండు. నాతో ఉండటానికి వీలులేదు." అని అనెడివాడు. చాల రాత్రివరకు యిద్దరిమధ్య యీ ఘర్షణ సాగుచుండెడిది. ప్రొద్దుట లేవడముతోనే రామదాసు, దేవదాసుకూడ బాకు "ఏంబా! దక్షిణాఫ్రికాలో హరిజనులు ముట్టుకొన్నది నీకు సరిపోయెది. ఇక్కడ ఎందుకు పనికిరాదు ?" అని నచ్చచెప్ప చూచేవారు. దానికిబా, "అది పరదేశము. అక్కడిమాట వేరు. ఇక్కడ మనదేశములో ఉన్నాము. మన సమాజపు మర్యాదను భంగమొనర్చుటెట్లు ?" అని జవాబు చెప్పేది.

ఇక్కడ బావినుండి నీరు తెచ్చే మా కార్యక్రమము మొదలయ్యెడిది. బాపూకూడ ఒక బిందె తీసికొని వచ్చేవాడు. ఒకరోజున నేను బాపూతో, "బాపూజీ! రాత్రి మీకు బొత్తిగా నిద్రలేదు. మీకు తలనొప్పిగాకూడ నున్నది. ఉదయం నాతో చాలసేపటివరకు పిండివిసరి

నారు. ఇప్పుడుపోయి కొంచెము విశ్రాంతి తీసికొనండి. నీటివిషయము ఏమీ విచారించకండి." అని అంటిని. కాని దానికి బాపు ఒప్పుకొనేవాడా? ఆయనతో వాదించుట వ్యర్థమని నేను, రామదాసు నీళ్ళుతోడుట మొదలు పెట్టితిమి. ఇతర ఆశ్రమవాసులు బిందెలు మున్నగునవి తీసికొనిపోయి ఆశ్రమములో నీరు నింపసాగిరి.

ఇంతలో అవకాశము దొరకగా నేను ఆశ్రమము లోనికి వెళ్ళితిని. అక్కడనున్న చిన్న పెద్ద గిన్నెలన్నీ తీసికొనివచ్చితిని. వాటితోపాటు ఆశ్రమములోనున్న పిల్లలనందరినీ పిలచుకొనివచ్చితిని. అంతట నేను నీళ్ళు తోడి గిన్నెలలోనింపి బాపూను తప్పించి వాటిని యితరులకియ్యసాగితిని. నా కొంటెతనమును పిల్లలుకూడ అర్థము చేసికొనిరి. పరుగెత్తుకొని నాదగ్గరకువచ్చి నిలువసాగిరి. పాపము బాపు తనవంతుకొరకు ఎదురుచూచుచు నిలబడెను. తర్వాత ఆశ్రమములో గిన్నెలు వెదకుటకు పోయెను. అక్కడ ఒక్కటికూడ దొరకలేదు. కాని ఆయన సత్యాగ్రహి కదా? అపజయము నెట్లంగీకరింపగలడు? అక్కడ చిన్నపిల్లలను స్నానముచేయించు ఒకతొట్టి దొరకెను. దానిని తీసుకొని వచ్చి, "దీనిని నింపు" డనెను. దానికి నేను, "దీనిని మీరెట్లు ఎత్తుకొనిపోగలరు?" అంటిని. "చూడు? ఎట్లు ఎత్తుకొనిపోదునో. దీనిని నింపు" డని అనెను.

నేను ఓడిపోతిని. మధ్యరకపు బిందెను ఎత్తి ఆయన నెత్తిమీద పెట్టితిని.

# 96

1919 నాటి మాట. అమృతసరములో జరిగిన అత్యాచారముల పిమ్మట ప్రభుత్వము అత్యాచారముల విచారణ చేయుటకు హంటర్ కమిటీని నియోగించినది. కాంగ్రెసుకు దానివల్ల తృప్తి కలుగ లేదు. అందుచేత కాంగ్రెసు దానిని బహిష్కరించినది.

బహిష్కరించుటయేగాక మనము వేరొకపనిని చేయ గలమన్నమాట యితరులకు తట్టలేదు. కాని బాపు కాంగ్రెసుద్వారా యింకొక విచారణకమిటీని నియమింప జేసి విచారణ మొదలుపెట్టెను. ఆ కమిటీలో చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ, శ్రీ జయకర్, అబ్బాస్ తయ్యాబ్జీ, బాపూవంటి వారెందరో ఉండిరి. విచారణపని మూడునెలలు సాగినది. 1700 మంది సాక్ష్యము తీసికొనబడి నది. అందులో 650 మంది వాఙ్మూలములు ప్రకటింప బడినవి. ఇక రిపోర్టును తయారుచేయవలసి యుండెను.

ఈ సమాచారమునంతను తీసికొని బాపు ఆశ్రమము నకు వచ్చి రిపోర్టు వ్రాయసాగెను. అత్యాచారములను గురించిన వాఙ్మూలాలవల్ల ఆయన ఉడికిపోవుచుండెను. రిపోర్టు వ్రాసేపని అహోరాత్రములు కొనసాగినది. అక్షరాల పగలు, రాత్రి ఇరువదినాలుగుగంటలు వ్రాయుచుండెడి

వాడు. రెండుర్ఘామములకు వ్రాసి వ్రాసి ఎంత అలసిపోయెడి వాడనిన ఆయన శరీరము పనిచేయుటకు నిరాకరించెడిది. ఒకరోజు ఎడమచేతిలో కాగితము, కుడిచేతిలో కలము పట్టుకొని తలగడను ఆనుకొని ఆయన నిద్రపోవుచుండుట నేను చూచితిని. కొన్నిక్షణములు గడిచియుండవచ్చును. ఏదో తప్పుచేసి, పట్టుబడిపోయినట్లు ఉలికిపడి లేచికూర్చుండెను. లేచి మరల వ్రాయుట మొదలుపెట్టెను.

రిపోర్టు పూర్తియైనది. కమిటీముందర పెట్టబడినది. అందరి చేవ్రాళ్ళు అయిన తర్వాత బాపు సభ్యులతో, "మనము చేవ్రాళ్ళు చేసితిమి. కాని దీనితోపాటు మన దేశములో ఇట్టి అత్యాచారములు జరుగుట అసంభవము కావించనంతకాలము మనము విశ్రాంతి తీసికొనమని శపథముచేయవలెను." అని చెప్పెను. కమిటీసభ్యులందరు శపథముచేసిరి.

దీనితర్వాతి చరిత్ర అందరికీ తెలిసినదే.

## 97

1922 నాటి విషయము. ప్రభుత్వము బాపూను నిర్బంధించి సాబర్మతీ జైలుకు పంపెను. ఆయనమీద కేసు నడుపవలసి యుండెను. ఈ మధ్యకాలములో అనేకమంది బాపూతో కలియుటకు వెళ్లేవారు.

సాబర్మతీ జైలులో మంచి గదులు కుడిమూలనున్నవి. ఉరిశిక్షపడిన ఖైదీలను వాటిలో నుంచుచుండుట

చేత వాటికి ఉరిగదులని పేరువచ్చెను. బాపూనుకూడ అక్కడనే ఉంచిరి.

ఒకరోజు నేను బాపూను కలియుటకు వెళ్ళినాను. జైలుగేటుదగ్గర నాకు అబ్బాస్ తయాబ్జీ కలిసెను. ఆయన కూడ బాపూను కలియుటకు వెళ్లుచుండెను. గేటును దాటి కుడివైపు తిరిగి మేము బాపు గదివద్దకు వెళ్ళితిమి. అబ్బాస్ తయాబ్జీని చూచుటతోడనే ఆయనతో కలియుటకు బాపు వరండానుండి లేచి మెట్లను దిగసాగెను. ఇక్కడ అబ్బాస్ సాహెబ్ కూడ వేగముగ ముందరకు పోయెను. ఇద్దరు మెట్లమీదనేకలిసికొనిరి. బాపు తన ఎడమచేతిని అబ్బాస్ సాహెబ్ నడుముమీదవేసి కుడిచేతితో ఆయన గడ్డము పట్టుకొని బుగ్గలుపూరించి బుర్ ర్ ర్ ర్ అనెను. అబ్బాస్ సాహెబ్ కూడ దానికి జవాబుగ బుర్ ర్ ర్ ర్ అనెను. ఇద్దరు నవ్వసాగిరి. నేను ఆ బుర్ ర్ ర్ ర్ నకు అర్థమేమో తెలిసి కొనజాలకపోతిని.

దండి యాత్ర దినములలో (1930 సంవత్సరములో) అబ్బాస్ సాహెబ్ తోపాటు నేను సాబర్మతీ జైలులో నుంటిని. అప్పుడు నేను అబ్బాస్ సాహెబ్ను-"ఆ నాడు బాపూను కలిసికొన్నప్పుడు మీరిద్దరును బుర్ ర్ ర్ ర్ అని అన్నారు. అట్లనుటలో మీ ఉద్దేశమేమిటి." అని అడిగి నాను. దాని కాయన నవ్వుతూ "మేమిద్దరము విదేశములో నున్నప్పుడు బాపూనకు నేను ఒక కథను వినిపించితిని. దానిలో బుర్ ర్ ర్ ర్ అని వచ్చెను. నన్ను కలసినప్పుడు

బాపునకు "అది జ్ఞాపకమునకు వచ్చెను." అనిఆయనచెప్పెను.

అంతట అబ్బాస్ సాహేబ్ ఆ కథనంతను వినిపించెను. కాని దానిని నేను మరచిపోయాను. అప్పుడు ఆ బుర్ర్‌ర్‌నకు నేనొక అర్థమును కల్పించితిని. 1921 వ సంవత్సరములో మనము చేసిన ప్రతిజ్ఞను పాలించుతూ పాలించుతూ నేనిక్కడకు చేరుకున్నాను." అని బాపూ సూచించెను. దానికి అబ్బాస్‌సాహేబ్ "నేనుకూడ తప్పకుండా యిక్కడకు వచ్చెదను" అని సూచించెను. అనునదే యిది.

నేను కల్పించిన యీ అర్థమును అబ్బాస్‌సాహేబ్‌కు వినిపించగా ఆయన, "ఆ సమయమున నా మనస్సులో అట్టిదేదీ లేకుండెను. కాని నీమాట సరియైనదే. మా యిద్దరి సంబంధమట్టిది. నేను జైలుకెట్లు వచ్చానాయని నాకు ఆశ్చర్యముకలుగుచుండును. ఇంతకంటె ఎక్కువ చేయగలనని నాకనిపించకుండుటే విశేషము. నిజముగ బాపు ఒక అద్భుతవ్యక్తి" అని అనెను.

## 98

1936-37 నాటి సంగతి కావచ్చును. ఆ దినములలో బాపు వర్ధాలోని మగన్‌వాడిలో ఉండెను. నేను బోక్‌గామ్‌లో నివసించుచుంటిని. బాపు చాలాపనిచేయుచుండెను. వచ్చిన ఉత్తరములకు జవాబులు వ్రాయుటకే సమయము దొరికెడిదికాదు. అందుకని రాత్రి రెండు మూడు గంటలకు నిద్రలేచి వ్రాసెడివాడు. ఈ మాటవిని

నేనూరుకుండ లేకపోతిని. యుక్తిగా ఆయనతో, "బాపూ! మీరు దక్షిణాఫ్రికాలో, 'ఆరోగ్యవిషయంలో సామాన్య జ్ఞానము' అని ఒక పుస్తకము వ్రాసినారు. దానిలో ఆహారము, మలవిసర్జననుండి అన్ని విషయములు వచ్చినవి. కాని ఒక్కమాట మిగిలిపోయినది." అని మొదలుపెట్టాను. బాపూ వెంటనే, "అది ఏది?" అని అడిగెను. దానికి నేను "నిద్ర విషయములో దానిలో ఒక్క ప్రకరణముకూడా లేదు." అని అంటిని. దానికి బాపు, నిద్ర విషయములో వ్రాయవలసినదేమున్నది? మనుష్యునకు నిద్రవచ్చినప్పుడు నిద్రపోతాడు. ఇంతకంటె ఎక్కువ ఏమి వ్రాయగలము?" అని అనెను. దానికి నేను, "ఇదేసంగతి. మీరు వేళకు తింటారు. అందులోను కొలిచి, తూచి తింటారు. పగలంతా కార్యక్రమము ఉండనే ఉంటుంది. మీ దగ్గరకు వచ్చువారి న్యాయమైన కోర్కెలను తీర్చుతారు. ఎవరైనా ఉత్తరము వ్రాస్తే దానికి జవాబు వ్రాస్తారు. కాని నిద్ర మీదనే అత్యాచారము జరుగుచున్నది. పని ఎక్కువైతే పాపము నిద్ర ఎగిరిపోతున్నది. ఇదెట్లు కొనసాగగలదు? ఆహారోపవాసమును ప్రకృతి సహించగలదు. కాని నిద్రోపవాసమునకు నష్టపరిహారము చెల్లింపవలసియే యుండును." అని అన్నాను.

నేను నా మర్యాదను దాటి మాట్లాడుచున్నానని నాకు తెలియును. కాని నేనుమాత్ర మేమిచేయగలను? ఊరకుండ లేకపోతిని, అందుచేత అట్లు మాట్లాడితిని.

బాపు గంభీరుడై "మీరు చెప్పుదాని కర్థము నేను గీతా ధర్మమును పాటించుట లేదని. శరీరము ఎంత పని చేయగలదో అంతపనినే నేను దానినుండి తీసికొను చున్నాను. నేను చేయుచున్నపని నా పని యని నే నను కోను. అది భగవంతుని పని. దాని విషయమైన చింత ఆయనకు గలదు. నా వంతు వచ్చినపనిని చేయుటకే నేను బాధ్యుడను. అంతకంటె ఎక్కువపని చేసినచో అది అభి మానముతో కూడినదగును." అని చెప్పెను.

కొన్ని దినములు గడచినవి. ఒకరోజున నేను బోర్ గామ్‌నుండి మగన్‌వాడికివచ్చాను. అప్పుడు మహాదేవ భాయి "నేడు బాపు శరీరస్థితి సరిగాలేదు. నిద్రపోయి ప్రొద్దున్న లేస్తూనే ఆయన 'నేడు నా శరీరస్థితి బాగుండ లేదు. రక్తపుపోటు ఎక్కువై యుండవచ్చును. డాక్టరును పిలచుట మంచిదేనని ఆయన చెప్పెను. అని నాతో చెప్పెను." "నేటివరకు బాపు ఎన్నడు తనంతట తాను డాక్టరును పిలిపించమని చెప్పలేదు." అనికూడ మహా దేవభాయి అనెను.

నేను బుద్ధిపూర్వకముగనే బాపూతో కలియుటకు వెళ్ళలేదు. సాయంకాల ప్రార్థనతర్వాత బాపు తన శరీర స్థితినిగురించే చెప్పసాగెను. "నేను పూర్తిగా గీతాధర్మ మును పాటించుటలేదు. అని ప్రారంభించెను.

నేను పాత సంగతి మరచిపోయాను. కాని యీ వాక్యమువల్ల ఆ రోజున మా యిద్దరిమధ్య జరిగిన సంవా

దము జ్ఞాపకము వచ్చినది. బాపు నేను ఏదైనా చెప్పుటకు ముందే యీ వాక్యముతో ఆయన నా నోరు మూసివేశాడని మనసులో అనుకొంటిని.

అప్పటినుండి బాపు సరిగా నిద్రపోవుట మొదలు పెట్టెను.

## 99

దక్షిణాఫ్రికాలో పఠానులు బాపూనుకొట్టి ఆయన చచ్చిపోయాడన్న అభిప్రాయముతో వదలి వెళ్ళిపోయిరి. స్పృహవస్తూనే బాపు, "అతడు నన్ను చావకొట్టాడు, కాని అతనికి శిక్ష పడరాదు. నేనాతనిని మనఃపూర్వకముగ క్షమించుచున్నాను." అని చెప్పెను.*

ఆ రోజునుండి బాపు పరమిత్రుడైన మిస్టరు కల్లెన్‌బక్ ఆయనను ఒంటరిగా ఎక్కడకు పోనిచ్చేవాడు కాదు. కల్లెన్‌బక్ ఆజానుబాహువు. బలిష్ఠుడు. మల్లయుద్ధము ముష్టియుద్ధము మొదలైనవన్నీ తెలిసినవాడు. బాపు వెళ్ళిన చోటకల్లా అంగరక్షకుడుగా ఆయన వెంట వెళ్లేవాడు.

ఒకరోజున బాపు ఏదో సభకు వెళ్ళెను. అక్కడ బాపూను తెల్లవాళ్లు కొట్టబోవుచున్నారని కల్లెన్‌బక్‌కు తెలిసెను. ఆయన తన పంట్లాము జేబులో రివాల్వరు నుంచు కొనెను. ఆయన రివాల్వరు తీసికొని బయలుదేరినాడని బాపూనకు తెలియుటతోడనే చాల కోపించి, "నీ రివాల్వరు అట్లాఉంచు. నీ నమ్మకము భగవంతునిమీదనా?

* ఈ కథంతా ఆయన ఆత్మకథలో వచ్చెను.

రివాల్వరుమీదనా ? నా రక్షణకొరకు నా వెంట రావలసిన అవసరమేమున్నది ? నేను భగవానుని చేతిలో సురక్షితుడను గాలేనా ? నా వలన పనితీసికొనవలసినంతకాలము ఆయన నన్ను రక్షించును." అని చెప్పసాగెను.

దీనితర్వాత జరిగిన ఒక సంఘటన తెల్లవాండ్లసభ. కల్లెన్‌బక్ అక్కడికి వెళ్లెను. సభకు చివరి అంచున నిలబడియుండెను. అక్కడ ఒక ఉపన్యాసకునితోనో లేక శ్రోతతోనో అతనికి జగడమైనది. ఇంగ్లీషువాండ్లకు పోట్లాటలంటే చాల యిష్టము. బలమున్నను లేకపోయినను దెబ్బలాటకు చాకా చేతులు తొందరగా పైకిమడిచెదరు. ఆ యింగ్లీషువాడు కల్లెన్‌బక్‌ను "Come along let us fight it out" (కొట్లాటకు రమ్మని) బెదరించెను. కెల్లన్‌బక్ శాంత స్వరముతో 'I am not going to fight you' (నేను నీతో పోట్లాడబోవుటలేదు) అని జవాబిచ్చెను. అక్కడ ఉన్న వారందరు స్తంభితులై చూస్తూ ఉండిపోయిరి. కల్లెన్‌బక్ బలమును- కుస్తీలో అతని కౌశల్యమును అందరెరుగుదురు. ఆతని నెవ్వరూ పిరికివాడనలేరు. పిరికివాడైనను పోరుకు పిలువబడినప్పుడట్లు ఊరకుండగలడా ? అందరు ఆశ్చర్య పడిరి.

ఈ కథను నేను, మగన్‌లాల్‌భాయి గాంధీనుండి వింటిమి.

## 100

చంపారన్‌కు సంబంధించినసంగతి. ప్రజపై జరుగు

చున్న అత్యాచారముల విషయము, అన్యాయముల విష యము. బాపూచేత జరుపబడుచున్న విచారణమూలమున ప్రజలలో చైతన్యము బయలుదేరినది. అనేకచోట్ల బాపు పెట్టిన పాఠశాలల ప్రభావముకూడ ప్రజలమీదపడినది. నీలిమందుతోటల యజమానులయిన తెల్లవాండ్రు చాల చింతలో పడిపోయిరి.

ఎవరో బాపుతో, "ఇక్కడి నీలిమందుతోటల యజ మాని అందరికంటె చాల దుష్టుడు. మిమ్ములను చంపివేయ గోరుచున్నాడు. అందుకు హంతకులను నియోగించి నాడు." అని చెప్పెను.

అది వింటూనే ఒకరోజురాత్రి బాపు ఆతని బంగ ళాకు వెళ్ళి, "నన్ను చంపివేయుటకు మీరు హంతకులను నియోగించినారని వినుచున్నాను. అందుకని ఎవ్వరితో చెప్పకుండా ఒంటరిగా వచ్చాను." అని చెప్పెను.

పాపమా నీలిమందుతోట యజమాని నివ్వెర పోయెను.

# 101

1917 సంవత్సరమునాటి సంగతికావచ్చును. బాపు ఆశ్రమములో సాయంకాల ప్రార్థన తర్వాత తన ప్రక్కమీద తలగడ సహాయముతో కూర్చుండి మాట్లాడు చుండెను. బాపూనకు చలిగాలి తగులునను ఉద్దేశముతో పూజ్యురాలగు 'బా' ఒకదుప్పటిని నాలుగు మడతలక్రింద మడిచి ఆయన వీపుమీద వేసెను. ఆశ్రమవాసియైన

శ్రీ రాజీవభాయి పటేలుతో బాపు మాట్లాడుచుండెను. రాజీవభాయి పటేలునకు దుప్పటిమీద నల్లటి గీతవలె ఏదో కనిపించినది. పరిశీలనాదృష్టితో చూడగ పెద్ద నల్లటి పాము వెనుకనుండివచ్చి బాపు భుజమువరకుపాకి ముందు దారి చూచుకొనుటకు యిటునటు చూచుచుండెను. రాజీవభాయి ధ్యానభంగముతో తన భుజమువైపు చూచుట బాపు గమనించి, "రాజీవభాయి! ఏమిటి విషయము?"ని అడిగెను. బాపూనకుకూడ వీపుమీద ఏదో బరువున్నట్లనిపించెను. రాజీవభాయిలో సమయస్ఫూర్తి బాగా ఉన్నది. బిగ్గరగా చెప్పినచో బా మొదలగువారందరు భయపడిపోయెదరని గడబిడవల్ల పాముకూడ కంగారుపడిపోవునని రాజీవభాయి ఆలోచించెను. ఆయన నెమ్మదిగా "ఏమీ లేదు, ఒక పాము మీ వీపుమీదనున్నది. మీరేమీ కదలకుండ ఉండండి." అని మెల్లగ చెప్పెను. దానికి బాపు, నేను కదలకుండనుండెదను. కాని నీవేమిచేయదలచుకున్నావు?" అని అడిగెను. దానికి రాజీవభాయి, "నేనుదుప్పటి నాలుగు మూలలను పట్టుకొని పాముసమేతముగ దుప్పటిని తీసి వేసెదను." అని జవాబుచెప్పెను. ఈ అలికిడి విని పాము దుప్పటిలోనికి దూరిపోయెను. బాపు, "నేను నిశ్చేష్టుని వలె కూర్చుండెదను కాని నీ విషయమై జాగ్రత్త" అని చెప్పెను.

రాజీవభాయి దుప్పటినితీసి దానిని దూరముగ

తీసికొనిపోయెను. పాము దుప్పటిలోనుండి బయటకురాగానే
దానిని దూరముగా పారవేసెను *

ఒక నాగుపాము వచ్చి బాపు తలమీద పడగవిప్పిన
దని, ఆయన చక్రవర్తి కాబోవుచున్నాడని రెండవరోజు
పత్రికలలో వార్త ప్రకటింపబడినది. ఒక మిత్రుడు—"పాము
ఆయన భుజమువరకే పోయినది. శిరస్సుమీదకు పోయి
ఉండినచో ఆయన తప్పక భారతదేశానికి చక్రవర్తి
అయ్యేడువాడు." అని నాతో చెప్పెను.

ఒకరోజున యీ సంఘటన జ్ఞాపకమువచ్చి నేను
బాపూను మీ శరీరముమీద పాము ప్రాకినప్పుడు మీ
మనస్సులో ఏమేమి ఆలోచనలు వచ్చినవని అడిగినాను.
ఆయన, "ఒకక్షణముమాత్రము నేను భయపడిపోతిని.
కాని అది ఆ క్షణముమాత్రమే. తర్వాత వెంటనే సర్దు
కొంటిని. పిమ్మట ఏమీఅనిపించలేదు. ఈ పాము నన్ను
కాటువేసినచో కనీసము దానిని చంపవద్దని అందరికి చెప్ప
వలెనని ఆలోచన తట్టినది. ఏదైన పామును చూచుట
తోడనే దానిని చంపుటకు మీరు తయారగుదురు. అట్లు
చేయకుండ యింతవరకు నేనెవ్వరిని ఆపలేదు. కాని యీ
పాము నన్ను కరచినదికాబట్టి దానికి అభయదానము
లభించవలెను." అని చెప్పెను.

---

* శ్రీ రాజీవభాయి తన పుస్తకములో యీ కథను సవిస్తరముగ
వ్రాసెను. నాకు జ్ఞాపకమున్నట్లు నే నిక్కడ యిచ్చితిని.